## సంక్రాంతి శుభాకాంక్షలతో

కె.బాలచందర్

# తొలికోడికూసింది

కుమారి రంజిత్‌కుమార్










ముఖచిత్రం : భూపాలం

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 43 జనవరి 1981 సంచిక 1

## పాఠకులకు

## యువ

## నూతన సంవత్సర శుభాకాంక్షలు

# 1980 చక్రపాణి అవార్డు గ్రహీతల పరిచయాలు



నవలలు

మొదటి అవార్డు పొందిన

**శ్రీమతి జి. జయశ్రీ సంజీవి**

వీరి స్వస్థలం- విశాఖపట్నం; భర్త ప్రభుత్వోద్యోగంద్వారా హైదరాబాద్‌లో ఉంటున్నారు. చదువుకొనే దశనుంచే సాహిత్యంమీద అభిలాష పెంచుకున్న వీరు చాల కథలు, కవితలు, వ్యాసాలు వ్రాశారు. అవన్నీ వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. మొదటి అవార్డుపొందిన 'బంధం' అనేది వీరి రెండో నవల. వీరు చాలా కాలంగా 'విశాఖ సాహితి' సభ్యురాలుగా ఉన్నారు. 'అజంతా' 'చక్రవర్తులు' అనే కలంపేర్లతో లోగడ కొన్ని రచనలు చేశారు. 'యువ'కు వీరు కొత్తవారు కారు. ఇదివరలో కొన్ని కథలు 'యువ'లో వచ్చాయి.



**రెండో అవార్డు పొందిన**

**శ్రీమతి కె. లలితాచలం**

చిన్నతనంనుంచీ లలితకళలంటే విశేషాభినంగల లలితాచలంగారు తమ రచనలద్వారా పత్రికలకు, రేడియోకు, టి. వి. కి, రంగస్థలానికి చిరపరిచితులు. వీరికి బాలసాహిత్యంపై మక్కువ ఎక్కువైనా పెద్దలకు పనికివచ్చే కథలూ, నవలలూ, నాటికలూ చాలా వ్రాశారు. సందేశాత్మకమైన రచనలు చేయాలనే వీరి ఆశకూ, అభిలాషకూ, కృషికీ మా శ్రీవారు శ్రీరామరక్ష అనీ, వారి ప్రోత్సాహమే రచనావ్యాసంగానికి ఆయువుపట్టనీ వీరు చెబుతున్నారు. నివాసం: హైదరాబాద్.



**మూడో అవార్డు పొందిన**

**శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం**

దాదాపు 200 కథలూ, 20 నవలికలూ వ్రాసిన శ్రీ రామచంద్రంగారు పాఠకులకు సుపరిచితులే, 1940 లో నర్సీపట్నంలో పుట్టిన వీరు, ప్రస్తుతం అనకాపల్లిలో జీవిత భీమా సంస్థలో ఉద్యోగం చేస్తున్నారు. రచనకు కొత్తదనమే ప్రాణం అనేది వీరి ప్రగాఢ విశ్వాసం. ఆ విశ్వాస బలంతోనే రచనలు చేస్తున్నారు.

కథలు



మొదటి అవార్డు పొందిన

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

రాయలసీమలో 'జక్కిదనం' అనే ఓ మారుమూల పల్లెలో జన్మించిన వీరు దాదాపు రెండు దశాబ్దాలనుంచీ సాహితీ జీవనం కొనసాగిస్తున్నారు. 'జానపద కవికోకిల' 'నటశేఖరుడు' అనే బిరుదుగల వీరు 'సాహిత్యం-నాటకం' నా రెండు కన్నులు అనీ; ఆశ మనిషిని జీవింపజేస్తే- ఆ జీవితాన్ని ఈ కళలకు అంకితం చేయాలన్నదే ధ్యేయం అనీ చెబుతున్నారు. రాయలసీమ మాండలికంతో, నుడికారపు సొగసులతో దాదాపు అరవై బరువైన కథలు వ్రాశారు.



రెండో అవార్డు పొందిన

శ్రీమతి డి. శిరీష

తెనాలిలో జన్మించి, పెక్కు ప్రదేశాల్లో పెరిగిన వీరు బి. కాం. పూర్తిచేసి, బ్యాంక్ ఆఫ్ ఇండియా, విజయవాడలో అకౌంట్స్ క్లర్క్‌గా పనిచేస్తున్నారు. వాస్తవికతా, ఆర్ద్రతా, సర్దుబాటు గురించి జీవితంలో సంఘర్షణను ప్రతిబింబించే రచనలు ఎన్నో చేశారు. వివిధ పత్రికలలో ఆ రచనలు చోటు చేసుకున్నాయి.



## మూడో అవార్డు పొందిన
## శ్రీ వల్లూరు శివప్రసాద్

వ్రాసిన నాలుగు కథల్లో మూడు కథలకు బహుమతులు పొందిన వీరు తెనాలి తాలూకా కొలకలూరులో కేవలం పాతికసంవత్సరాల క్రితమే పుట్టారు. ఉద్యోగరీత్యా చిట్టగుంటలో ఉంటున్నారు. ఇంకా అవివాహితులైన వీరు నాలుగు నాటికలూ, ఒక నాటకంకూడా వ్రాశారు. ఇంకా మంచి రచనలు చేయాలనేది వీరి అకాంక్ష.



## నాలుగో అవార్డు పొందిన
## శ్రీ ఇ. సత్యనారాయణరావు

వీరి వయస్సు: 24 సంవత్సరాలు. స్వస్థలం: భద్రాచలం. చదువు: బి. కాం., వృత్తి: వ్యాపారం. పూర్వరచనలు— చెప్పుకోదగినవి కావు: సరదాలు: ప్రత్యేకమైనవి ఏమీ లేవు; ఆశయాలు— 'చెప్పినందున ప్రయోజనమేమీ లేదు,' అని వీరు స్పష్టంగా తెలియజేశారు.




రాత్రి చాలా భాగం గడిచిపోయింది.

వెన్నెల విరగ గాస్తోంది.

రాత్రి తరిగిపోతోంది.

వెన్నెల కరిగిపోతోంది.

సుమిత్రకు నిద్ర రావడంలేదు.

బెడ్‌మీద మహేశ్వర్రావు హాయిగా నిద్రపోతున్నాడు.

ఆమె అతనివేపు చూసి నిట్టూర్చింది.

ఎందుకో ఏడ్వాలనిపించింది.

ఏడ్చినా కన్నీళ్ళు రావు.

ఏనాడో కన్నీళ్లు ఖర్చుచేసేసిందామె.

హృదయంలో అశాంతి.

మెలిపెడుతున్న బాధ.

తెలియని వ్యథ-చిత్రవధ.

బెడ్‌మీంచి లేచి కిటికీ దగ్గరకు వచ్చింది.

చంద్రుడు వెలిగిపోతున్నాడు.

చల్లగా గాలి వీస్తోంది.

ఆహ్లాదంగా వున్న వాతావరణం.

ఆనందాన్ని పంచుకునే తరుణం.

వయసు వున్నా అనుభవించే రుణం తనకి లేదు.

ఈ వెన్నెల వృధా....బ్రతుకు వృధా!

ఎన్నో వెన్నెల రాత్రులు .. మరెన్నో వసంతాలు గడిచిపోయాయి.

తనకి సుఖంలేదు....సంతోషం లేదు.

పేరుకి భర్త.... తాళికట్టిన మగాడు. అందరి దృష్టిలో మొగుడు.... ఆస్తి-అంతస్తులున్నాయి. అనుభవించే జీవితం వుంది.

కానీ - తనకంటూ ఏమీ లేకుండా పోయాయి.

అతను సంపాదనకోసం తెగ కష్ట పడతాడు. తనకోసం ఒక్క రాత్రికూడా కష్టపడడు.

ఇంట్లో పెళ్ళాం గురించి పట్టించు కోడు.

ఒకోసారి నెలల తరబడి యింటికే రాడు. ఊళ్ళో వున్నప్పుడు ఏ అర్ధ రాత్రో యింటికి చేరుకుంటాడు.

అలసిపోయి హాయిగా నిద్రపోతాడు.

అంతేగానీ తనకంటూ పెళ్ళాం వుందని-

దానికీ కోరికలున్నాయని - వాటిని తీర్చే బాధ్యత భర్తగా తనకుందని ఏనాడు అతను అనుకోడు.

పెళ్ళయి నాలుగేళ్ళవుతున్నా భర్త నుంచి తను ఆశించిందంటూ ఏమీలేదు - యిక ముందు ముందు వుంటుందనే ఆశ లేదు.

అతని మీద అసహ్యం పెరిగి పోయింది.

పెళ్ళికి ముందు తన జీవితం గురించి ఎన్నో కలలు కంది.

పెళ్ళిచూపులప్పుడు అతన్ని చూసి తన కలలు నిజమవుతా యనుకుంది.

పెళ్ళి అయ్యాక కలలు కలలుగానే వుండిపోయాయి.

చివరికి కన్నీళ్ళు మిగిలిపోయి — యింకిపోయాయి.

దాంపత్య జీవితం ఇంత ఘోరంగా వుంటుందా ?

అందరూ ఇలాగే కాపురం చేస్తు న్నారా-?

తను ఆడది.

భర్తను సమస్తం కోరుకోగలదు.

కానీ-సిగ్గువిడిచి యింకేదో కావాలని ఎలా అడగగలదు ?

అక్కడికే తను ఆడదాన్నని.... తనకూ సిగ్గువుందని మరచిపోయి అతని ముందు చాలాసార్లు బయటపడిపోయింది.

అతనిలో చలనం వుండేది కాదు.

విసిగి వేసారిపోయింది.

అతని గురించి పట్టించుకోవడం మానేసింది.

అతను ఎప్పుడు యింటికి వస్తాడో, ఎప్పుడు పోతాడో ఆమెకే తెలీదు.

తన జీవితం ఇంతేనా ?

తన బ్రతుకు యిదేనా ?

ఎన్నోసార్లు కుమిలిపోయింది.

అశాంతితో అలమటించిపోయింది.

అటువంటి సమయంలో —

ఎదురుగా వున్న పెంకుటింట్లో అత నెవరో అద్దెకు దిగాడు.

అతని పేరు వేణుగోపాల్ అని తెలుసుకుంది.

చదువుకున్న కుర్రాడు_ఏదో ప్రైవేట్ కంపెనీలో జాబ్ చేస్తున్నాడట.

ఆమె బాల్కానీలోంచి మొదటి సారిగా అతన్ని చూసినప్పుడు, ఆమె చూపులు అతనిమీద నిలిచిపోయాయి.

అతని రూపం ఆకర్షించింది.

పరాయి మగాడివేపు అలా చూడడం ....చూసి ఏవేవో వూహించుకోవడం ఆమెకు తప్పుగా తోచలేదు.

పనిమనిషి ద్వారా కొన్ని విషయాలు తెలిశాయి.

అతని కింకా పెళ్ళికాలేదట_ మంచి ఉద్యోగం వచ్చేంతవరకూ పెళ్ళిచేసుకోడట.

అతను వంటరివాడని తెలిసిన తరువాత, సుమిత్ర మనసులో ఏవో ఆలోచన్లు ఎదిగిపోయాయి.

రోజూ అతను ఆఫీసుకి వెళ తున్నప్పుడు, తిరిగి వస్తున్నప్పుడు బాల్కానీమీంచి చూస్తుండేది.

అతని చేతిలో ఎప్పుడూ ఏవో పత్రికలుండేవి.

అతను పత్రికలు విపరీతంగా చదువుతాడని తెలిసింది.

పనిమనిషి ద్వారా అతన్నుంచి పత్రికలు తెప్పించుకొని చదివేది.

అలా అట్నుంచి యిటూ, యిట్నుంచి అటూ పత్రికలు ట్రాన్స్ఫర్ అవుతుండేవి.

అతన్ని చూసి ఆమె బాల్కానీలోంచి నవ్వేది.

ఆమెనవ్వును రిసీవ్ చేసుకొని అతనూ నవ్వేవాడు.

ఆమె పులకించిపోయేది.

ఆ పులకింత ఏదో అనిపించేది.

ఆ ఏదో ఏమిటో ఆమెకు తెలిసేది కాదు.

యిలా చూపులూ....నవ్వులూ అయిపోయాక ... అవి పాతబడిపోయాక, వారి మధ్య ధైర్యం, ధైర్యంగా నిలబడింది.

ధైర్యం వచ్చాక పత్రికల్లో ఏవో పిచ్చిరాతలు రాసుకొనేవారు.

పిచ్చిరాతలు చదివాక ఆమె తలరాత ఏవిధంగా వుందో అతనికి అర్థమయిపోయింది.

మనసులో సానుభూతి నిండిపోయింది.

తన సానుభూతిని పత్రికలో జాగ్రత్తగా మడతబెట్టి పంపాడు

ఫలితంగా _?

ఓ అర్ధరాత్రి అతను గోడదూకి ఆమె గదిలోకి ప్రవేశించాడు.

ఆ గదిలో అతనికోసం వేచివున్న ఆమె....ఆమెతో పాటు బెడ్....బెడ్ మీద విరిసిన మల్లెలు నిరీక్షిస్తూ కనిపించాయి.

ఆ రాత్రి ఆమె....ఆమెతో పాటు బెడ్ .... బెడ్మీద మల్లెలు నలిగిపోయాయి.

ఆమె మొదటిసారిగా అతనిలో మగవాడ్ని చూసింది.

ఈ మగాడి ముందు తన మొగుడు పొయ్యిలో కాలని కట్టెలా అయిపోయాడు.

అంతే! ఆమె జీవితానికో అర్థం బోధపడింది.

మొగుడులేని రాత్రి ఆమెకో స్వర్గం.

మొగుడు వున్న రాత్రి ఆమెకో నరకం.

ఇది ఆమె తప్పుకాదు.

ఇటువంటి తప్పులుచేసే భర్తచాటు ఆడవాళ్ళు చాలమంది ఉన్నారు.

అందరి తప్పులు యీ రకమైనవిగా వుండకపోవచ్చు.

కానీ — అన్ని తప్పులకు హేతువు పరిస్థితులు.

ఈ పరిస్థితులే ఆడవాళ్ళని దిగజార్చేస్తున్నాయి. వీధిన పడేస్తున్నాయి—కాపురాల్ని కూల్చేస్తున్నాయి.

దీనికి బాధ్యులెవరు? ఎవరు?

ఎవరో వారెవరో ఎవరికివారే ఆలోచించుకోవాలి.

ప్రేమయినా....పిచ్చయినా .... మరేదయినా సరే, తలకెక్కినవారు వాటికి దూరంగా పారిపోలేరు. ఉన్మాదితో ఎక్కడికో పరుగెడుతుంటారు.

ఆమె అతనికోసం పరిగెత్తింది.

ఎంతదూరమని....యింకెంత కాలమని అలసిపోయింది.

అతనితో జీవితాంతం ఉండిపోవాలనిపించింది.

అతను కావాలనుకుంటే మొగుడ్ని వదులుకోవాలి-వదిలించుకోవాలి - ఎలా?

విడాకులు తీసుకోవాలి.

వాటిని అడిగే ధైర్యం ఆమెకు లేదు.

మరేం చేయాలి? పారిపోవాలి.

ఎవరికీ అందనంత దూరం....కనిపించని చోటుకి వెళ్ళిపోవాలి.

అలా అనుకున్న తరువాత ఆమె కో తెగింపు వచ్చేసింది.

తెగింపు తన తెరచాటు బ్రతుక్కి—ముగింపు అనుకుంది.

ఓ వెన్నెల రాత్రి వేణుగోపాల్ కౌగిలిలో హాయిగా వదిగిపోయినప్పుడు తన అభిప్రాయం అతనికి చెప్పింది.

అతను మౌనంగా ఆలోచిస్తూండిపోయాడు.

ఆమెను వదులుకోవడం ఇష్టంలేదు.

అమె చెప్పినట్లు లేచిపోవాలి.

ఎక్కడికని వెళ్ళాలి....వెళ్ళి ఏం చెయాలి?

సమస్య పరిష్కారం కావడంలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్" అందామె.

"ఆఁ .... ఏమిలేదు....మరోసారి ఆలోచించు సుమిత్ర."

"బాగా ఆలోచించే యీ నిర్ణయం తీసుకున్నాను."

"ఇక్కడ ఉద్యోగం వదిలేసి, మరో చోట కెళ్ళి ఎలా బ్రతకాలి?

"దాందేవుంది నా దగ్గర యిరవై కాసుల బంగారం వుంది. కూడా ఎంతో కొంత డబ్బు తీసుకొస్తాను. నీకు వుద్యోగం వచ్చేంత వరకూ మన డబ్బే మనల్ని బ్రతికిస్తుంది.

ఆమె చెప్పింది బాగానే వుందని పించింది.

అంగీకరించాడు. "మరెప్పుడు వెళదాం?"

"ఆయన రేపు క్యాంపునుంచి వస్తున్నారు. మళ్ళీ ఎప్పుడు వెళ్ళిపోతారో తెలీదు .. తెలుసుకొని నీకు చెపుతాను."

ఆ రాత్రికి యిద్దరూ విడిపోయారు.

ఎక్కడో కోడి కూసింది.

అప్పుడే తెల్లారిపోవస్తోంది.

సుమిత్ర కిటికీ దగ్గర్నుంచి నడిచి మెల్లిగా బెడ్ ఎక్కింది.

ఆమె లేచేసరికి పుదయం పది గంట లయింది.

అప్పటికే మహేశ్వర్రావు బయటకు వెళ్ళిపోయాడు.

బాల్కనీలోకి వచ్చి చూసింది.

అప్పుడే వేణుగోపాల్ ఆఫీసు కెళుతూ కనిపించాడు.

ఆమెను చూసి చిన్నగా నవ్వేడు.

అతను వీధి మలుపు తిరిగేంతవరకూ చూస్తుండిపోయింది.

ఆ పగలంతా మహేశ్వర్రావు యింటికి రాలేదు. అతను సాధారణంగా యింటికి రాడు ఏదో హోటల్లో భోజనం చేసేస్తాడు.

రాత్రి పన్నెండు గంటల సమయంలో అతను యింటి కొచ్చాడు.

వస్తూనే బెడ్ ఎక్కేశాడు.

సుమిత్రకు మెలుకువవచ్చి చూసింది.

అతను దుప్పట్ని మీదకు లాక్కుంటూ కనిపించాడు.

ఆమెకు వళ్ళు మండిపోయింది.

దుప్పట్ని తప్ప తన్నెప్పుడూ మీదకు లాక్కోడు.

"ఎప్పుడొచ్చారు" అడిగిందామె.

మహేశ్వర్రావు వులిక్కిపడిచూశాడు. "నువ్వింకా మేలుకొనే వున్నావా?"

"ఇప్పుడే మెలుకువ వచ్చింది."

"ఏదో అడిగావ్".

"మీరు మళ్ళీ ఎప్పుడెళుతున్నారు?"

అతను ఆశ్చర్యంగా భార్య మొహం లోకి చూశాడు. ఆమె ఎప్పుడూ అలా అడిగివుండలేదు. "రేపు రాత్రి పది గంటల ట్రైన్‌లో వెళుతున్నాను."

ఆమె మరేం మాట్లడకుండా కళ్ళు మూసుకుంది.

ఉదయం ఆమె త్వరగానే లేచింది.

బెడ్‌మీద భర్త కనిపించలేదు.

బాత్ రూమ్ లో కెళ్ళి మొహం కడుక్కొని వచ్చింది.

మహేశ్వర్రావు హాల్లో పేపరు చదువుతూ కనిపించాడు.

ఆమెను చూసి చిన్నగా నవ్వేడు. "సుమిత్రా యీ వార్త చదువుతాను, విను".

"నాకు వినే వోపికలేదు" అనేసి ఆమె వెళ్ళబోయింది.

"కాదు చాలా యింట్రస్టింగ్ మేటర్"

తప్పనిసరియై కూర్చుంటూ "చదవొద్దు గాని, చెప్పు వింటాను" అంది.

"ఇద్దరు యువతీ యువకులు ప్రేమించుకున్నారట — వాళ్ల పెళ్ళికి పెద్దవాళ్ళు అంగీకరించలేదు. అందుకని వాళ్లు లేచిపోయారు. పెళ్ళి చేసుకొని, యిల్లు దొరక్క, లాడ్జిలో కాపురం పెట్టారట. అతనికి వుద్యోగం లేదు. తీవ్రంగా ప్రయత్నించినా ఫలితం శూన్యం. వెంట తెచ్చుకున్న డబ్బులు అయిపోయాయి — లాడ్జి బిల్లు పెరిగిపోయింది. ఆకలి వాళ్లను మాడ్చేసింది. బ్రతికేమార్గం కనిపించక వాళ్లిద్దరూ విషం త్రాగి లాడ్జి రూమ్‌లో ఆత్మహత్య చేసుకున్నారట. అదీ విషయం....అందుకనే లేచిపోవడం తేలికే...కాని తెలియని వూళ్లో బ్రతకడం కష్టం సుమిత్రా".

ఆమె మొహం పాలిపోయింది.

అతనన్న చివరిమాటలు గుండెల్లో బాకుల్లా దిగబడిపోయాయి.

ఈ వార్త చెప్పడంలో అతని వుద్దేశ్యం—?

వేణుగోపాల్‌తో, తను లేచిపోబోతున్న విషయం అతనికి తెలిసిపోయిందా? ఎలా తెలిసింది—? ఎలా తెలిసింది—? ఎలా తెలుస్తుంది—?

ఆమె చాలాసేపు అలానే కూర్చుండిపోయింది.

ఎన్నో సందేహాలు — మరెన్నో అనుమానాలు.

మహేశ్వర్రావు పది గంటల ప్రాంతంలో బయటకెళ్లిపోయాడు.

ఆమెకు మనస్తిమితం లేకుండాపోయింది.

ఏమయిన సరే యీ రాత్రికే వెళ్లిపోవాలి.

సాయంత్రం వేణుగోపాల్ ఆఫీసు నుంచి రాగానే పత్రికలో లెటర్ పెట్టి పంపించింది.

భర్త పదిగంటల ట్రైన్‌కి వెళ్లిపోతాడు.

పన్నెండు గంటలకో ట్రైన్ వుంది.

మహేశ్వర్రావు రాత్రి తొమ్మిది గంటలకు యింటికి వచ్చాడు. వస్తూనే సూట్‌కేసులో బట్టలు సర్దుకున్నాడు. బ్రీఫ్‌కేస్‌లో డబ్బు సర్దుకున్నాడు.

సుమిత్ర చూస్తూనేవుంది. మొత్తం పాతికవేలు తక్కువ వుండవు. అంత డబ్బు ఎక్కడికి తీసుకెళుతున్నాడు—?

"ఓకే డార్లింగ్ వస్తా" అనేసి అతను వెళ్లిపోయాడు.

ఆమె తేలిగ్గా వూపిరి పీల్చుకుంది. ఆనందపడిపోయింది.

పదకొండున్నర_

ఆమె సూట్‌కేస్‌తో ఆ బిల్డింగ్‌లోంచి బయటపడింది.

రిక్షాలో స్టేషన్ చేరుకుంది.

టికెట్స్ కౌంటర్ దగ్గర నిలబడి పోయింది.

వేణుగోపాల్ కోసం ఎదురుచూసింది.

ఆ పరిసరాల్లో అతను కనిపించలేదు.

అతను యింకా రాలేదా....ఎందుకు రాలేదు....గంట ముందుగా స్టేషన్‌కి వెళ్లి టికెట్స్ రిజర్వేషన్ చేయమని లెటర్‌లో రాసిందే తను.... అతను స్టేషన్‌కి వచ్చాడా.... వచ్చి టికెట్స్ తీసుకొని ప్లాట్‌ఫారమ్ మీదకు గానీ వెళ్ళాడా... ?

ఆమె చిరాకుపడిపోయింది.

తను యింట్లోంచి బయటకు వస్తున్నప్పుడు.... అతనింటికేసి చూసింది.... గొళ్ళానికి తాళం వ్రేలాడుతూ కనిపించింది.... అంటే అతను స్టేషన్‌కి వచ్చే వుండాలి.... మరి కనిపించడేం.... ?

ఆమె చుట్టూ చూసింది. ఒక్కసారిగా అదిరిపడింది.

మహేశ్వర్రావు ఆమెవేపే వస్తూ కనిపించాడు.

అతను వూరు వెళ్లలేదా ? వణికి పోయింది.

"సుమిత్రా" అతను దగ్గరకు వచ్చి పిలిచాడు.

ఆమె కళ్లలో భయం తొంగి చూస్తోంది.

"యింతకు ముందే వేణుగోపాల్ స్టేషన్‌కి వచ్చాడు....మీరిద్దరూ ఎక్కడికి వెళుతున్నారో ఏమిటో నాకు తెలుసు.... ఎలా తెలుసు నంటావా....మీ గురించి పనిమనిషి ద్వారా ఎప్పటి కప్పుడు వివరాలు తెలుసుకుంటూనే వున్నాను ... నీమీద నాకు ఎటువంటి కోపం లేదు.... వేణుగోపాల్‌కి పాతికవేలు యిచ్చాను... నీకీ డబ్బు కావాలో లేక సుమిత్ర కావాలో తేల్చుకోమన్నాను.... అతను కనీసం ఆలోచించకుండా డబ్బే కావాలన్నాడు.... తీసుకోమన్నాను ఆ డబ్బు తీసుకొని అతను ట్రయిన్ ఎక్కి కూర్చున్నాడు .. సుమిత్రా యిక నీవు చెప్పు...నీకు వేణుగోపాల్ కావాలో లేక నేను కావాలో ఆలోచించి చెప్పు... అయిదు నిమిషాలు టయిం యిస్తున్నాను."

సుమిత్ర ఆలోచించలేకపోతోంది.

నిమిషాలు గడిచిపోతున్నాయి... ?

---

# బంధం



తరెక్టు టైముకి దడదడలాడుతూ స్టేషన్లో వచ్చి నిలబడింది బండి. మాలతీ సుధాకర్ సామాన్లతో దిగారు.

* * * * *

"క్షేమమా బ్రదర్....? హాయ్....మాలా....!!" సుధాకర్‌తో కరచాలనం చేస్తూ పలుకరించిందో పరిచితమైన కంఠం.

"అరే....తిలక్....! నువ్వా.... ? నువ్విక్కడేం చేస్తున్నావ్....?? మేం వస్తున్నట్టు నీకు తెలుసా....?" రేగిన జుట్టు సుతారంగా సవరించుకుంటూ నిలబడిపోయి ఆశ్చర్యంగా ప్రశ్నించింది మాలతి.

ఆమె కళ్ళల్లో ఆనందం వెల్లివిరిసింది—

"అవన్నీ తరవాత మాట్లాడుకోవచ్చు అవతల టాక్సీ వెయిట్‌చేస్తోంది. నడవండి " తిలక్ తొందరపెట్టాడు

---

**1980 చక్రపాణి ప్రథమ అవార్డు పొందిన నవల**

---

మాలతి భర్తవంక చురుగ్గా చూస్తూ ..."నాకు చెప్పారు కాదేం....? దొంగలు మీరంతా....!" చనువుగా చెప్తుతూ ముందుకి సాగింది.

–ఆమెకు ప్రయాణ బడలిక తృటిలో మాయమయింది.

'మొత్తానికి తిలక్ కూడా ఈ ఊళ్లోనే వున్నాడన్నమాట. భర్త తనతో ముందుగా ఈ విషయం ఎందుకని చెప్పలేదో. తనను సర్‌ప్రైజ్ చేద్దామను కున్నాడా... ?" ఆమెకు బోలెడు సంతోషం వచ్చేసింది.

దీపాల తోరణాలతో కళకళలాడే నున్నటి విశాలమైన రోడ్డుమీదుగా టాక్సీ జారిపోతోంది....

తిలక్ తిన్నగా 'భోజన హోటల్' వద్ద ఆపించాడు టాక్సీ. అతని వంక సుధాకర్, మాలతి విభ్రాంతిగా చూశారే గాని మారు మాట్లాడలేదు. –'స్వీటు, బిరియానీ, కోడికుర్మా...బాయిల్డ్ ఎగ్స్, వెజిటబుల్ సూప్.. చిప్స్'...వగైరా లతో భోజనం అద్భుతంగా వుంది.

అపురూపరు మని తింటూ భోజనం మధ్యలో తనను గుచ్చిగుచ్చి చూస్తున్న మాలతి చూపులను కూడా కలిపి మింగేశాడు తిలక్. అది గమనించిన సుధాకర్ మౌనంగా నవ్వుకున్నాడు–బిల్లు చెల్లించే దగ్గర పోటీపడి ఓడిపోయిన భర్తను చూసి మాలతి మందహాసంచేస్తూ...."ఫర్వాలేదు లెండి, మన గురించి ఆ మాత్రం శ్రమపడావచ్చు...ఖర్చుపెట్టావచ్చు...అంతలో మరేం తరిగిపోదు–" అంటుండగా ఆమెకు సడన్‌గా టాక్సీ ...అందులోని సామానూ గుర్తొచ్చి "...అమ్మో.. !" అంది గుండెలమీద చెయి వేసుకుంటూ.

తిలక్ బిగ్గరగా నవ్వి.. "మాలా... ! లగేజి గురించేనా...? నీకా భయం అఖ్ఖరలేదు. ప్రాణాలమీద తీపి వున్నవాడెవ్వడూ మన కన్నుగప్పి చెక్కేయ లేడు. పద చూద్దాగాని–ఇంతసేపూ వాడికి ఛాన్స్ ఇచ్చాం కదా.. !?" అన్నాడు.

ముగ్గురూ టాక్సీ నిలుపుచేసిన తావుకి చేరారు.

డ్రైవరు వినయంగా సాల్యూట్ చేసి బాక్‌డోర్ తెరిచి పట్టుకున్నాడు. మాలతి తృప్తిగా ఊపిరి పీల్చి... "ఊఁ... ఇదంతా ఏదో మాయాజాలంలా వుంది. ఇంటికి పదండి చెప్తా.. !" అంటూ ఆ చివరికి జరిగి కూచుంది.

–తిలక్ డ్రైవరు పక్కన కూచోంగానే బండి స్టార్ట్‌అయింది.

సుధాకర్ ఆమె చెంతకు చేరి చిరునవ్వు చిందిస్తూ...."మరీ అంత కంగారు పడితే ఎలా ... ? నాకు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ చేతికి రాంగానే....మనవాడికి

రాసిపడేశాను. అతను ఇల్లు వెతికి పెట్టి తిరిగి నాకు రాశాడు. ఈ విషయం అప్పుడే నీకు చెప్పవద్దని మరీ మరీ కోరడం వలన నేను ఊరుకోవలసివచ్చింది. ఏది ఏమయినా నాకు సగం భారం తగ్గించేడు....” అన్నాడు.

“ఇంతకీ అతనిక్కడ ఏం చేస్తున్నట్టూ....?”

“జైలుకి సంబంధించిన ఒక బాధ్యతాయుతమైన పదవిలో వున్నాడు_”

“వాళ్లకి క్వార్టర్సు ఇస్తారు కాబోలు....?”

“అవును. ప్రస్తుతం మనం వెళ్తోంది అక్కడికే.... .”

“అమ్మో ... జైలుకే....!??”

“నువ్వీ మాదిరి ఎక్జయిట్ అవుతావనే నీకు చెప్పొద్దనేసి వుంటాడు;” అని.... నెమ్మదిగా; “_సరేగాని అయింవానికీ కానిదానికీ.... 'అమ్మో.... బాబోయ్....' అనకు. నీ పిరికితనం ఆసరాగా తీసుకుని ఒక రాత్రివేళ ఏ దొంగాడన్నా....అసలు మనం వెళ్తోందే వాళ్ళ మధ్యకి_ ....” బెదిరించాడు.

మాలతి....“బాప్ రే!” అంటూ అరిచి సుధాకర్‌ని అంటుకుపోయింది.

“ఏఁవిటి సుధా....! కొండంత మనిషిని దగ్గరుంచుకునే ఆమెనలా హడలగొట్టేస్తున్నావ్....?” వెనక్కి తిరిగి చూస్తూ వాత్సల్యం ఉట్టిపడుతుండగా అడిగాడు తిలక్.

“అబ్బే....మరేం లేదు; ఒంటరిగాడివి గదా....! నీ ఇంట్లో బసచేయడానికి మాలతి అనుమానిస్తోంది....”

“_ఏం....కాదు! నా కలాంటి అనుమానాలు ఎప్పుడూ రావు. నువ్వేమో.... ఎవరో.... ఆడపోలీసుని లవ్‌చేశావట_ఆయన చెబుతుంటేనూ....!” సుధాకర్ ఆమె సమయస్ఫూర్తికి విస్మయంచెందుతూ కళ్లు పెద్దవిచేసి చూశాడు.

“సరే....! మీ రిద్దరూ దొంగలే కాబట్టి మిమ్మల్ని ఖచ్చితంగా ఖైదు చేస్తానుండండి_” అన్నాడు తిలక్ జబర్దస్తీగా.

టాక్సీ జైలురోడ్డును సమీపించింది.

“చూశావా.... మాలా....! ఇదే జైలు ఆవరణ. మానవుల్లాంటి దానవులను పకడ్బందీగా పట్టి.... కట్టిపడేసిన మరో ప్రపంచం. మరోమాటు మరో నేరం చేసేందుకు అవకాశం లేకుండా....చట్టం గిరిగీసి వదిలిన పరిధి. చేసిన నేరాన్ని ఎత్తిచూపి బతికుండగానే ఆ పాపాన్ని ప్రక్షాళనం చేసుకునేందుకు.... వీలు కల్పించిన దేవాలయం. చట్ట విరుద్ధమూ, మతాల పరమైన 'నక్సలిజం.... సోషలిజం.... రౌడీయిజం....మొదలుగాగల అనేక 'యిజా' .... లను_ అణచి

పెట్టిన ఆదర్శదృహం. శిక్షణ ద్వారా మూఢులను మరమ్మత్తుచేసి సంమోహ జీవులుగా మలిచే.... మహా కర్మాగారం. మనిషిలోని పశుత్వాన్ని పారద్రోలి మానత్వాన్ని మననం చేయించే.... ఉన్నత పాఠశాల........."—తిలక్ ఆవేశంగా చెప్పుకుపోయాడు.

—ఆ కొసనించీ ఈ కొసవరకూ ఇంతెత్తున లేచిన ప్రహరీ గోడ తప్ప మాలతికి మరేం కన్పించ లేదు.

—టాక్సీ తిన్నగా వెళ్ళి తిలక్ క్వార్టర్ ముందాగింది.

మాలతి హృదయం ఎందుకో బరువెక్కింది.

* * * * *

ఇల్లు చాలా విశాలంగా నీట్‌గా వుంది. ఇంటి నిండుగా ఎటుచూసినా సామానే. సంసారం చేస్తున్న తనకే లేదు ఇంత సామాను. అది రేపో మాపో టి. వి. యస్ వాళ్ళు తెచ్చి పడేస్తారు. 'ఈయన గారి ఒక్క ప్రాణానికి ఎందు కింత ఆర్భాటం....'అనుకుంది వాటిని చూస్తూ మాలతి. ఇంటిముందు అందంగా పొందిగ్గా పెంచబడిన పూలతోట.... విరగబూచిన గులాబీలు, ఘుమఘుమ లాడుతూ విరిసిన జాజి పందిరీ— ఆమె మనసును కొంతవరకు ఆహ్లాద పరిచినయి.

'గంభీరుడు తిలక్....!'

ఆలోచనాపరుడు కూడా.... ఎంత ఉన్నత స్థాయికి ఎగబ్రాకాడు. ఆరోజుల్లో దిక్కూ మొక్కూ లేనివాడని నాన్న చేరదీసి చదివించి, పెంచి పెద్దచేశారు. అతని కింత ఉజ్వలమైన భవిష్యత్తు ఉందనిగాని; ఈనాడు తనకు ఇలా అండగా నిలబడగల్గుతాడని గాని.... ఎన్నడయినా తాననుకుందా....?

అవడానికి దూరపు బంధువూ.... వరుసకు మామయ్యే.... అయినా, తన నోటితో "మాఁవయ్యా....!" అంటూ ఏనాడూ పిలిచి ఎరుగదు. అతని మోకాలి ఎత్తున్నప్పుడు కూడా.... "ఏయ్....తిలక్....!!" అంటూనే పిలిచేది.

అతను ముద్దుగా, స్నేహంగా పల్కరించబోతే.... "హుఁ".... అంటూ విసుక్కునేది.

చివరికి బి. ఏ. పూర్తయ్యాక కాబోలు.... 'ఇంకా చదువుతా' నంటూ మొండి కెత్తిన తిలక్‌ని నాన్న మాటలతోనే గాయపరిచారు. అంతేగాక— "నీకు రెక్కలిచ్చాం కనుక ఎగిరిపో.... వాటి కష్టంమీదే బ్రతుకు...." అంటూ తరిమివేశారు. అప్పుడే సరిగ్గా తనకు పెళ్ళి చూపులు జరిగే రోజుల్లో మాట.

ఊరు వదిలివెళ్లేరోజున తన వద్దకు వచ్చి డగ్గుత్తికలో "వెళ్లొస్తాను మాలా....! గుర్తుంచుకో....!!" అన్నప్పుడు తనకెందుకో చెప్పలేనంత కనికరం వేసింది. అదే తొలిసారిగా అతన్ని చూసి జాలిపడిన క్షణం—

తానేం బదులు చెప్పకుండానే అతడు గుమ్మం దిగాడు. తమ ఇల్లు విడిచిన ఏడాదికి కాబోలు.... నాన్నకు జాబు రాస్తూ— కొంత రొక్కం కూడా పంపించాడు. ఆ తరువాత అదే విధంగా అప్పుడు కొంత అప్పుడు కొంత పంపుతూనే వుండేవాడు. మరి అది కృతజ్ఞతతోనో ఋణవిముక్తుడు కావలిచో తెలీదు.

నాన్న ఎందుకు అంగీకరించేవాడో అంతకన్నా అర్థమయేది కాదు.

ఆ తరువాత తన పెళ్లికి వస్తూ తనకు రెండుజతల బంగారు గాజులూ, మంచి ఖరీదైన పట్టుచీరె.... పసుపుకుంకుమగా తెచ్చాడు.

—తాను ఒంటరిగా వున్న సమయం చూసి అతి నెమ్మదిగా.... "నన్ను బంధువుగా అంగీకరించకపోయినా మంచి స్నేహితునిగా మన్నించి.... ఇవి స్వీకరించు" అంటూ కోరాడు.

అతని ప్రవర్తనలో నిజాయితీ కన్పించింది

తన భర్తకూ అతనికీ ఆనాడే పరిచయమైంది. అతనిలోని ఏదో ఆకర్షణ సుధాకర్‌ని కట్టిపడేసింది. ఆ నాటినించీ వారి స్నేహాన్ని చెక్కుచెదరకుండా చేసింది.

తిలక్.... చదువు సంస్కారాలున్న సత్పురుషుడని ఇన్నాళ్లూ తన అభిప్రాయం. అయితే 'డబ్బూ.... హోదా, తనదంటూ ప్రత్యేకింపబడిన వ్యక్తిత్వం కల్గిన పూర్ణపురుషుడిగా'.... ఈనాడు గుర్తించింది.

* * *

ఇల్లంతా తిరిగి చూసి భర్తతో మాట్లాడుతోన్న తిలక్ వద్దకు వెళ్లింది ఆమె.

"....కూర్చో మాలా....! ఏదో సామాన్యుణ్ణి. నా డ్యూటీకి ఒక విలువకట్టి దాని ప్రకారం కేటాయించిన 'గూడు' ఇది. నా సంతృప్తికోసం ఈ పదిరోజులూ ఇక్కడ గడిపితే....ఫస్ట్ నించి మీ ఇంటికి వెళ్లిపోదురుగాని....ఏమంటారు..?" వారిద్దర్నీ మార్చి మార్చి చూస్తూ అర్థింపుగా అడిగేడు.

"—అన్యాయం....! ఏ నేరమూ చెయ్యనివాళ్లని ఈ విధంగా నిర్బంధించడం ధర్మవిరుద్ధం...." మాలతి కలుపుగోలుగా చూస్తూ పలికింది.

—సుధాకర్ ఈ సరికే లోపలికి వెళ్లి దుస్తులు మార్చుకుని బెడ్‌రూమ్‌లో తిలక్ స్ప్రింగ్‌కాట్‌ని అధిష్టించి.... "అబ్బ.... ఎంతయితే మాత్రం మరీ

ఇన్ని కమ్ఫర్ట్సు.... లగ్జరి కోచ్‌లో ట్రావెల్ చేస్తున్నట్టుంది" అంటూ నవ్వాడు.

తిలక్ వెంటనే అందుకుని— "ఆ గది మీదే....! నేను నెట్ వేసుకుని సోఫా బెడ్ మీద పడుకుంటాను.... ఫ్రంట్ రూమ్‌లో...." అన్నాడు.

"మాకు కాపలానా....!" వచ్చే నవ్వు నాపుకుంటూ ప్రశ్నించింది మాలతి.

ముగ్గురూ ఒక్కమారే నవ్వేశారు.

ప్రస్తుతం వాళ్ళు ఎక్కువగా మాట్లాడుకున్నది 'జైలు' గురించే. కామన్ ఇంటరెస్ట్ వున్న 'టాపిక్' అవడం వలన సంభాషణ చాలా సాఫీగా మధురంగా సాగిపోయింది. తిలక్ మంచి వక్త. అతనికి తెలుసును— అవతలివారి అభిరుచిని బట్టి మాట్లాడి నప్పించడమనేది.

—సుధాకర్ సుఖభోగి. 'ఎప్పుడా ఎప్పుడా.... మంచంమీద వాలిపోదాం' అని చూస్తున్నాడు. ఇహ బాగుండదని మధ్య మధ్య ఏవో పాలిటిక్స్ గురించి చర్చించాడు. నిశ్చితమైన అభిప్రాయాలు వెలిబుచ్చగలిగేది ఒక్క పాలిటిక్స్ లోనే గనుక.

ఆ ఖబురూ ఈ ఖబురూ దొర్లి.... ఎవరి పడకలమీదికి వారు చేరేసరికి పదకొండు దాటింది. సుధాకర్‌కి మగతకళ్ళు పడినయి.

ఇంతలో ఎవరో తిలక్‌కి టెలిఫోన్ చేసి 'ఏదో అర్జెంటు విషయం మాట్లాడాలి' రమ్మంటూ కోరారు.

అతను గబగబా బట్టలు మార్చుకుంటూ— "నాకిది మామూలే.... మీరు పడుకోండి.... తిరిగి వచ్చేసరికి ఏ వేళవుతుందో.... బయట లాక్ చేసుకుని వెళ్తాను; అనవసరంగా మీ స్లీప్ స్పాయిల్ అవుతుంది...." అన్నాడు.

"అంటే.... లిటరల్‌గా లాకప్ చేస్తున్నట్లేగా....!?" కళ్ళల్లో కొంటెతనం చిందులు వేస్తుండగా అడిగింది మాలతి.

'కొత్తవాళ్ళను ఇంట్లోపెట్టి తాళం వేసి.... ఇదేనా నీ సత్కారింపు....' అన్నట్టుగా ధ్వనించి— తిలక్ రెండు నిముషాలపాటు మౌనంగా తల వంచుకుని, చివరికి...."సారీ మాలా....! ఇది నా బాధ్యత— పిలుపు వచ్చాక పరుగెత్తుకు వెళ్ళడం మా విధి. స్వార్థంకోసం ఉపేక్షిస్తే గడ్డించిన విస్తరిలాంటి ఈ జీవితం కాస్తా తారుమారవుతుంది.... కాబట్టి డ్యూటీ అనుకోంగానే ఉత్తేజాన్ని పొందడం అలవాటుచేసుకున్నాను—" అన్నాడు.

"అదృష్టవంతుడివి.... వెళ్ళిరా....!" తిలక్‌ని సాగనంపి మాలతి పడకింటికి

చేరుకునేసరికి సుధాకర్ గుర్రుపెడుతున్నాడు. ఆమె నెమ్మదిగా మెర్క్యురీ దీపం ఆఫ్‌చేసి బెడ్‌లాంప్ ఆన్‌చేస్తూ భర్త చెంతన చేరింది.

—ఆమె కళ్లనిండుగా ఇంతెత్తున నిలబడిన తిలక్ రూపమే కదిలాడుతోంది. ఆమె గుండెలోపల అట్టడుగు భాగాన సమాధిచేయబడిన ఒకానొక జ్ఞాపకం పైకి తన్నుకొస్తోంది.

'ఛి ....ఛీ.... అది అప్రస్తుతం; అనుచితం—' అంటూ అంతరాత్మ అడ్డగించినా అది భూతంలా వెలికివచ్చి కలవరపెట్టసాగింది.

—ఆ రోజు తనకి బాగా గుర్తుంది.

ఇంకాస్సేపటికి పొద్దుకుంకుతుందనగా నాన్న తన స్నేహితుణ్ణి ఎవరో ఒకతన్ని వెంటబెట్టుకొచ్చారు. అతను చాలా దూరంనించి వచ్చాట్ట. మర్యాదలూ అవీ అయాక నాన్నా.... అతనూ ముంగిట్లోకి మంచాలు ఈడ్చుకుపోయి ముచ్చట్లలో పడ్డారు.

అతనెందుకొచ్చాడో.... వాళ్లేం మాట్లాడుకుంటున్నారో....తానసలు పట్టించుకోలేదు. తిలక్ మామూలుగా బజారు పనులు చేసిపెట్టాడు. అతిధి వున్నాడు కనుక ఏవో స్పెషల్సు పట్టుకొచ్చాడు. నాన్నను అంటిపెట్టుకునే వున్నాడు ఆ పూటంతా.

ఏదైనా కావాల్సి నాన్న పిలుస్తారేమోనని పొద్దుపోయినా తానూ మేలుకునే వుంది. చేతి కందిన పుస్తకంతీసి చదవడానికి వుపక్రమించింది. ప్రక్క వీధిలో వున్న లైబ్రరీ నించి ఆవేళే తెచ్చుకుందది. మొదలుపెట్టి కొంత చదివాక గాని.... 'అది మంచి పుస్తకం కాద' ని గ్రహించలేకపోయింది. అలాగని పుస్తకాన్ని మూసివేయనూ లేకపోయించి. కొంగ్రొత్త రుచులేవో చవి చూపిస్తోందది.

యవ్వనపు తొలిమెట్టు మీదున్న తనను ఠెక్క పుచ్చుకుని బరబరా ఈడ్చుకుపోతోంది. మెట్టు తరువాత మెట్టు.... అలా.... చాలా దూరం సాగిపోయింది.

అది ఒక సెక్సు ప్రాధాన్యత గల నవల—

ఈలోగా నాన్న పిలవకపోగా మంచి నిద్దట్లో పడిపోయారు వాడా. నవల చకచకా పూర్తిచేసేసరికి మనిషిలో అజ్ఞాతంగా దాగివుండే జంతువేదో ఒళ్లు విరుచుకుని డెక్కలు టకటక లాడిస్తూ పైకి లేచింది. వాడిగా వున్న కొమ్ములు విదిలిస్తూ వేడిగా బుసలు కొడుతోంది. ఆపి వుంచితే ఆగే స్థితిలో లేదది— రెచ్చిపోతోంది.

....ఆ సమయంలో తిలక్ మంచినీళ్ల కావాలంటూ ఎదుటికొచ్చాడు. అతని మొహం అదోలా కన్పించింది. 'ఆ సమయం అటువంటిదో.... లేక.... అతనూ అదే స్తితిలో... '

లేదు లేదు— తిలక్‌కి అంత ధైర్యం కూడానా... ?

అయితే మరి ఎందుకు అలా వున్నాడు .. ? !

విషయం తెలుసుకోనిదే లేవగూడ దనుకుంది. ఈలోగా తిలక్ అదో రకపు కంఠంతో "మాలా....! నీకు పెళ్ళట . " అంటూ తనవేపు చూసి నవ్వాడు.

ఏమపు మిళాయించి నవ్వినట్టుందా నవ్వు—

అసలే తన ఒళ్ల తేలిపోతోంది. ఉచితానుచితాలు తెలీని స్థితిలో వుంది. అసలు ఈ మాలతి వేరు... ఆ మాలతి వేరు.

"—ఎవరిదో. .. ??" అందామె సిగ్గుపడకుండా చిలిపిగా.

"నాతో మాత్రం కాదులే !!" అదీ జవాబు.

ఉలిక్కి పడిందామె. అతని చూపులు తట్టుకోలేక 'మంచి నీళ్ల తెస్తా నంటూ లోపలికి వెళ్లింది. అయితే తిలక్ ఇన్నాళ్లూ తనను గురించి ఆలోచిస్తు న్నాడా.. ? తాను పొరపాటు పడడంలేదు కదా ??

ఆమె భయపడింది. ఆ భయం అతి మధురంగా వుంది. ఆమె సిగ్గుపడింది. ఆ సిగ్గును మైకపుతెర లాంటి దేదో మూసివేసింది. తిలక్ మొహంలో ఏవో సరికొత్తరేఖలు స్పష్టంగా కన్పించినయి. కావాలని తనతో ప్రత్యేకించి మాటాడేందుకు వచ్చినట్టు అతని వాలకం చెబుతోంది.

మాలతికి ఇంకా. .. ఏదో.... అనుమానం కలిగింది——

అవును....అదే నిజమయితే....? ఈ ఏకాంతంలో ఇంకేమైనా....జరిగితే.... అసలు... ఏమైనా జరుగుతుందా....ఏ(విటది....?ఎలా.... వుం....టు....ది....?? రేపు.... మళ్లీ ...అతని....మొహం....ఎలా....చూడాలి ??? ....అ....బ్బ....!!!

—మాలతి కావాలని వంటఇంట్లోనే తాత్సారం చేసింది.

తిలక్ తిన్నగా లోపలికొచ్చేశాడు.

....మాలతికి సిగ్గు ముంచుకొచ్చింది. చేతిలో నీళ్లగ్లాసుతో తల వాల్చేసుకుని నిలబడివుంది.

తిలక్ నవ్వాడు. ఆమెవైపు చూస్తూ.... అలాగే నవ్వేస్తూ.... "మాలా.... మంచి.... నీళ్లివ్వవా....?" అన్నాడు.

మాలతి కాస్త కదిలింది. ఇద్దరూ రెండేసి అడుగులు ముందుకి వేశారు—

మాలతి ఆగిపోయింది—

'అతను ఆమెకు దగ్గరగా వస్తున్నాడు. ఇదివరకు ఎన్నోమార్లు ఎంతో దగ్గరగా వచ్చాడు. అయితే.. ఆ రావడం వేరు . ఈ రావడం వేరు. ఇంకా .... ఇంకా అతిసమీపంగా.. మంచినీళ్లు అందుకుంటున్నాడా.... ఆమెనే అందుకుంటున్నాడా అన్నట్టు.

....ఆమె ఏమాత్రం వ్యతిరేకత చూపినా ఫలితం మరోలా ఉండేది. అవును— అతని చూపులు కాల్చేస్తూ.. మరి ఆమెందుకు తడబడాలి.. ? సన్నగా కనిపించినట్టూ గుర్తుంది. అతని ఆంతర్యం లోపలి వేడి శరీరాన్నంతట్నీ వెచ్చజేసింది కాబోలు; చేతివేళ్ళ కొసలు సైతం కాలిపోతూ . గ్లాసు అందుకోబోతూ చేతిని అందుకున్నాడా . ?? నరాలు జివ్వుమన్నాయి. ఏమిటిది. ? అతని కళ్లు ఎర్రగా కోర్కెల దాహాలతో ఏవో సంకేతాన్ని చూపెడుతూ— ఆమె కళ్లు వేస్తున్న ఎన్నో ప్రశ్నలకు అతని కళ్లల్లోంచి అనేక జవాబులు... కాలిపోతున్న పెదవులతో.. చెంపల సమీపాన "మా లా"— అని పిలిచినట్టు . "మాలా .. మాలా.. నువ్వు... నా.. కా.. వా.. లి" అంటూ మీదికి లాక్కున్నట్లు——'

'అప్పుడు .. అప్పుడేమయింది... ??'

నీళ్లగ్లాసు కిందపడి పెద్దగా చప్పుడయింది.

—నాన్నంటే తిలక్ కి చాలా భయం. నాన్న వచ్చేసరికి తిలక్ చకచకా నడిచి వెళ్లిపోతూ కన్పించాడు.

తాను మామూలుగా లేదు.

నాన్న అనుభవజ్ఞుడు—

తిలక్ చెప్పినట్టే ఆరునెలలు తిరక్కుండా తన పెళ్లి ఆ వచ్చిన పెద్దమనిషి కొడుకు 'సుధాకర్' తో నిశ్చయమైంది. తిలక్ తమ ఇంట్లోంచి తరిమివేయబడ్డాడు.. తన మనసులోంచి కూడా ! ఆ మాలతికీ.... ఈ మాలతికీ సంబంధమే లేదు.

ఆమె అవివాహిత. మనసు వికసించని అజ్ఞానపు మొగ్గ. ఆ సంఘటనను అతి సులువుగా మరిచి ముచ్చటగా మొగుడితో కాపురంచేసుకునే ముగ్ధ. ఈ మాలతికి భర్తే సర్వస్వం....



—సుధాకర్ లెక్చెరరు. టైమ్ ప్రకారం కాలేజికి వెళ్ళి వస్తుంటాడేగాని తిలక్ మాదిరిగా తహ తహ ఎరుగడు. అతనితోడి జీవితంకూడా టైమ్ టేబుల్ మాదిరే జరిగిపోతోంది. నెల తిరిగేసరికి కరుకురాళ్ళకుమల్లే దోసెడు రూపాయలు సంపాదిస్తాడు గాని .. ఏంలాభం... ?? సగానికి సగం అతని తల్లిదండ్రులకు పంపించాలి. అదనంగా ఏదేనా అవసరమైతే తమ ఇంటి ఖర్చన్నా తగ్గించుకోవాల్సిందేగాని పొరపాటునకూడా మామగార్కి పంపే దాంట్లోంచి పిక్కేందుకు వీల్లేదు.

పైగా ఇద్దరు మనుషులకు వెచ్చాల జాబితా అంతా వాళ్ళే పంపుతూ... ఇంటద్దె వగైరాలు పోను ఎంత మిగుల్చుకోగలరో లెక్కలు వేసి చెబుతుంటారు. సుధాకర్ తల్లిదండ్రుల విషయంలో చాలా సిన్సియర్‌గా ప్రవర్తిస్తాడు. ఈ

సందర్భంగా మాలతి ఎప్పుడూ నిట్టూర్పులు విడుస్తూనే ఉంటుంది.

"ముందు ముందు మనకి ఏ పిల్లో... పాపో పుడితేనో..." అంది.... ఈ ఊరు వచ్చేముందు తెగించి.

"అప్పటి మాట కదా....!" భార్యావిధేయుడికి మల్లే భరోసా ఇచ్చాడు.

"అప్పటిమాట కాదు– ఇప్పటి మాటే....!" అంటూ నిద్రిస్తున్న భర్తను లేపి మరీ చెప్పాలనుకుంది.

ఇంతవరకూ అతనికి ఆ .. 'విషయం' తెలీదు. "చెబుదాం...." అనుకునే సరికి ఈ ట్రాన్స్‌ఫర్ వచ్చిపడింది.

మాలతికి అది తెలుసుకునేసరికి తెలీని సిగ్గు... అందులోనే ఆనందం.... ముంచుకొచ్చినయి. ప్రస్తుతం తనకు 'నా....' అనేవారెవ్వరూ లేరు. అమ్మ చిన్నప్పుడే పోయింది. నాన్నపోయి ఏడాది దాటింది.

—ఈ రోజున తిలక్‌ని చూశాక ఆమెకు 'ఫర్వాలేదులే....' అన్పించి తృప్తిగా గాలి పీల్చుకుంది.

మాలతికి నిద్రపట్టలేదు. ఉస్సురంటూ లేచి కూజాలో మంచినీళ్ల ఒంపుకు తాగి మళ్లీవచ్చి పడుకుంది. ఎంతకీ నిద్ర రాందే. !

కొత్త ప్రదేశం అవడంవల్లనో పరాయివాని పడక అనో....

జీరోవాట్ బల్బ్ కాంతికిరణాలు గదిలోని గోడలమీద పలుచగా ప్రసరించి అక్కడే ఇంకిపోతున్నాయి.

చుట్టూరా పరిస్థితి తెలుసుకునేందుకు అవకాశంలేకుండా చెట్లగుబుర్ల నీడలు దట్టంగా పరుచుకున్నాయి. భూతప్రేత పిశాచాలు విజృంభించే వేళ.... భర్త మొద్దునిద్ర . ఒంటరితనం. . ఆమె గుండెలు గుబగుబలాడినయి.

—బలవంతంగా ఉరితీయబడినవారి ఆత్మలు అక్కడే సంచరిస్తుంటయి. జైలు అధికారులపై పగబూనినవారి ప్రతీకారవాంఛ అక్కడే నిఘావేసి వుంటుంది.

–టైము రెండు గంటలు దాటింది.

'తిలక్ వస్తే బాగుణ్ణు–' అనుకుంది ఆమె. ప్రయాణ బడలికవల్లనో ఏమో సుధాకర్ గాఢంగా నిద్రిస్తున్నాడు. అతడు నిద్దట్లో కదిలినప్పుడల్లా స్ప్రింగ్ మంచం 'ఉయ్యాల.. జంపాల' అంటోంది.

మాలతికి చిరాకెత్తింది.

'కలిమికి అలవాటుపడటం కూడా....కష్టంతో కూడిన పనే-' అనుకుంది.

....దూరంగా బూట్ల టకటకలు విన్పించినయి. స్త్రీ సహజమైన ఆతృతతో ఎదురుచూస్తున్న మాలతి గబగబా మంచం దిగిపోయి తలుపు తీసేందుకు సిద్ధమైంది. అపుతల నించి 'గోదురుకప్ప'ంత తాళం వెక్కిరించడంతో ఆ ప్రయత్నం విరమించుకుంది.అతి ముఖ్యమైన కేసును గురించిన సంప్రదింపులు ముగించుకుని అలసటగా ఇల్లు చేరిన తిలక్ పెదవులు కృతజ్ఞతాపూర్వకంగా విచ్చుకున్నాయి.

"నా పుణ్యం పండింది మాలా ...! నేను నిజంగా అదృష్టవంతుణ్ణి. ఇన్నాళ్లకి నా గురించి ఎదురుచూసే ఒక ఆప్తురాలిని సంపాదించుకోగల్గాను !...." అంటుండగా అతని కళ్లవెంట ఆనందభాష్పాలు దొర్లినయి.

"మామయ్యా ! నువ్వు "

తొలిసారిగా ఆమె నోటివెంట ఆప్యాయతతో కూడిన ఆ పిలుపు విని తిలక్ సంతోషంతో ఉక్కిరిబిక్కిరయాడు. ఆ సరికొత్త అనుబంధానికి తట్టుకోలేక పోయాడు.

మాలతి మృదు గంభీర వదనంతో అతని వంక తేరిపారచూస్తూ "పడుకో చాలా రాత్రయింది . రేపు మాట్లాడుకుందాం " అంటూ కర్టెను చాటుకు తప్పుకుంది.

-మరో పావుగంటవరకూ తిలక్ ఏవో కాగితాలు సర్దుకుంటూనే గడిపాడు. మధ్య మధ్య మాలతిని తలుచుకుని పొంగిపోతూ.. 'నా ఇంటికి నూతనంగా ఒక కళ వచ్చింది.. ' అనుకున్నాడు. అప్పటివరకూ పడిన శ్రమ-శ్రమగా అన్పించలేదు అతనికి. ఎన్నాళ్లగానో గుండెల్లో గూడుపోసిన వ్రణాన్ని తొలగించి, మత్తుమందిచ్చి నిద్రపుచ్చినట్టు.. హాయిగా నిద్రపోయాడు.

* * *

ఆ మర్నాడు పన్నెండుగంటల వేళ భోజనానికి వచ్చాడు. ఎండ దండిగా కాస్తోంది. షర్టంతా చెమటతో తడిసిపోయింది.

వస్తూనే "మాలా....ఖైదీలను చూస్తావా...? ఇవ్వాళ శ్రావణ పూర్ణిమ కాబట్టి జైల్లో ఒక ఫంక్షను జరుపదలిచాము- ఏం లేదు ..! నీ కర్థమయేట్టు చెప్పాలంటే....పాపం... వాళ్లూ మనలాంటి మనుష్యులే కదా-అని; సమాజంలో వారినీ కలుపుతూ మానసికంగా వారికి కొంత రిలీఫ్ కల్పించే ఉద్దేశ్యంతో ఈ రోజున నీలాంటి సొసైటీ లేడీస్ కొందరిని పిలిపించి... వారిచేత బంధితులకు

"రాఖీ" లు కట్టిస్తున్నాము - చాలామంది స్త్రీలు, యువతులు ఉత్సాహంగా ముందుకి వస్తున్నారు . నీ యిష్టం. మరి ఆలోచించుకో... " అంటూ బాత్‌రూమ్ వేపు నడిచాడు.

మాలతి సమాధానం చెప్పకుండా అలాగే స్థాణువులా కుర్చీమీద కూచుండి పోయింది.

'నిజంగా ఇటువంటి అవకాశం మరోమాటు రమ్మన్నా రాదు ఏమయితే అయింది; వెళ్తాను వెళ్లి తీర్తాను ..' అనుకుంది ఒక క్షణం.

'అమ్మో . జైల్లోకే-నేను వెళ్లను గాక వెళ్లను; వాళ్లంతా దొంగకళ్లెట్టుకుని నన్ను చూసి గుర్తుపెట్టుకుంటేనో- లేదు-లేదు; మామయ్య లేడూ....? నాకేం భయం....!' అనుకుంది మళ్లీ.

ఏదో పిరికిదనంతో కూడిన వెచ్చదనం శరీరమంతా అలుముకుంది. అంతలోనే చల్లబడిపోసాగింది.

తిలక్ డైనింగ్‌టేబిలు ముందు కూచుంటూ "ఏమాలోచించావ్ రేడీయేనా..??" అంటూ ప్రశ్నించాడు.

"ఓ....రెడీ !!" బింకంగా పల్కింది.

"దట్స్ గుడ్ !!" తయారుగా వుండు. సుధాకి టైమ్ లేదట-రాలేనంటూ ఫోన్ చేశాడు. నువు వస్తానంటే తీసుకు వెళ్ళమని చెప్పాడు-"

మాలతి ఏదో పట్టుకువచ్చే వంకతో వంటగదిలోకి నడిచింది. అక్కడ మళ్లీ ఆలోచనలో పడిపోయి అసలు విషయం మరిచింది.

-ఉన్నట్టుండి 'దభీ'. మని తోటలో ఏదో శబ్దం అయేసరికి డైనింగ్ హాల్లోకి చిన్నపిల్లకిమల్లే పరుగుతీసింది.

తిలక్ పకపకా నవ్వి "కొబ్బరిమట్ట ఎండిపోయి రాలిపడింది-" అంటూ ఆమె అనుమానం పోగొట్టి-"లాభం లేదు; నీకు తప్పక వాళ్లను ఓమాటు చూపించాలి. 'పాపం....వాళ్లూ మనుషులే-' అని నీ చేత ఒప్పించి గాని వదల్ను...." ఆమె వంక ఓరగా చూస్తూ ధృడంగా పలికాడు.

మాలతికి మరింత భయంవేసి తిలక్ వేపు జాలిగా చూస్తూ కూచుంది. గబగబా రెండు ముద్దలు కలిపి తింటూ; మాలతి తన వంకే చూస్తోందని తెలిసి ఆమెనలా ఇబ్బందిపెట్టడం బాగోలేదని గ్రహించి మాట మారుస్తూ -"మనుషులు కొందరి ఎడల కొన్ని అభిప్రాయాలు పర్మనెంట్‌గా ముద్రించి పారేశారు . పూర్వం మీసంలేని మగాళ్లంతా నాటకాల రాయుళ్లని లెఖ్ఖ... !

ఇప్పుడో—

మీ ఆయనకి మీసంలేదు. నాటకాలేస్తున్నట్టైనా అతను ?

అలాగే 'కాకీ గుడ్డలు ధరించినవాళ్ళంతా కర్కోటకులని ' చెప్పు పోలీసువాళ్ళకి మాత్రం ప్రాణభయం వుండదూ ?? వాళ్ళకి మటుకు సంసారాల్లేవూ ?? పిల్లల్లేరూ ??

మాలా... ! నే నొక్కటి చెబుతా విను-

'నిజం వేరు....నమ్మకం వేరు.' సూటిగా ప్రశ్నవేస్తే సూటిగానే జవాబు వస్తుంది. డొంక తిరుగుడుగా వేస్తే జవాబూ అలాగే వుంటుంది "

"నే నిప్పుడు నిన్నేం ప్రశ్న వేశానూ. ? కాకపోతే 'నేరస్థుల నడుమ ఫంక్షన్ ఏంవిటా... ' అని అనుకుంటున్నానే గాని. "

"అదే . చెప్పనివ్ మరి ?! మనిషి అనుకుంటాడూ . తాను భగవంతుని చేతిలో బందీనని-వాడు ఎలా నడిపిస్తే.. అలా నడుచుకునే వాడినని - నిజానికి మనిషి మానసికంగా చాలా స్వతంత్రుడు. అందుకే ఈ నేరాలూ, చోరీలూ పుట్టి పెరుగుతున్నాయి.

* * * * *

జైలు ఆహూతులూ, జైలు సిబ్బందీ, ఖైదీలతో ఆవరణమంతా కళకళ్లాడుతోంది. సర్కస్‌లో జంతువుల్ని కంట్రోల్ చేసినట్లు ఖైదీలందర్నీ వరుసగా నిశ్శబ్దంగా ఒక చోట కూచోబెట్టేసరికి జైలు అధికారుల తలప్రాణం తోక కొస్తోంది.

ఒక ఆడ ఖైదీని చూస్తూ మాలతి— 'దేవుడు సమస్త జంతుజాలాన్నీ మతిలో వుంచుకొని విచిత్ర సృష్టి చేశాడా.. ' అనుకుంది. ఆమె పాములా మెలికలు తిరుగుతూ పీతలా నడిచి వచ్చింది. ఎవరో విసిరిన జోక్‌కి కప్పలా బెకబెక మంటూ నవ్వింది. పందిలాంటి ముట్టెలోంచి కుక్కపళ్లు పైకి కన్పించినయి. గాడిద చెవులూ పిల్లికళ్లతో అందరివేపూ అదోలా చూస్తోంది.

....సుమారు ఐదూ ఆ ప్రాంతంలో తిలక్ మాలతి కొఱకు ఇంటికి ఫోన్ చేశాడు. అవుతలివేపునుంచి రెస్పాన్స్ లేకపోయేసరికి ఆశ్చర్యంగా కనుబొమలు ముడిచి టెలిఫోన్ పెట్టేశాడు.

"—మాలతి ఏమైంది. ..?"

ఆలోచిస్తూ ఇవుతలికి వచ్చాడు. మాలతి ఒక వూపుతో బయలుదేరింది. వచ్చే ముందు ఆమె తిలక్‌కి ఫోన్‌లో చెప్పడం మరిచిపోయింది. ఆమె యధావిధిగా తతిమ్మా లేడీస్‌తో కలిసి జైలు మొత్తం తనిఖీచేసి వచ్చింది.

ఆమెకు తిలక్ ఎక్కడా కనిపించలేదు.

ఖైదీలలో సుహృద్భావం పెంపొందించే ఉద్దేశ్యంతో ఎందరో స్త్రీలు తన మాదిరే ముందుకి వచ్చారు. ఆమెకు ఇది ఒక అపూర్వ సంఘటనలా హృదయంలో గాఢంగా హత్తుకుంది.

ఒక చోట— " హేట్ ద క్రైమ్ బట్ నాట్ ద క్రిమినల్... " అంటూ బోర్డుపై వ్రాసిన వాక్యం ఆమె మనసులో ముద్రలా నిలిచిపోయింది.
బంధితులంతా వరుసల వారీగా కూచుని వున్నారు. వాళ్లు తొడిగిన బట్టలు ఒక ప్రత్యేక గుర్తింపుతో వున్నాయి. అవి కుట్టడంలో ఆడ, మగ తేడాలేగాని ఆదుల తేడాలు కన్పించలేదు.

వాళ్లకి పేర్లున్నా అవి అంకెల రూపంలో గుండెలమీదే రాసున్నాయి.

"వీళ్లంతా మనుష్యులా. ??" అనుకుంది మాలతి.

అదుపుతప్పిన ఉద్రేకాలకి ప్రతినిధుల్లా కన్పించారు వాళ్లు.

అమాయక జీవుల హాహాకారాలకు వారసుల్లాగానూ, మసిబారిన మానవత్వానికి మారు రూపాలుగాను ఆమె కళ్ల ముందు మెదుల్తున్నారు వాళ్లంతా—

కొన్ని క్షణాలపాటు 'ఆ కటకటాల వెనుక తాను నిలుచున్నట్టు—' ఊహించుకుంది. పంజరంలో బంధించిన రాచిలుక మాదిరి అక్కడక్కడే అల్లిబిల్లి తిరుగుతూ....'అమ్మో' అనుకుంది. ఆమెకు ఊపిరాడలేదు.

కార్యక్రమం మొదలయింది.

ఎక్కణ్ణించో హడావిడిగా వచ్చాడు తిలక్. అతని కళ్లు ఎవరికోసమో వెతుకుతున్నాయి. ఆఖరి వరుసలో అనామకంగా కూచున్న మాలతిని చూస్తూ అతనికి 'ముఖ్య అతిధి' ని చూసినంత సంబరం కల్గింది. ఆమెతో ఒక మాటు మాట్లాడాలనుకున్నాడు. కాని అది కష్టం అని గ్రహించి అప్పటికి ఆ కోరికను బలవంతంగా అణిచిపెట్టుకున్నాడు.

—తలరా స్నానంచేసిన మాలతి కురులు పరిశుభ్రంగా మెరుస్తూ ఆమెలో దాగున్న అందచందాలను మెరిపిస్తున్నాయి.

లేత్రాయంనించీ వివిధ దశలలో ఆమె రూపాన్ని గమనిస్తూన్న తిలక్ '—ఆడవారు ఎంత వేగంగా ఎదిగిపోగల్రు !' అనుకున్నాడు.

సీతాకోక చిలుకల మాదిరి అలంకరించుకు వచ్చిన స్త్రీ సముదాయం నడుమ మాలతి మాత్రమే ప్రత్యేకంగా, నిరాడంబరంగా కన్పించింది దూరంగా నిలుచుని చూస్తున్న తిలక్ కళ్లకు.

అతడు యాంత్రికంగా తన కార్యదక్షతలో మునిగివున్నప్పటికీ మధ్య మధ్య మాలతివంక ఆప్యాయంగా అభిమానంగా చూస్తూనే వున్నాడు.

—ఆమె 'రాఖీ' చేతబట్టుకుని 'గోల్డ్‌మెడల్' తగిలించబోతున్నంత వుత్సాహంగా కన్పించింది. మరికొద్దిసేపట్లో జైలు సూపర్నెంటుగారి ఆధ్వర్యంలో ... ఖైదీలు రాఖీలు కట్టించుకున్నారు. మాలతి చేత రాఖీ కట్టించుకునే అదృష్టం ఎవరికి పట్టిందో తిలక్ గమనించలేకపోయాడు.

—కట్టేవారికి కట్టించుకునేవారికీ ఇదొక అపూర్వమైన అనుభవం అవడం మూలాన అక్కడి వాతావరణమే ఒక విధమైన స్పందనతో తేలియాడింది.

ఇంతిలో జైలు సూపర్నెంటు ఖైదీలనూ.... ఆహ్వానితులను ఉద్దేశించి 'ఎవరేనా ఈ సందర్భంగా ఏదేనా అభిప్రాయాలు చెప్పదలుచుకుంటే దయ చేసి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకో' ... మంటూ కోరాడు.

—ఒకరిద్దరు నేరస్థులు తమ కృతజ్ఞతలు తెల్పుతూ కొంచెంసేపు మాట్లాడి ఆపాచున్నారు.

ఆ తరువాత ఇద్దరు స్త్రీలు ముందుకి వచ్చారు.

వారిలో ఒకామె చాలా అధునాతనంగా అలంకరించుకొచ్చింది.

పూర్వం భారత స్త్రీ తన ఔన్నత్యాన్నీ, సాంప్రదాయాన్నీ, సంస్కృతినీ, పమిట కప్పుకోడంలోనే కనబరిచేదట. అయితే అదే పమిటను నేడు ఈమె వివిధ భంగిమల్లో పొంగుల్ని ప్రదర్శించేందుకు పనికివచ్చేలా వాడుతూ అతికీ అతకుండా సమయ సందర్భం లేకుండా ఏదో మాట్లాడింది.

వయసులో వున్న ఒక పోగరుబోతు ఖైదీ ఆమెను చూస్తూ 'కన్నుకొట్టాడు' కూడా.

శ్రోతలు నిరాసక్తిగా ఏవో విన్నారు.

ఇంకో స్త్రీ ... ఐదు నిముషాలపాటు ఏమేమో చెప్పి చివరగా... 'సెలవ్' అంటూ చేతులు జోడించి చెప్పింది.

అది 'వందనమైనా . నిందాపదం లాగా శపించిపోతున్నట్టే అన్పించింది....

— వారితో పోలిస్తే మాలతికి ఒక్క అందమే కాదు; తెలివితేటలు కూడా వున్నాయని పించింది. ప్రతి చిన్న విషయాన్నీ క్షుణ్ణంగా పరిశీలించి మనసంతా పెట్టి ఆలోచించి సరియైన రిమార్క్ చేస్తుంటుంది.




'రాత్రికి ఇంటికి వెళ్లాక ఇదే సబ్జెక్ట్‌ని చర్చనీయాంశంగా పెట్టుకుని ఈనాటి కార్యక్రమం గురించి ఆమె అభిప్రాయం తెలుసుకోవాలి—' అనుకున్నాడు తిలక్.

'ఓ.... మాలతి.... తన అభిప్రాయాన్ని సభాపరంగా వ్యక్తపరిచేందుకా.... లేచి నిలుచుంది. ఏం చెప్పదలుచుకుంది.... ఈ పిరికిపిల్ల....? కాదు కాదు.... ఇటువంటి పిరికివారే సమయంవస్తే అమరసందేశాలు చాటగలరు—'

తిలక్ కుతూహలంగా చెవులు రిక్కించి వినసాగాడు.

* * *

"—సభాసదులకు నమస్కారములు!

....ఈ రోజు చాలా సుదినం. మిమ్మల్ని చూశాక నా అనుభవంలో జరిగిన ఒక సంఘటన మీ ముందు వుంచాలని నాకెందుకో అన్పించింది.

కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన విషయం ఇది—

ఒకరోజు నేను ట్రెయిన్‌లో ఒంటరిగా ప్రయాణం చేయవలసి వచ్చింది. నాకింకా చిన్నతనం. మా పిన్ని ఒకామె వుంది. ఆమె వద్దకు చుట్టపుచూపుగా వెళ్లానేగాని మూడురోజులు అక్కడ గడిపేసరికి కష్టాతిష్టం అయింది.

అంతే!

పేచీపెట్టి మొండిగా మా ఊరెళ్ళిపోవాలని పట్టుపట్టాను. ఆమె చేసేదిలేక సకలజాగ్రత్తలూ చెప్పి నన్నురైల్లో ఎక్కించింది. అంతవరకూ బస్సేగాని రైలు ఎక్కలేదు నేను. బస్సులోకూచుంటే.... 'దేవుని స్మరింపుము; హరేరామ- హరే కృష్ణ కృష్ణ కృష్ణ.... హరే హరే .. చిల్లర వెంటతెచ్చుకుని కండక్టరుతో సహకరించుము-' అంటూ వ్రాసివుండే వాక్యాలు ఖచ్చితంగా చదివే అలవాటు నాకుంది. అయితే. మా కంపార్ట్‌మెంట్‌లో 'దొంగలున్నారు జాగ్రత్త-' అనే వాక్యం తొలిసారిగా చదివిన నేను ఉలిక్కిపడి చుట్టూకూచున్నవారందరి వంకా పరిశీలనగా చూశాను. అందరూ నా మాదిరి ప్రయాణీకులే-

ఆనాడు అనవసరంగా భయపడ్డాను గాని.. అదే ఈ రోజునైతే-

'మనిషిమీద మనిషికుండవలసిన విశ్వాసాన్ని' తొలగించే ఆ నినాదాన్ని.... వ్యతిరేకించేదాన్ని.... (సభలో ఖైదీల చప్పట్లు ...) పెద్ద పెద్ద పెట్టెలు, ఎంతో డబ్బూ, విలువైన సామాన్లూ వదిలి నిశ్చితంగా కూచున్న నా తోటి ప్రయాణీకుల్ని చూస్తూ నా చేతి సంచీనికూడా ప్రక్కన పెట్టేశాను.

అందులో ఏముంది మహా.... 'రెండుజతల బట్టలు, పిన్ని నాచేతిలో పెట్టిన పదిరూపాయిల నోటు, మంచినీళ్ళ గ్లాసు, పిన్నివాళ్ళింటినించి నేను ఇష్టపడి తెచ్చుకుంటున్న వెంకటేశ్వర స్వామివారి పటం-' ఇంతే.

తీరా ట్రెయిన్ కదలబోయేముందు ఒకమ్మాయి ఎక్కింది మేంకూచున్న పెట్టెలోకి. ఎంతో బాగుంది. నా కన్నా రెండు మూడేళ్ళు పెద్దదనుకుంటాను. మా మదరాసు మామయ్య కూతుర్లా స్టయిల్‌గా వుంది. నేను కన్నార్పకుండా ఆమె వంకే చూస్తున్నాను .. కాబోలు; ఆమె నన్ను చూస్తూ తప్పనిసరిగా నవ్వింది.

నేనూ నవ్వుతూ 'నా పక్కని కూచోమంటూ... ' చోటిచ్చాను. క్రమంగా మా ఇద్దరి మధ్యా ఎన్నో కబుర్లు దొర్లినయి.

నా ఈడుదానికిమల్లే నాతో స్నేహంగా ఎంతో చనువుగా కలిసిపోయింది.

మేముద్దరం పరుగెత్తే పంటచేలవంకా తోటలవంకా చూస్తూ తన్మయం చెందాం. ఒకటి రెండు స్టేషన్లు దాటేంతవరకూ ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నాము. ఆ తరువాత ఇహ మాటలు దొరక్క ఎవరి ఆలోచనల్లో వారు పడిపోయి మౌనం వహించాము.

.. నాకు తెలీని కొత్త సంగతులు ఆమె నోటంట కౌతుకంగా వినిన నేను అవే మననం చేసుకుంటూ ఊయల ఊపుతున్న రైలు వేగానికి కళ్ళుమూశాను.

మరో రెండు స్టేషన్లు దాటాక ఆమె దిగిపోయేందుకు సిద్ధమై నా వంక చూసి నవ్వింది. జీవితంలో మళ్లీ ఆమెను కలుస్తానో లేదో అనుకుంటూ దిగులుగా ఆమెవంక చూస్తూ చేయిఊపాను. ఆమె దిగిపోయింది-

నేను మనసారా నమ్మి చెలిమి పెంచుకున్న నా స్నేహితం నన్ను వదిలి వెళ్లిపోయింది. నాకు ఏమాత్రం విసుగు అన్పించని ఈ రైలు ప్రయాణం తలుచుకుంటూ 'బోగీ' అంతా మరోమాటు కలియజూశాను.

కొట్టవచ్చినట్టు అదే వాక్యం- "దొంగలున్నారు.... జాగ్రత్త....." యాంత్రికంగా నా చేతులు 'సంచి' కోసం తడిమినయి. అది కన్పించలేదు.

నా నోట మాటరాలేదు. అమ్మయ్యో అందులో నాకున్న రెండే రెండు విలువైన పట్టు పరికిణీలు.... పదిరూపాల నోటు- గ్లాసు....

"మీ యిష్టదైవం వెంకన్నబాబు కూడా దొంగిలింపబడ్డాడా....?" (ఖైదీల్లోంచి ఒక రేషనలిస్ట్ ప్రశ్న)

సభలో కలకలంతో కూడిన నవ్వులు-

"ఆగండాగండి....!" అన్నట్టుగా చేతిని వూపి వారిస్తూ మాలతి.... "నేనిహ చేసేదిలేక దొంగలున్నారు జాగ్రత్త- అంటూ ఆ బోర్డు నన్ను చూసి వెక్కిరిస్తుండగా నెమ్మదిగా దిగిపోయాను.

-ఇంతకీ నేను చెప్పొచ్చేదేమంటే.... నేను ఇప్పటికీ ఆమెను అనుమానించను. ఆమె నాకు దొంగలా కన్పించలేదు కనుక- 'సాంఘిక న్యాయం దృష్ట్యా ఆమె నేరాన్ని మాత్రమే నిరసించాను. నిస్సందేహంగా.... 'ఆమె దొంగ'- అంటూ'-

అసలు నా దృష్టిలో దొంగలు వేరు.

'లంగోటాలు మాత్రమే కట్టుకుని చేతికి చిక్కినప్పటికీ సులభంగా జారిపోయేందుగ్గాను.... ఒంటికి ఆముదం రాసుకుని, నల్లగా.... చింతమొద్దుల్లా' ఉంటారని...." (ఖైదీలంతా గొల్లుమంటారు) ఆ గుంపులోంచే- మోడరన్.... మోడరన్.... అంటూ అరిచారెవరో.

"కానీ మిమ్మల్ని చూస్తుంటే నాకు జాలివేస్తోంది. పటిష్ఠమైన ప్రభుత్వం చేతిలో మనమంతా ఒక తల్లి బిడ్డల్లా- మసలవలసిన స్థితిలో.... పైగా ఇక్కడున్న వారిలో స్త్రీలుకూడా-

పిల్లలు నిద్రపోకపోతే ఈ తల్లులే.... 'అమ్మో బూచాడొస్తాడు....దొంగాడొస్తాడు.... పట్టుకుపోతాడని' బెదిరించి నిద్రపుచ్చే ఈ స్త్రీలు—

నవసమాజాన్ని నిర్మించి, పెంచి పెద్దచేయవలసిన వీళ్లు.... నేరస్థులా....?

అనాదిగా 'దొంగాడొస్తాడు.... దొంగ.... దొంగ....!' అంటూ అరిచేవాళ్ల అలవాటుగా చూస్తున్నాం గాని; 'దొంగ దొస్తుంది; దొంగది....దొంగది....' అనడం చూళ్లేదు. నాకిది కొత్త విషయం.

—ఈ రోజున ఈ 'రక్షాబంధన్....' అనేది కేవలం....

"సింబోలిక్....ఆఫ్ ... హ్యూమన్... ఎఫెక్షన్స్" అనేదే చూపిస్తుంది. అయితే దీని ద్వారా హృదయ పరివర్తన పొంది, మమత.... మానవతలు పెంపొందించుకోవాలని మా ఆకాంక్ష ...

జాతిని పునరుద్ధరించడంలో స్త్రీలు కూడా కీలకమైన పాత్ర వహించవలసి వున్న ఈ తరుణంలో తమ బాధ్యతలు గుర్తెరిగి ఇహమీదట నైనా సత్ప్రవర్తనతో మెలిగి మానవాభ్యుదయానికి తోడ్పడతారని ఆశిస్తూ ముగిస్తున్నాను (కరతాళ ధ్వనులు)

అందరూ ఆపినప్పటికీ తిలక్ చప్పట్లు కొడుతూనే వున్నాడు. అతని హృదయం ఆనందాశ్చర్యాలతో పూడుకుపోయింది. అతడు త్వరత్వరగా ఆవరణం వెలుపలికి వచ్చాడు.

మాలతికోసం అతని కళ్లు గాలించినయి. ఆమె ఎక్కడా కన్పించలేదు. —పది నిముషాల్లో వచ్చేస్తానని పై అధికారివద్ద సెలవు తీసుకుని తిలక్ తిన్నగా తన క్వార్టర్ వేపు నడిచాడు.

.. దూరంగా మాలతి గేటు తీస్తూ కన్పించింది.

నోటికి కర్చీఫ్ అడ్డుగా పెట్టుకుని ఆమె గబగబా జాజిపందిరివెనుక మాయమైంది.

*    *    *

సుధాకర్ ఇంటికి వచ్చేసరికి మాలతి బెడ్ మీద పడుకుని వుంది.

తిలక్ ఆవేళ జరిగిన వృత్తాంతం యావత్తూ వివరించి.... "మాలతి బాగా ఉద్రేకపడిందనుకుంటాను; ఆమెకు భోజనం కూడా జీర్ణంకాక వాంతి చేసుకుంది_" అంటూ ఆందోళనగా ముగించాడు.

"జ్వరం లేదు కదూ... మాలా ! ఇటు చూడు... !!" సుధాకర్ ఆమె నుదుటిపై చేయివేస్తూ అనురాగంతో అడిగాడు.

"వాల్లెండి . మీరు మరీను .. నాకేం కాలేదు.... !" మాలతి మృదువుగా జవాబిచ్చింది.

ఆ తరువాత భర్త అందించిన కాఫీ తాగుతూనే మళ్ళీ వాంతిచేసుకున్న మాలతిని చూసి తిలక్ "డాక్టర్ని పిలిపిస్తా...." నంటూ ఫోన్ అందుకున్నాడు.... కంగారుగా.



మాలతిని పరీక్షించిన డాక్టరు అసలు విషయం బయట పెట్టేసరికి . . "కంగ్రాచ్యులేషన్స్ సుధా!" అంటూ తిలక్ అభినందనలు కురిపించాడు. మాలతి సిగ్గుతో తలదించుకుంది. సుధాకర్ ఆనందంతో తేలిపోయాడు. మాలతి సుధాకర్ ఇద్దరూ ఒకే సోఫాలో పక్కపక్కన కూచుని వున్నారు. డాక్టరుతో పాటు తిలక్ కూడా బయటికి వెళ్ళిపోయాడు.

ఆమె రాసిచ్చిన మందులు, టానిక్కుల కాగితం అతని వద్దే వుండిపోయింది.

సుధాకర్ వెళ్ళి వీధి తలుపు గడియపెట్టి వచ్చాడు.

ఇంటి మొత్తానికి వాళ్ళిద్దరే మిగిలారు. సుధాకర్ చాలా హుషారుగా వున్నాడు. లోపలికి వస్తూనే చప్పున మాలతిని రెండు చేతుల్తో పైకెత్తి ఒళ్ళో కూచోబెట్టుకున్నాడు.

"మాలా... ఇంత మంచి ఖబురు ఇన్నాళ్లూ నాతో చెప్పకుండా ఎలా దాచగలిగావ్...." ఆమె చెంపలమీద ముద్దుపెట్టుకుంటూ అడిగాడు.

"ఛీ....ఏంవిటండీ ఇదీ . ః తిలక్ రాగలడు...." సున్నితంగా అతని మొహాన్ని తోసేస్తూ పలికింది.

"వాడి మొహం .. ఆ లేడీ డాక్టరు వెనకాల పడిపోయాడుగా; ఇప్పట్లో రాడు"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మాలా .విన్నావు కదూ . ః ఇహానించీ నీమీద మన అజమాయిషీ సాగుతుందన్నమాట. నే చెప్పినట్టు నువు వినాలి. ముందుగా నీ నోటికి వాగా వని చెప్పాలి. వాగడం కాదు. ఎక్కువ తిండి తినాలి. నీకు ఏమి తినాలనుందో మొహమాట పడకుండా చెప్పెయి సరేనా....?" నుదుటిమీది ముంగురులు వేళ్ళతో వెనక్కి దువ్వుతూ ప్రేమగా పలికాడు.

మాలతి ఉక్కిరిబిక్కిరై పోతోంది_

ఉన్నట్టుండి ఉన్నత పదవి లభించినట్టయింది ఆమె పని. భర్త నడుముచుట్టూ చేతిని వేసి అతనికి దగ్గరగా జరిగి గుండెల్లో తలదూర్చింది.

-ఈ రోజు మన అద్దె ఇల్లు చూసొచ్చాను మాలా... ః ఫరవాలేదు. ఆ అద్దెకీ ఆ ఇంటికీ సరిపోయింది. ఎటొచ్చీ ఈ పరిస్థితిలో మనం కొన్నాళ్ళపాటు ఇక్కడే వుంటే మంచిదనిపిస్తోంది.. ఏమంటావ్....? ముఖ్యంగా మంచి నౌకరూ, డాక్టరూ ఇంకా కొన్ని సదుపాయాలూ అవీ సమకూరాలంటే కొత్త ప్రదేశంలో కొంత టైమ్ పడుతుంది —"

మాలతికి 'నిజమే' ననిపించింది. అలాగని ఆమెకు ఇక్కడే వుండి తిలక్‌కి అనవసర శ్రమ కలిగించడమూ ఇష్టంగా లేదు. ఎటూ తేల్చుకోకుండా వుంది. మధ్యాహ్నంనించీ ఏమీ తిననందువలన ఆమెకు చాలా నీరసంగా బాగా వుంది. నెమ్మదిగా అతని వొళ్లోకి జారి తొడమీద తల పెట్టుకుని పడుకుంది.

సుధాకర్ భార్య వేపు లాలనగా చూస్తూ...."ఏమయింది మాలా....అలసిపోయా వనుకుంటాను కదూ....? పడుకుంటావా....దిండు తీసుకురానా ..." _లేవబోయా డతను.

"వద్దు ...వద్దు- నా కిలాగే బావుంది ..." అతని చేతిని గట్టిగా పట్టుకుని వారిస్తూ అంది మాలతి.

పక్కనే టీపాయిమీద సిగరెట్ పాకెటు అగ్గిపెట్టె వున్నాయి. సుధాకర్ ఒక సిగరెట్ తీసి వెలిగించి కిటికీలోంచి ఆకాశంలోకి చూస్తూ ఆలోచించడం మొదలెట్టాడు.

మాలతి కూడా పరధ్యానంలో పడింది.

ఆమె మనసులో 'అద్దె ఇల్లు' మెదిలింది. ఎన్నాళ్ళిక్కడున్నా అక్కడికి పోక తప్పదనే సత్యం బాధించింది. ఇక్కడినించి కదలాలంటే ఏదోగా వుంది- 'తిలక్ పరాయివాడెలా గవుతాడు.... మేము అతనికి భారంగా వున్నామా....?'

ఈ ప్రశ్నలకు జవాబు కావాలి ఆమెకు.

తిలక్ చూపించే అభిమానంలో అనుమానించే అవకాశమే లేదు. అతనికి ఈ ప్రపంచంలో 'నా' అనే వారెవ్వరూ లేరు. పెళ్ళయి భార్య వస్తే తప్ప. అతను ఎందుకని అడతోడు లేకుండా ఏకాకిలా బతుకుతున్నాడో....? పోషించలేకనా ... ఆదరించలేకనా....? ఎందుకని ఈ నిగ్రహం.... ఇటువంటి ఉత్తముని ఇల్లాలుగా రావాలంటే ఆ స్త్రీ ఎంత పుణ్యం చేసుకుని ఉండాలి—

ఆరోజు —

'ఆరోజు....నాన్న రాకపోయినట్టయితే తిలక్ ....తనను...ఏంచేసివుండేవాడో? ఆ తరువాత తమకి పెళ్ళయి అతని సంతానానికి తల్లిగా ఇక్కడ ఈ ఇంట్లో ఇలాగే అతని ఒడిలో....' —

'ఛ— మనసు ఎంత చెడ్డది? అది ఎంత వేగంగా....ఎంత సంకుచితంగా మారిపోతుంది...? తమ వివాహానికి ముందు ఒకానొక మానసిక వికారంలో జరిగిపోయిన పీడకల వంటి ఆ సన్నివేశం ఎందుకని మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం వస్తోంది?

— ఏదో యావతో కూడిన భీతితో ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. 'ఒంటరిగా వున్న మనిషి జంటకోరి తోడుకోసం తపించే సమయాన జరిగిపోయిందది. ఇప్పుడు తనకు భర్త ఉన్నాడు అండగా. ఇతని సాన్నిధ్యంలో గడపడం తన విధి....' అనుకుని - ఆమె సుధాకర్ చేతిని బలంగా నొక్కి పట్టుకుంది.

మాలతి అతని చేతిని బలంగా నొక్కడంతో ఆ ఆనందానికి అంతరాయం కలిగి "మాలా....ఏవిటి? మళ్ళీ వాంతి అయేలా వుందా" అంటూ ఆత్రుతగా మీదికి వంగి ఆమె భుజం పట్టి కుదుపుతూ అడిగేడు.

"ఉహూ ... లేదండీ. ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తుంటేనూ ...." ఉన్న నిజం చెప్పేసింది.

"ఏవిటి నీ పిచ్చి ఆలోచన్లు? నాతో చెప్పు వింటాను—" ఆమె కళ్ళల్లోకి చూస్తూ నవ్వుతూ అడిగాడు.

మాలతి చప్పున కళ్ళు తిప్పేసుకుంది.

'అయ్యో.... నా ఆలోచన్లు మీతో ఏమని చెప్పుకోనండీ! అవి నిషిద్ధమైనవి. పైకి చెప్పుకునేవి కావు' అనుకుంది లోలోపల.

అంతలోనే – 'ఇటువంటి భర్త సమక్షంలోనా....ఇలాంటి ఆలోచన్లు! పోనీ ఎందుకొచ్చిన తంటా....! ఇతనితో జరిగింది జరిగినట్టు చెప్పేస్తే–? ఏవండీ....! తిలక్ మా ఇంట్లో ఉండే రోజుల్లో ఇలా అయిందండీ.... అతని సంగతి నాకు తెలీదు గాని; నేను మాత్రం మిమ్మల్ని నిష్కల్మషంగా ప్రేమిస్తున్నానండీ....ఇది నిజం.... నన్ను నమ్మండి...." అని చెబితే పోలా....? బ్రతికి నన్నాళ్లూ అబద్ధపు బ్రతుకు బ్రతికే కన్నా ఇది నయం కాదూ....??" అనుకుంది.

–అయితే ఈ విషయం వెల్లడిచేస్తే వాళ్ల స్నేహం మైలపడి చివరికి ఎవ్వరికీ సుఖం వుండదని తెలుసుకునేందుకు ఆమెకు ఎంతోసేపు పట్టలేదు.

"నువు చెప్పకపోయినా నాకు తెలుసు మాలా నీ ఆలోచన్లు– అవి ఈ జైలు గోడలు దాటి బయటి ప్రపంచాన్ని చూడలేకపోతున్నాయి. నిన్నికక్కడ్ణించి తప్పించేస్తే తప్ప లాభం లేదు....

....ఎంతసేపూ.... నువ్వూ.... నీ మాపుగాడూ మీ 'దొంగ'... ఖబుర్లూ అపునా....??"

—మాలతి నిశ్చేష్టురాలయింది. గిల్టీగా ఫీలయింది. 'అసలు తనని ఇక్కడికి తీసుకువచ్చి పడెయ్యడం ఇతని తప్పు కాదూ... !' అనుకుంది.

"ఏవిటి మీరు మాట్లాడేది... ?" కోపంగానే అడిగింది.

"ఏమీ లేదు. నీ దసలే జాలిగుండె. పిరికి మనసు. లంచ్ టైమ్‌లో తిలక్ నాకు ఫోన్‌చేస్తూ "ఏదో ఫంక్షనుంది జైల్లో ... వస్తావా....?" అని అడిగితే కుదరదని చెప్పాను.

వాడు ఊరుకోవచ్చునా....! ఏదో 'లేడీసూ.... గోంగూరా....' అంటూ ఏమేమో చెప్పాడు. సరే ఒప్పుకోక తప్పింది కాదు. 'నేను రాలేను.... నువు వస్తే తీసుకుపొమ్మ'ని చెప్పాను. నువు వెళ్తావను కోలేదు.

—వెళ్లింది కాక పైగా ఏ ఖూనీకోరుకో రాఖీ కట్టావట. ఆ దొంగమొఖాల్ని చూస్తూ స్పీచ్ కొట్టావట. నీకు దొరికిన శ్రోతల ననుకోవాలి!

ఇప్పుడు చూడు అసలే ఈ పరిస్థితిలో ఎలా అప్‌సెట్ అయిపోతున్నావో. జైళ్లంటే ఏం తెలుసును గనుక నీకు చెప్పు....?!"

"మీకు మాత్రం ఏం తెలుసునేం....? ఎంతసేపూ మీ ఉద్యోగం.... ఆ రంధీ తప్ప....!!" మాలతి ఉడికిపోతూ అంది.




"పిచ్చి మాలా ..! ఏమనుకుంటున్నావ్.... నువ్వు ?

మీ తిలక్ ఆ గోతిలో దిగాడు గనుక అదే లోకం . అనుకుంటున్నాడు గానీ . , అవి ఉద్యోగాలు కావా....? వాళ్ళకి జీతాలు దొరకడంలా... ? అవి జీవితావసరాలు తీర్చడం లేదూ ....??"

... మాలతి నిశ్శబ్దంగా కళ్ళు పైకెత్తి అతని మొహంలోకి చూసింది. మని షికీ మనిషికీ జీవన విధానాన్ని బట్టి ఆలోచనా విధానంలో చాలా మార్పు వుంటుం దన్నమాట_

ఎర్ర పెన్సిలు చేతబట్టుకుని పరీక్ష పేపరు దిద్దినంత సుళువుగా తేల్చి చెప్పాడు. ఇది తిలక్ వింటే ఎంత బాధపడిపోయేవాడు . ??

సుధాకర్ వదిలే సిగరెట్ పొగ పీలుస్తూ కూచోడం మాలతికి ఎంతో ఇష్టం. అయితే ఈ సమయాన ఆమె కా వాపన దుర్భరంగా అన్పించింది. సరాసరి వాష్ బేసిగ్ వద్దకు నడిచిందామె.

మాలతి తిరిగి వచ్చేసరికి బాగా చీకటయింది.

సుధాకర్ వీధి తలుపు బోల్టుతీస్తూ కనిపించాడు. తిలక్ నవ్వుతూ లోపలి కొచ్చాడు.

ఆమె కూడా అతన్ని చూస్తూ చిరునవ్వు నవ్వి లైట్ స్విచ్ వేసింది. ఒక పెద్ద బుట్టనిండుగా బోలెడు బత్తాయిలూ, ద్రాక్షపళ్లూ, బ్రెడ్, బిస్కట్లూ. టానిక్

సీసాతో పాటు ఏవో టాబ్లెట్లూ మోసుకొచ్చాడు తిలక్. అవి ఏ టైమ్‌లో ఎలా మింగాలో డాక్టరు చెప్పినట్టే వివరించాడు.

సుధాకర్ బుట్టలో వున్న టానిక్ సీసా చేతిలోకి తీసుకుని దానిమీద రాసున్న వివరాలు చదువసాగాడు.

"అది సరేగాని.... ఏఁవిటది ..? బజారంతా ఇంటికి నడిపించేశావ్... ?" పళ్లబుట్టవేపు చూస్తూ మాలతి ఆశ్చర్యంగా అడిగింది.

"మాలా....! నేను ఒంటరి పక్షిని. అతిథుల్ని ఎలా పరామర్శించాలో నాకు తెలీదు. ఇది నీ యిల్లే.... అనుకుని, నీ కేమేం కావాలో చెబితే సంతోషంగా ఆ ఏర్పాట్లన్నీ చెయ్యగలను. సాధ్యమయినంత వరకూ మీకు ఇబ్బంది కలక్కుండా చూడాలన్నదే నా తాపత్రయం... "

"చూడు తిలక్....!?" టానిక్ సీసా బల్లమీద పెట్టేస్తూ పిలిచాడు సుధాకర్. మాలతి, తిలక్ ఇద్దరూ సుధాకర్‌వేపు చూస్తూ; ఏం చెబుతాడా.... అని ఎదురుచూడసాగారు.

సుధాకర్ భావగీతం పాడబోయేవాడికి మల్లే మొహంపెట్టి ఇంటికప్పుకేసి చూస్తూ కొన్ని క్షణాలు ఆలోచించి చివరికి—

"మా ఇల్లే అనుకుని ఏం కావాలో చెప్పమన్నావ్ కదూ.... 'ఐస్‌క్రీమూ, ఏపిల్ జ్యూసూ, బాదం హల్వా, జీడిపప్పుపాకం— మాలతికి మామూలు అలవాట్లు. ఇహ నా సంగతంటావా....

'బీరుబుడ్డీ— బ్రాయిలర్ చికెన్'తో సరిపెట్టుకోగలన్నేను. అటువంటప్పుడు ఈ బత్తాయిలూ డబుల్ రోటీ ఇవేం ఆగుతయి స్వామి మాబోటివాళ్ళకు...." సీరియస్‌గా చెప్పి కాజువల్‌గా నవ్వాడు. మాలతిని సుధాకర్ మాటలు మొదట తికమకపెట్టినా చివరికి అర్థమయి హాయిగా నవ్వేసింది.

దంపతులిద్దరూ చెప్పుకుని నవ్వుతున్నారా.... అన్నట్టు తిలక్‌వేపు చూసి ఎంత నవ్వినా అతని మొహం మాత్రం ఏదో సతమతమౌతున్నట్టే కనిపించింది

"బజారంతా తిరిగాను గాని ఏం కొనాలో నాకు తెలీలేదు. మిఠాయిలు కొందా మనుకున్నాను. మాలతి తింటుందో తినదో అనిపించింది

ఫ్రెష్ వెజిటబుల్స్ కనిపించినాయి. ఒంట్లో బాగోలేదు కదా; నాల్రోజుల పాటు క్యారేజి తెప్పించుకుంటే పోలా.... అనుకున్నాను. వేడిగా గారెలో.... పకోడీలో పాక్‌చేయించి పట్టుకొద్దామనుకున్నాను—

అసలే వాంతులు...' జీర్ణంకావు; అని మానేశాను. నిజంగా ఈ మధ్యకాలంలో ఇటువంటి డైలమాలో పడలేదంటే నమ్మండి!

అన్నీ కొనేసెయ్యాలని ఆరాటం. ఏది అవుసరమో తక్కున తోచకపోడం–" చొక్కా గుండీలు ఒకటొకటే విప్పుతూ గబగబా చెప్పుకుపోయాడు.

'ఇతను.... ఎంతటి.... స్నేహశీలుడు.... !'

సామాన్యంగా వ్యక్తుల మధ్య గౌరవభావం, ఆత్మీయత చోటుచేసుకున్నప్పుడే ఇలా తపనపడడం జరుగుతుంది.

ఎవరమ్మా....? తమ గురించి ఇంత ఆపేక్ష కనబరిచేవారూ....?

మాలతి పొంగిపోతూ అనుకుంది.

సుధాకర్ ఈ మాత్రం గ్రహించగలిగాడో లేదో.... 'ఏదో కొత్త ప్రదేశానికి వచ్చాం.... నాల్రోజులు అలవాటయిందాకా కాలక్షేపం చేసేసి....ఆ తరువాత మా దారిన మేం పోతాం ...' అనుకుంటున్నాడేమో!

అసలు ఈ ఇద్దరు మొగవాళ్ళ స్నేహం ఎంతవరకు....?

తమ పెళ్ళయాక బంధుత్వం పేరుతోనో.... స్నేహం పేరుతోనో ఒక పొరుగింట్లో మకాం వెయ్యడం ఇదే మొదటిసారి–

వీళ్ళిద్దరూ పెళ్ళిలో ఏం కలిసితిరిగారో తనకి తెలీదు. ఆ తరువాత ఉత్తరాలు మటుకు రాసుకునేవారు. సాధారణంగా ఉత్తరాల స్నేహమే గొప్పది– ఎందుకంటే ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలుసుకునేందుకు 'వ్రాత'లోనే ఎక్కువ వీలుంటుంది.

పైగా సుధాకర్‌కి స్నేహితులంటూ ఎవరూ లేరు.

–ఏ సినిమాహాలు పక్షో ఎవరినో చూపించి 'అతను నా కొలీగ్....' అనీ ఇంకోచోట ఇంకెవరినో చూపెట్టి 'వాడు నా క్లాస్‌మేట్'– అనీ చెబుతాడే గాని.... "ఇదుగో నా ఫ్రెండ్...." అంటూ ఏ ఒక్కరినీ ఎన్నడూ చూపించి ఎరుగడు.

ముఖ్యంగా చెప్పవలసింది మనిషి మొహమాటం గురించి. ఇంతా అంతా మొహమాటం కాదు–

అటువంటివాడు తనతో ప్రస్తావించకుండా గూడా ఇక్కడికి వచ్చి వాలాడంటే వీళ్ళ స్నేహం బంధుత్వాన్ని మించిన మరేదో 'బంధం'తో ముడిబడివుందన్న మాట–'

"ఏమిటి మాలా...? మళ్ళీ నిలబడిపోయి ఆలోచిస్తున్నావా...?" సుధాకర్

మాలతిని హెచ్చరించి...

తమాషాగా ఆమెవేపు వేలుపెట్టి చూపిస్తూ తిలక్‌తో... "ఈమెగారు ఈ మధ్య కొత్తగా ఇదొకటి నేర్చుకున్నారు; అవులింత కూడా ఆలోచనే...!" అంటూ అతని పత్తాసుకోసం చూశాడు.

తిలక్ మాలతివేపు చూసి కళ్ళెగరేస్తూ "అవునా..." అని అడిగాడు.

మాలతి కిమ్మనలేదు.

తిలక్ స్నానంచేసి వస్తానంటూ బాత్‌రూమ్ వేపు నడిచాడు.

_ఒక అపరిచితుడు గేటు తీసుకుని లోపలికి వస్తూ కనిపించాడు. అతని చేతిలో నిలువెత్తు కారియరు వుంది.

మెయిన్ రూమ్‌లో ఓ బల్లమీద దానిని భద్రంగాపెట్టి_ సుధాకర్‌కి దణ్ణం పెట్టేసి వరండాలో ఓ మూలకు వెళ్ళి నిలబడిపోయాడు. అతను. ఆ ఉదయం తయారుచేసిన కూరలు, పులుసూ ఇంకా మిగిలేవున్నాయి. ఈ పూట తనకెటూ తిండి తినాలని లేదు.

ఒక పావు బియ్యం అత్తెసరు పేస్తే సరిపోయేదానికి ఎందుకింత హంగామా చేశాడు...?

మాలతి వంటఇంట్లోకి వెళ్ళి గిన్నెలన్నీ మూతలు తీసి చూసింది. ఆమె ప్రాణం వుసూరుమంది. 'పోనీ ఆ క్యారేజి మోసుకొచ్చిన వాడికైనా ఇచ్చి పంపిస్తాను; హాయిగా తింటాడు_' అనుకుంది.

తిలక్ స్నానం ముగించి వస్తూనే... "అరే... క్యారేజి రెడీనా...! వెరీగుడ్, సుధా! నువ్వు చెయ్యవా స్నానం...?" అంటూ అడిగాడు.

"ఉఁహూ...చెయ్యను. మీ ఊళ్లో పగలేమో ఎండా: రాత్రి చలీ... కొన్ని అలవాట్లు మార్చుకోవాల్సి వచ్చేట్టుందికూడ_" అన్నాడు సుధాకర్.

"ఆల్‌రైట్... రండి భోంచేద్దాం...!_ అప్పన్నా...!!"

క్యారేజి మోసుకొచ్చి వరండాలో వేచి చూస్తున్నవాడి పేరు 'అప్పన్న' కాబోలు... అందరితోపాటు వాడూ డైనింగ్‌రూమ్‌లో కొచ్చాడు.

కాళ్లూ చేతులూ శుభ్రంగా కడుక్కుని వచ్చి వడ్డన కుపక్రమించాడు. ఏదో సర్దబోతున్న మాలతిని ఉద్దేశించి,

"మీరూ కూర్చోండమ్మా... నేను వడ్డిస్తాను... తమరికూడా..." అంటూ నమ్రతగా చెప్పాడు.




"లేదు... లేదు... నేను భోంచెయ్యను-" మాలతి అయిష్టంగా పలికింది. ఆమె ఊరికే బల్లముందర కూచుంది.

"మాలా...! బ్రెడ్ తీసుకో పోనీ... నువ్వేమీ తినకుండా కూచుంటే.. మాకు బాగోదు..." అంటూనే తిలక్ అప్పన్నను వేడిగా పాలు కూడా పట్రమ్మని **పురమాయించాడు.**

ఒక సాసరులో బ్రెడ్ ముక్కలూ, మరో కప్పు నిండుగా పాలూ తెచ్చి **టేబిల్**మీద ఆమె ఎదురుగా పెట్టాడు వాడు.

మాలతి వాటిని చూస్తూనే... "మరీ మేమేదో ఫారిన్‌నించి ఇప్పుడే దిగొచ్చినట్టు చేస్తున్నావ్ మావయ్యా..." అంది.

-"మర్యాదలు చూపించడానికి ఫారిన్‌నించే రావాలా...? నిజంగా విదేశీయ అతిథులు మనదేశం వస్తే మన ఆచార వ్యవహారాలు అడుగడుగునా గుప్పిస్తూ కమ్మని భోజనం తినిపించి... ఆట పాటలు చూపించి ఆనందపరుస్తాము. ఎందుకూ...?

అది మన సాంప్రదాయం.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఈ రోజుల్లో పెళ్ళో పబ్బమో పుట్టిన్రోజో అనేసి పార్టీలు జరుగుతున్నయి చూడూ.... అక్కడ ఆత్మీయతకన్నా ఆడంబరానికి ఎక్కువ ప్రాధాన్యత కనిపిస్తుంది. తిననివీ.... మాననివీ.... ఎన్ని

వెరైటీలు సర్వ్‌చేయబడితే అంత ఘనత. వేలుసుంచి వదిలేవారు కొందరైతే, పదార్థంవేపు చూస్తూనే నిరసనగా మొహం తిప్పేసుకునేవారు కొందరు.

అలా చేయడం ఫాషను. పోనీ అనేవి పొదుపుగా, లిమిటెడ్‌గా వడ్డించారనుకోండి– ఆ హోస్టుని గురించి కథలుగా చెప్పకుంటారు. శక్తిలేకపోయినా, వేస్టేజి ఎంతయినా అవనీ దండిగాచేసి పారెయ్యాలన్నమాట. అప్పుడే చూసినవాళ్ళ కళ్ళు చల్లబడేది.

ఇలాగే సమాజం మనిషిని లొంగదీసుకుంటోంది– 'బాగు.. బాగు' అంటూ తిరిగి వాడికి బ్రహ్మరథం పడుతోంది–"

"అంటే ఇప్పుడు నువ్వు మాకు దడిచే ఈ ఏర్పాట్లన్నీ చేస్తున్నావా ?" అతను చెప్పబోయే సమాధానం తెలిసివుండి కూడా మాలతి కావాలని అడిగింది.

"ఛఛ అలా భయపడేవాడినయితే ఇందాక చెప్పినట్లు కనిపించినవన్నీ కొనేసి హోరెత్తించేవాణ్ణి. మనలో మనకేంవిటి అనుకుంటున్నాను కనుకే మిమ్మల్నిదిగి తెలుసుకోడం "

–సుధాకర్ ప్లేటులోపడిన ప్రతిదీ వదలకుండా తినేస్తూ "తిలక్.. ? నాదొక చిన్న సందేహం ! తీర్చుకోమంటావా ??" అంటూ అడిగాడు.

"తీర్చుకో . !"

"ఇదీ . హోటలువాడి తయారులా లేదు. ఇంటి భోజనంలా వుంది. కొంపదీసి ఎక్కడయినా ఎవరినైనా మెయిన్‌టెయిన్‌చేస్తూ "

"కరెక్ట్ . !"

మాలతి అదిరిపడి చూసింది.

"ఇక్కడ కేరళనించి వచ్చిన ఫామిలీ వుంది. రోజూ దాదాపు ముప్పయి నలభై మందికి వంటచేసి పెడుతుంటారు వాళ్ళు. అదే 'మెస్' మాదిరి అనుకో ! అక్కడికి వచ్చే ప్రతి ఒక్కరూ ఇలాగే తృప్తిగా భోంచేసిపోతుంటారు. నెలలో కనీసం మూడు వారాలయినా నేను అక్కణ్ణించే తెప్పించుకుంటాను. లేదా . తినేసివస్తాను. ఈరోజు ముందుగా చెప్పేసివచ్చాను కదా ! ఇంకాస్త స్పెషల్‌గా చేసినట్టున్నారు–"

మాలతి భర్తవంక కొరకొరా చూస్తూ "ఎంత బ్రహ్మచారి అయితే మాత్రం రోజుకి ఎంతమంది ఆడాళ్ళని అంటగడతారూ . " అంది నిష్ఠూరంగా.

"ఇంతకు ముందు ఎవర్ని కట్టాడేం ?" తిలక్ కుతూహలంగా అడిగాడు.

"ఇందాక వచ్చి వెళ్ళింది చూడూ ? ఆ డాక్టరమ్మని ..."

"చంపేశారు....! అయితే ఒకటి. ఆమెకు ఎందుకోగాని నేనంటే చాలా క్రేజ్. పిలిస్తే చాలు- పరుగెత్తుకొస్తుంది. ఇవ్వాళ ఫంక్షన్‌కి కూడా పిలవంగానే వచ్చింది పాపం. గైనకాలజిస్టు- అప్పుడప్పుడు వచ్చి మాలతిని చూసిపొమ్మని చెప్పాను కూడా...."

చూశావా మన ఐడియా అన్నట్టు సుధాకర్ మాలతివేపు పోజుగా, గర్వంగా.... చూసి నవ్వి- "నువ్వేదో వెనకేసుకొస్తావ్...." అన్నాడు.

మాలతి మూతి మూడువంకరలు తిప్పింది.

అందరి భోజనాలు అయిపోయినయి-

సుధాకర్ బల్లముందునించి లేవకుండా కుర్చీ వెనక్కివాలి కూచుని ఆయాస పడుతూ.... "తిలక్ మీ డాక్టరమ్మని ఇప్పుడోమాటు పిలిపిస్తావా...." అంటూ అడిగాడు.

"ఇప్పుడెందుకు....?" మాలతి ఆశ్చర్యంగా అడిగింది.

"ఈ తిండి తినేసరికి నాకూ ప్రెగ్నెన్సీ వచ్చినట్టుంది-"

"చాల్లెండి.... గొప్ప....!" మాలతి సిగ్గుగా అని- "పెపట్నించీ ఈ కారేజి తెప్పించక్కరలేదు.... నేనే వండిపడేస్తాను-" అంటూ వంటఇంట్లో మిగిలిన పదార్థాలుకూడా అప్పన్న కిచ్చేందుకు లోపలికి నడిచింది.

* * *

మాలతి ఒంట్లో ఇప్పుడు బాగానే వుంటోంది. బిళ్ళలు వాడుతున్నది. టానిక్ వాడుతోంది. పళ్ళరసాలు తాగుతోంది. పనిలేదు. మనసుకీ కావలసినంత విశ్రాంతి. నిద్రరాకపోయినా ఊరికే పడుకుని ఉండడంవలన ఏమీ తోచడంలేదు.

తిలక్ ఒక సమయంలో డ్యూటీకి వెడితే సుధాకర్ వెళ్ళేది వేరే సమయం. తిరిగిరావడంకూడా ఆ మాదిరే.

అసలు సుధాకర్ ఉదయం వెళ్తే తిరిగి అరుప్రాంతంలోనే ఇల్లు చేరేది. ఏదైనా ఫలహారం టిఫిన్ డబ్బాలో పెట్టుకుపొమ్మంటే ససేమీ వద్దంటాడు. కాలేజి సమీపానవున్న కాంటీన్‌లోనే లంచ్‌టైమ్‌లో ఏదో ఇంత తేలిగ్గా తినేసి టీతాగి సరిపెట్టుకుంటున్నాడు.

తిలక్ మాత్రం టంచన్‌గా మధ్యాహ్నం అన్నానికి ఇంటికి వస్తుంటాడు. అంతవరకూ మాలతి కాచుక్కూచునుంటుంది.

ఇద్దరూ ఏదో ఒక చర్చలో పడి నిరాటంకంగా ప్రసంగించుకుంటూ ఎంతో సేపు డైనింగ్ టేబిలుముందు కూచుంటారు_

తిలక్ ఫోంచేసి వెళ్లంగానే మాలతి మళ్లీ ఒంటరిగా మిగిలిపోతుంది సాయంత్రం ఎప్పుడవుతుందా అని ఎదురుచూస్తూ.

వారం రోజులు ఇట్టే గడిచిపోయినయి.

ఈ మధ్యలో ఒకటి రెండుసార్లు టౌన్‌లోకి వెళ్లొచ్చారు. ఎరగని మనుషులు కొత్త ఊరు చూసినట్టే పిచ్చిగా ఊళ్లో చూడదగిన ముఖ్యమైన ప్రదేశాలన్నీ అప్పుడే చూసేశారు.

ఇహ మిగిలిందల్లా వాళ్ల దిగబోయే అద్దె ఇల్లు చూసిరావడం ఒక్కటే! క్రితంరోజున సుధాకర్ భార్యను వెంటబెట్టుకుని వెళ్లి ఆ ముచ్చటకూడా చెల్లించాడు.

"ఇదేమిటండీ ఈ కొంప విసిరేసినట్టు మరీ ఇంత పెడగావుందీ.. ?" అంది మాలతి.

"సాధ్యమయినంత వరకు కాలేజికి సమీపాన ఇల్లు చూడమంటూ రాశానులే. అతికష్టంమీద ఇది సంపాదించ గల్గాడట. ఇంకా నయం_ మన అదృష్టం ఇక్కణ్ణించి గట్టిగా నడిస్తే ఇరవై నిముషాల్లో కాలేజి గేటు ముందర వెళ్లిపడతాను "

"మరి మొన్న మనం చూసిన్నాడు మీ కాలేజి వేరేదిక్కున కనిపించింది. "

"ఆ రోజు మనం వెళ్లిన రూటు వేరు_"

"ఏమో బాబూ నాకైతే నచ్చలేదు "

"ఏమి నచ్చాలి ? రోజూ ఇటూ అటూ తిరగవలసినవాణ్ణి నేను_ సిటీబస్సు ఖర్చుకూడా లేకుండా; టైము కలిసొస్తుంది డబ్బూ మిగుల్తుంది."

"నాకేమో ఇక్కడ నిలబడి చూస్తుంటే ఇది సిటీలాగే లేదు. ఏదో పల్లెటూళ్లో వున్నట్టనిపిస్తోంది_"

"ఇప్పుడలాగే వుంటుంది. కొన్నాళ్లు పోతే ఆ కనిపించే ఖాళీ ప్రదేశమంతటా ఇల్లు లేచిపోతాయి చూడు "

"ఇళ్లు లేవడాని కేముందిలెండి. ఇలాంటి సిటీస్‌లో ఊరు చివరే కంపెనీలు కడుతుంటారు; కాలినీలు కడుతుంటారు. మనుషులు లేకపోయినా పెద్దపెద్ద ఆఫీసర్లూ, ఆసాములూ పట్టణపు రణగొణధ్వనులు తప్పించుకునేందుకు అంటూ బంగాళాలే కట్టించుకుంటారు_"




"అలాగేగా వాళ్లు విస్తరించేదీ...?!"

"మరిహా నేం.. .?"

"మీరా పొద్దున తినేసిపోతే మళ్లీ సాయంత్రమే తిరిగి వచ్చేది. ఒక్కొక్కప్పుడు మధ్యాహ్నాలు ఇంటికివచ్చినా వచ్చినంత సేపు వుండరు. మనకి ఏవయినా జవానులా ... బంట్రోతులా . ? ఇల్లు కనిపెట్టుకుని వుండేందుకు. ...ఈలోగా ఏదయినా అత్యవసరపు పని తగిలినా, ఆపద వచ్చినా ఆదుకునే దిక్కుండదేమోనని...."

"ఇదిగో ఒహమాట వింటావ్....! ఈ పట్టణాల్లో నిజంగా ఏదేనా ఆపదంటూ వస్తే ఎవరేనా వచ్చి ఆదుకుంటారని మాత్రం భ్రమపడబోకు. ఎవరికి వారే ఇక్కడ. మనం ఒకళ్లకి సాయం చెయ్యక్కరలేదు; మనకి ఒకరు రారు. కాబట్టి ఎక్కడున్నా ఒకటే "

"అలాగయితే మన శ్రేయస్సుకోరే మామయ్య ఒకడున్నాడు కదా! అతనికి సమీపంగా వుందాము. నాకు ఎటూ బంధువు. మీకేమో స్నేహితుడు. దగ్గర్లో ఉండేట్టయితే రానూ పోనూ కాలయాపన వుండదు. అవసరమైతే అతని మనుషులే వచ్చి వాలతారు--"

—సుధాకర్ మనస్తత్వానికి ఆ పాయింట్ సరిపడినట్టు లేదు. అతడు వెంటనే మాట్లాడలేకపోయాడు.

చివరికి.... "చూడు మాలా....! నేను మధ్యతరగతి వాణ్ణి. నీకు ఆ విధంగా బందోబస్తులు చేసేంతటి సమర్థత నాకు లేదు. నచ్చినా నచ్చకపోయినా మనం ఇక్కడ దిగడం తథ్యం...." అనేసి ఇహ ఆ సంభాషణకు అంతటితో ఫుల్ స్టాప్ పెట్టేస్తూ ఖాళీ రిక్షాను కేకవేసి పిలిచాడు.

వాళ్లు కూచున్నది రిక్షా! అది వేగంగా పరుగు తీస్తోంది. అందుకే ఆ క్షణాన ఆమె నోరు మెదపలేదు.

_మాలతి మంచంమీద అసహనంగా అటూ ఇటూ పొర్లింది. ఆమె పెళ్ళయిన తొలిరోజుల్లో ఇలాగే వాదోపవాదనలు వస్తే.... ఒక మొగ్గు మాలతినే ఎక్కువగా మొగ్గనిచ్చి చిట్టచివరికి ఒక్క మాటతో బిల్లబీటుగా పడదోసేవాడు.

అప్పటి వరకూ ఆమె మాటాడిన దంతా పల్లదనం మాదిరే కన్పించేది. సుధాకర్ మాటతీరు, మనిషి తీరు ఒక ప్రత్యేక లక్షణంతో.... ఆకర్షణీయంగా వుంటుంది.

అతడు విన్నవించుతున్నానని చెబుతూనే ఆజ్ఞాపిస్తాడు.

ఆక్షేపించడం లేదంటూనే అధిక్షేపిస్తాడు. ఆలోచిస్తానని చెప్పి అంచనాలు వేస్తాడు. అతని తెలివి అఖండమైనది. మనసు గట్టిది. హృదయం మంచిది.

మాలతికి అంతలోనే ఒగని ఎడల ఉదాసీనభావం ఏర్పడింది; అవును. అతడు ఒకరికి లొంగిపోయే రకం కాదు. తన అభిప్రాయాలు స్పష్టంగా తెలియజేస్తూ నిక్కచ్చిగా మాటాడే రకం. తన గృహసామ్రాజ్యానికి యజమాని. ఏ నిర్ణయమైనా అతడే చేసితీరాలి. కాబట్టి ఇహ ఈ విషయం ఇంతటితో వదిలి పెట్టాలని ఆమె సంకల్పించుకుంది.

అయితే ఆమె కిప్పుడు ఆలోచించుకునేందుకూడా 'టాపిక్' కనిపించలేదు_

ఇంతలో తోటలో ఏదో చప్పుడు వినిపించింది. మాలతి మంచం దిగి జాజి పందిరివేపున్న కిటికీ కొద్దిగా తెరిచి చూసింది. రోజూటి మాదిరే ఒక ఖైదీ మొక్కలకు గొప్పులు తవ్వి ఎరువు వేస్తున్నాడు.

మాలతికి తోడుగా ఇప్పుడొక ప్రాణి దొరికింది.

ఆమె అతడి పనితనం చూస్తూ కొంత తడవు సంతోషించింది.

'అతనిని పలుకరించితేనో....' అని ఉబలాటపడింది. పడడమే తరువాయి కార్యరూపంలో పెట్టింది.

గొంతుక సవరించుకుని.... "చూడూ....!" అంది.

అతడు చుట్టూరా చూశాడు.

మాలతి తన అస్తిత్వం తెలిపేలా కదిలాడుతూ కిటికీలో కన్పించింది.

"పిలిచారా ?" అన్నాడు ఆ వ్యక్తి గొంతు పెగిలించుకుని.

"అవును ... నీ పేరు ?" అంది వివరాలు సేకరిస్తూ.

"నా.... పే.... రు... " అతడు ఆగిపోయాడు. చిన్నగా నిట్టూర్చి....

"నా పేరు మరచిపోయి చాలా కాలమయిందమ్మా.... నేను ఈ ప్రాంతంవాణ్ణి కాను . ." అంటూ ముగించి తిరిగి పనిచేసుకోసాగాడు.

'_నా పేరు గురించి, నా గురించి తెలుసుకున్నందువల్ల నీకేం ప్రయోజనం_' అన్నట్టుంది అతడి ధోరణి. అసలు మనిషి సంపర్కం లేకుండా 'జూ' లో జంతువుమాదిరే బలవంతంగా బ్రతికేయడానికి అలవాటుపడినట్టున్నాడు. మాలతి వదిలిపెట్టలేదు.

"నీ గురించి బాబుగారు చెప్పారు_" అంది మళ్లీ.

"అలాగా. . "

"పాపం . నువ్వు చాలా మంచివాడివట.. ."

"అవును_"

మాలతి గతుక్కుమంది. 'ఏం మంచోలెండి. ' అంటూ మరికొంత సమాచారం అందిస్తాడనుకుంది.

అతడు కిక్కురుమనకుండా మట్టితో ఎరువు కలిపి నీళ్లుపెడుతున్నాడు చెట్లకి.

ఇతడిని పొగిడేకన్నా కించపరిస్తే చలనం కనిపిస్తుందేమోన . ని_"నీకు.. ఇంగ్లీషు తెలుసునా .. ?" అంది.

"చదువుకున్నాను" అన్నాడు.

"పిల్లలెందరు . . ?" అంది వెంటనే.

"సంతానం లేదమ్మా"! అన్నాడు వినమ్రంగా

మాలతి ఆ ఖైదీని జాజిపందిర వద్దకు రమ్మని పిలిచింది.

సాయంత్రం వేళల్లో పూలు తెంపుకునేందుగ్గాను పందిరి తనకు అందేలా దింపి కట్టమని పురమాయించింది.

ఆమె అక్కడే అతనికి సమీపంగా కిటికీ లోపలి అంచున కూచున్నది.

"టైమెంతయిందమ్మా. . ?" ఆమె చెవిలో రేడియో పెట్టుకున్నంత స్పష్టంగా . . మంద్రంగా విన్పించిందా స్వరం.

మాలతి లోపలికి వెళ్లి చూసి వచ్చి చెప్పింది.

"నీకు టైమ్ అయిపోతే వెళ్లిపో .. రేపు వచ్చి చేద్దూగాని...." అంది మళ్లీ -

"ఫరవాలేదు లెరడి....!"

"ఇవాళ నువ్వు లేట్‌గా వచ్చినట్టున్నావ్... ?"

"అవును.... ఒంట్లో బాగులేక...."

"ఏఁవిటి . సుస్తీ. ??"

"కొంచెం ఫీవరిష్‌గా వుంది... అంతే.. !"

"కాఫీ పెట్టివ్వనా .. ?"

"నో-థాంక్స్."

అతడు వద్దన్నా వినకుండా కాఫీపెట్టుకు వచ్చేందుగ్గాను లోపలికి నడిచింది-

పది నిముషాల్లో మాలతి కాఫీపెట్టి పట్టుకొచ్చింది.

అతడు అందుకొన్నాడు.

ఒక గుక్క తాగి . "మా అమ్మ చేతి కాఫీ అచ్చంగా ఈ మాదిరే వుండే దమ్మా .. !" అన్నాడు కళ్ళనీళ్ళు తిరుగుతుండగా.

ఈ హఠాత్పరిణామానికి మాలతి బిక్కమొఖం వేసింది-

"క్షమించు ... పాపం; మీ అమ్మను జ్ఞాపకంచేసి నీకు కష్టం కల్గించిన ట్టున్నాను " అంది ఎలాగో.

"లేదమ్మా నాకు మిగిలించల్లా అమె ఒక్కతే . ఆమెను జ్ఞాపకం చేసు కోకుండా మంచినీళ్ళు కూడా ముట్టను .." అన్నాడు.

"మరి నీ .. భార్య ?"

"ఆ మె ను-నా భా .. ర్యను .. నేను.... హత్య చేశాను . !"

మాలతి నిలువునా వొణికిపోయింది.

అతడు మట్టి చేతుల్తో కళ్ళు వొత్తుకుంటూ పందిరి గుంజకు జారగిలబడి ఒకో చుక్క కాఫీ తాగుతున్నాడు.

మాలతి తమాయించుకుని ... "నేను పొరపాటు చేశాను. జ్వరంతో వున్న నిన్ను బాధపెడుతున్నాను. . ఏమీ అనుకోకు .." అంది.

"అమ్మా.... మీరు అడిగినా అడక్కపోయినా ఈ బాధ నాలో లీనమైపోయింది తల్లీ.... ! నా నరనరాల్లో జీర్ణించుకుపోయింది ." అన్నాడు.

"నీ భార్య చేసిన నేరం ఏఁవిటో తెలుసుకోవాలని వుంది. నీ స్వవిషయంలో జోక్యం చేసుకుంటున్నా న్నేను. నీ కిష్టమయితేనే చెప్పు . !"

అతడు మాట్లాడలేదు. పేలవంగా నవ్వి వూరుకున్నాడు.

ఖాళీ కప్పు నేలమీద పెట్టేస్తూ ... "కాఫీ చాలా బాగుందమ్మా .. ఎన్నో

మార్లు నేను ఇంతకన్నా మంచి కాఫీ తాగాను... వరస్ట్ కాఫీ తాగాను. ఇది మాత్రం చాలా వాల్యూబుల్ కాఫీ!

"ఇంతకీ నే నడిగింది నువ్వు చెప్పనే లేదు..."

"అవునమ్మా అ పాపిష్టి గాధను ఇప్పుడు చెప్పి నా నోటిని అపవిత్రం చేసుకోలేను. నాకు కాస్త స్వస్థత చిక్కనివ్వండి. జరిగింది జరిగినట్టు మీకు వెల్లడిచేస్తాను. వీలయితే... రేపే... చెబుతాను... సెలవిప్పించండి—"

అతడు తల ఎత్తి... కిటికీ చువ్వలు పట్టుకు నిలుచున్న మాలతికి చెప్పి భారంగా కదిలిపోయాడు.

మాలతి మళ్ళీ ఆలోచనలో పడింది.

* * *

సరిగ్గా పన్నెండూ ఆ ప్రాంతంలో తిలక్ భోజనానికి వచ్చాడు.

ఇద్దరూ డైనింగ్‌టేబిలు ముందు కూచున్నారు. మాలతి అంతకు ముందే రెండు పళ్లేలూ అవీ సర్ది రెడీగా వుంచింది. స్టీలు గిన్నెల్లోంచి ఒక్కో పదార్థం తీసి వడ్డిస్తూ—

"మామయ్యా నేను ఇక్కడికి అసలు రాకుండా ఉన్నట్టయితే చాలా బాగుండేది. కానీ నాకు తెలియకుండానే రావడం జరిగిపోయింది. నేనుత్తి జాలి గుండెదాన్ని. ఎవరికే అన్యాయం జరిగినా చూస్తూ వూరుకోలేను.." అంటూ జరిగిందంతా చెప్పింది మాలతి.

"అలాగా! అయితే ఇప్పుడేం చెయ్యను నేను...?" అన్నాడు మృదువుగా తిలక్.

"నేను అతని కద వినితీరాలి. విన్న తరువాత తట్టుకోగలనో లేనో నాకు తెలీదు. ఆ తరువాత ఏం జరిగినా దానికి నీదే బాధ్యత—" అంది బెదిరిస్తున్నట్టు.

తిలక్ చిన్నగా నవ్వుకుని— "ఏం ఫర్వాలేదు. నీకేమీ జరుగదు. కానీ వాడి గురించి నువ్వు ఆలోచించకు. అసలు వాణ్ణి ఇక్కడకు రాకుండా చేస్తాను. సమస్య తీరిపోతుంది," అన్నాడు.

మాలతి అతనివేపు చోద్యంగా చూస్తూ... "అతడేం చేశాడు మధ్యని...? నేనే వినదలుచుకున్నానని చెబుతున్నాను కదా...!" అంది.

ఆ ప్రశ్న వింటూనే తిలక్— "కొన్ని విషయాలు మనం తెలుసుకున్నందు వలన ఎంత లాభిస్తుందో తెలుసుకోనందువలన అంతే లాభం వస్తుంది. అయినా నువ్వింత సెన్సిటివ్‌గా వుండకూడదు. నీ కిప్పుడొచ్చిన ఇబ్బంది ఏమీలేదు.




ఎవడి ఖర్మ వాడిదని మనసుని సరిపెట్టుకో! ఈ విధంగా వింటూపోతే మనిషి మనిషికీ ఒక కథ వుంటుంది. ఎవరి కథ విన్నా అందులో విషాదం లేనిది.... మచ్చుకి ఒక్కటైనా కన్పించదు..." అంటూ జవాబిచ్చి-

"రా... రా... భోంచేద్దాం...!" అన్నాడు స్నేహపూరితమైన స్వరంతో.

మాలతి ఆవేశం చప్పగా చల్లారింది.

ఆమె చేతులు అన్నం పళ్లేన్ని ముట్టనేలేదు. బెంబేలుగా అతని వంక చూస్తూ, "మీ మగాళ్లంతా ఇంతే బాబూ...! ఎంత పెద్ద విషయాన్నైనా అతి తేలిగ్గా తీసుకోగల్రు..." అంది.

"మాలా ! మనిషి జీవితమే అతి తేలిక. దాని నడకలో ఎన్నో ఎదురు దెబ్బలు తట్టుకోవాలి. ఏ మనిషి కూడా హద్దులుమీరి విచ్చలవిడిగా సంచరించేందుకు వీల్లేకుండా సంఘం వారి జీవితాలకు కొన్ని కట్టుబాట్లు నిర్ణయించింది.

.ఇక్కడికి రాకుండా వున్నట్టయితే చాలా బాగుండేది ' అన్నావు కదూ? —మనిషియొక్క తప్పు ఒప్పులను చదివేందుకు ఇదే అనువైన ప్రదేశం మాలా !!" అని చెప్పాడు.

తిలక్ మాలతివంక చూశాడు. ఆమె కళ్లు మూసుకుని వుంది.

ఆమెకు తెలిసినంతవరకూ తిలక్ కూడా పూజలూ అవీ చేసినట్టూ... దేవుడికి

దణ్ణం పెట్టుకున్నట్టూ జ్ఞాపకం. ఈ లోగా ఎందుకు ఈ విధంగా మారిపోయాడో ఆమెకు బోధపడలేదు.

'మగవాడూ.... ఆడదీ సరిసమానంగా ఒంగిపోయేది ఒక్క దైవసాన్నిధ్యం లోనే, అని ఆమె మెదడులో బలంగా నాటుకుపోయింది.

ఇతనికి పెళ్ళయితే గాని మారడు_ అనుకుంది.

"మాలా. !?"

ఆమె కళ్ళు తెరిచింది.

"వేళకానివేళ బల్లముందు కూచుని ఈ నిద్రేవిటి ?" అని అడిగాడు తిలక్ నవ్వుతూ.

మాలతి అతని నవ్వుతో జతకలుపలేదు. లేచి గబగబా నడిచివెళ్ళి చెయి కడుక్కొచ్చింది.

"ఓకే.. మాలా ! నీకు కోపం వచ్చినట్టుంది. నేను వెళ్ళిపోతున్నానులే "

"అరే అన్నం తిన్న తరువాత ఐదు నిముషాలయినా కూచోందే కదల గూడదంటావ్ కదా ?"

"ఏదీ నువు కూచోనిస్తేనా . !"

"ఇదుగో.... తిలక్.. ! నీ మూడ్‌లోంచి నువు బయటపడకపోతే ఎదుటివారిని అర్థంచేసుకోలేవు. " అతన్ని ఆపాదమస్తకం కలియజూస్తూ కోపంగా పలికింది.

"ఆల్‌రైట్... నీ మూడ్‌లోకే వస్తున్నాను.... ఏఁవిటి చెప్పు-??"

"నువు ఇప్పటివరకూ పెళ్ళెందుకు చేసుకోలేదు...??"

తిలక్ ఖంగారుపడ్డాడు_ అది కొద్ది సెకన్లు మాత్రమే.

మాలతి.... తిలక్ డైనింగ్‌రూమ్‌లో ఎదురెదురుగా వున్న కుర్చీల్లో కూచ్చుని వున్నారు. తిలక్ తన కాళ్ళు మాలతి కాళ్ళకు తగులకుండా జాగ్రత్తపడ్డాడు.

ఆ సర్దుకోవడంచూసి మాలతికి నవ్వువచ్చింది. అతడు డాక్‌లో ముద్దాయిలా తలవంచుకుని ఒహచేత్తో నుదురు రాసుకోసాగాడు.

చివరికి తెప్పరిల్లి ఒక నిర్ణయానికి వచ్చినవాడికిమల్లే కంఠస్వరం తగ్గించి . "మాలా . ! ఇటువంటి విషయాలు మనిద్దరం ఇలా ఏకాంతంగా కూచుని చర్చించరాదు. ఎందుకంటే ఇది చాలా సున్నితమైన టాపిక్. ఫ్రీగా చొరవగా మాట్లాడేందుకూ ఉన్నదున్నట్టు చెప్పుకునేందుకూ పనికిరానిది_" అన్నాడు.

"అలా ఎందుకనుకోవాలి.. .? నువ్వు నా కన్నా పెద్దవాడివి. నేను చిన్న

దాన్నయినా వివాహితను. స్త్రీకి పెళ్ళయాక భర్త తప్ప మిగిలిన పురుష ప్రపంచమంతా సోదరతుల్యులే_ పరాయి స్త్రీని గౌరవించడమేగాని అవమాన పరిచే సంస్కారం కాదు నీది. ఇహ చెప్పు. ”

“చెప్పినందువలన ప్రయోజనం ... ?”

“ఏమీ లేదు . నీకు నేనూ; నాకు . నువ్వూ తప్ప మన తరఫున వకాల్తా పుచ్చుకుని మంచీ చెడ్డా కనుగొనేవారు లేరు_ అందుకని ”

“అందుకని ??”

“నిన్నొక ఇంటివాణ్ణిగా చూడాలని ఆరాటపడుతున్నాను_”

“ఓ . మాలా ... ?! . ఎన్నాళ్ళకి దయకలిగింది నామీద ”

“నిజం మామయ్యా_ దేనికయినా సమయం కలిసిరావాలి!”

“నిజమే మాలా .. ఆ సమయం కలిసొచ్చింది; పోయింది_ చెప్పాను కదా....! నేను కొంచెం చొరవ తీసుకుంటున్నాను_ నువ్వేమీ అన్యథా భావించకు.”

—మాలతి మాట్లాడలేదు.

“బట్టల దుకాణానికి వెళ్తాము. ఎన్నోరకాల, డిజైన్లు మనకగుపిస్తాయి. తెలివైన వాళ్ళు తమకి ఏది సూట్ అవుతుందో దానికోసమే వెతుకుతారు. ఒక్క క్షణం తమ ఒంటిమీద దానిని ఊహించుకుంటారు. పరిశీలనాత్మకమైన దృష్టితో అన్నివిధాలా తృప్తి అనిపిస్తేనే కొంటారు. అంతేగాని డబ్బుతిన్నదనీ.... డిజైను బావుందనీ నలుగురూ వాడుతున్నారనీ... అనవసరంగా దగాపడరు. అదే తెలివిహీనులైతే మరొకరిని వెంటబెట్టుకుని, వాళ్ళ సలహామీదనో; లేక ఇతరులను అనుకరిస్తూనో . తమకి సూట్ అవకపోయినా కొనేసి కట్టేస్తారు. ఆ గుడ్డ చిరిగిపోవాలేగాని వాళ్ళ వొంటిమీద ఉన్నన్నాళ్లూ దానికి శోభరాదు సరిగదా; బలవంతంగా అతికించనట్టే అనిపిస్తుంది.” అన్నాడు. మాలతి ఆలోచిస్తోంది_

అతని మాటల్లో నిగూఢంగా దాగివున్న సత్యమేదో ఆమెకు అవగతమైది.

“మావయ్యా ... నువు చాలా తెలివైనవాడివి. నీ వాదనలోని చాతుర్యం నాకు తప్ప మరెవరికీ అర్థంకానిది. మంచి మనసుకి మలినం అంటదంటారు. మాలిన్యంలేని మనసుతో నీ గురించి నేను ఆలోచిస్తున్నాను ” అంది.

“ఆలోచించు మాలా.... బాగా ఆలోచించు. అలాగే నేనింకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదో కూడా నువ్వే ఆలోచించు....” అంటూ నిలకడగా మాలతి కళ్ళల్లోకి చూస్తూ మౌనంగా వుండిపోయాడు_

ఆమె అతడి ముఖంలోని భావాలు చదువుతూ స్థాణువులా కూర్చుండి పోయింది. అయితే ఏదయితే అతడి సమక్షంలో తలుచుకోకూడదని భీష్మించుకు కూర్చుందో ఆ సంఘటన ఆమె కళ్లముందు లీలగా గోచరించింది. సిగ్గుతోనూ, అభిమానంతోనూ ఆమె చెక్కిళ్లు అరుణిమ దాల్చగా తల భూమిలోకి కూరుకు పోయింది. —నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ తిలక్ మాట్లాడసాగాడు. అతని కంఠం దివాలాతీసిన వాడికి మల్లే మారిపోయింది.

"మాలా!"

జరిగినదంతా నీతో చెప్పుకుంటే గాని నాకు మనశ్శాంతి లభించదని ఎన్నో మార్లనుకున్నాను. తెలిసో తెలీకో నా బ్రతుకును విషాదం చేసుకున్నాను. ఇహ జీవితంలో స్త్రీ సౌఖ్యాన్ని అనుభవించగలనో లేనో చెప్పలేను— నాకు బాగా ఊహ తెలిశాకే మీ నాన్న నన్ను చేరదీశారు. అతని ఆదరణలో పెరిగి పెద్ద వుతూ . అదే నా ఇల్లనీ....మీ రిద్దరూ నా వాళ్లనీ నమ్ముతూ వచ్చాను. నువ్వో నాకు వరసయిన దానివి. స్నేహితులూ, పరిచయస్థులూ నన్ను రెచ్చగొట్టేవాళ్లు. 'మీ నాన్న ఇందుకే నన్ను చేరదీశాడనీ...తప్పక అల్లుణ్ణి చేసుకుంటాడనీ ఏ స్వార్థంలేకుండా నన్ను చదివించి పోషిస్తున్నాడంటే....ఇదే కారణమనీ....' ఆ హెచ్చరికలకు నేను దాసుణ్ణయాను. మనిద్దరినీ విడివిడిగా వుంచి నే నెన్నడూ ఆలోచించలేదు. మనిద్దరికీ తప్పక పెళ్లవుతుందనీ, నేను తొందర పడాల్సిన పనిలేదనీ... ఒక విశ్వాసం నాలో బలపడింది. చిన్నప్పుడు విసుక్కున్నా. ఎదిగే కొద్దీ నువు నా పట్ల సుభావంగా వుండేదానివి. ఆ సద్భావాన్ని నేను వేరే విధంగా అర్థంచేసుకున్నాను— మీ నాన్న నీ కోసం సంబంధాల వేటలో పడ్డారని తెలిశాక 'నాది' అన్నదేదో నాకొక్కకుండా పోతోందన్న బాధ నాలో పొడసూపింది. నీ గురించిన తహ తహ ఏర్పడింది.

అప్పట్లో నీ పరిస్థితి వేరు. వెన్నెల చల్లదనానికే పరవశించిపోయే లేత యవ్వనపు పాలబాతి బొమ్మవు నీవు. మీ నాన్న దయాధర్మంమీద బ్రతుకు తున్నానన్న నిర్లక్ష్యభావంతో పురుగుని చూసినట్టు అల్పదృష్టితో నన్ను చూసే దానివని నేను గ్రహించలేకపోయాను. నాకంత జ్ఞానం లేదు. ఒక విధమైన చీకటి జీవితం జీవిస్తున్న వాణ్ణి. నన్ను తెలిసిన వాళ్లు నాది స్తబ్ధప్రకృతి అనే వాళ్లు. మీ నాన్న లెఖలో నేనొక సత్తు నాణాన్ని! నాకు ధనం లేకపోయినా.... నా పిడికిళ్లు అభిమాన ధనంతో బిగిసివున్నాయని ఆయన గుర్తించలేకపోయాడు.

పోనివ్ ఆయన నన్ను పెంచాడు. ఆ అనుబంధాన్ని నేను ఎన్నటికీ మరువలేను. నాకొక్కటే బాధ. నేను అతనికి నచ్చలేదు. నా ఉనికో, నా వ్యక్తిత్వమో అతనికి సరిపడలేదు. ఇదంతా ఎందుకు అతడి దృష్టిలో అల్లుడి హోదాకు అనర్హుణ్ణి.

నీ ఉద్దేశం ఏమిటో నాకు తెలీదు.

తెలుసుకుందామని ధైర్యంచేసి అదునుచూసి నీ ఎదుట కొచ్చాను. నీ పెళ్లి ప్రస్తావన తెచ్చినప్పుడు నువు బయటపడిపోయావు -

ఆ రోజు రాత్రి నేను మంచినీళ్లిమ్మని అడిగినప్పుడు నాతో నీవు మాటాడిన విధానం వంట ఇంట్లో గ్లాసు చేతబట్టుకుని నిల్చున్న తీరు నాకొక్క వలసిన ధైర్యాన్ని తెచ్చిపెట్టింది. అప్పుడే నీకు పెళ్లీడు వచ్చినట్టు కన్పించావ్. అంత సడన్‌గా నిన్ను పట్టుకునేలా మారడానికి కారణం అదే !

నన్ను క్షమించు మాలా !!

'మనిద్దరం పరస్పరం ప్రేమలో వున్నామేమోనని'-ఆ క్షణాన భ్రమించాను. ఆ సన్నివేశం తలుచుకుంటే నా మేను ఎక్కిలిగింతలు పెట్టినట్టుండేది. మాటల్లో వివరించలేని అనుభూతి అది. నా జీవితంలో మధురమైన క్షణం ఏదేనా వున్నదనుకుంటే అదే !

* * * * *

ఏడవకు మాలా ! నేను ధర్మం తప్పాను. నువ్వేం ఇప్పుడు భయపడాల్సిన పనిలేదు. అది గతం. ఒక విధంగా నేను ఈ ప్రేమపాశంలో చిక్కుకుని బందీనయాను. నన్ను విడుదల చేస్తూ విముక్తి కలిగించేవారు లేరు. అలాగని విచక్షణా జ్ఞానం లేకుండా ఈ సంకెళ్లు తెంచుకుని ఒకవేళ బయటపడినా అంతకన్నా ద్రోహం మరొకటి లేదు.

—మరణమే దానికి శిక్ష. అందునా సుధాకర్‌వంటి సహృదయుడికి ద్రోహం చేసేటంతటి నీచుణ్ణి కాను.

నేను ఎక్కడ మనుషుల్లోపడి స్వేచ్ఛావిహంగంలా సంచరిస్తానోనని భగవంతుడు కూడా నన్ని జైలు గోడల మధ్యకే విసిరిపారేశాడు. ఇవి దాటి నేను వెలుపలికి రాలేను. ఈ గోడలకీ నాకూ ఏదో అనుబంధం వుంది మాలా !!

కొత్తలో నేగనక "మాలా ! మాలా !" అంటూ గట్టిగా అరిస్తే నాతో పాటే అవీ "మాలా మాలా " అంటూ ప్రతిధ్వనించేవి.

ఆ పైన తప్పు తెలుసుకుని "వద్దు తప్పు !!" అన్నాననుకో— నాతో

సమంగా అవీ 'వద్దు తప్పు' అనేసి గమ్మున వూరుకునేవి.

ఇప్పుడు చెప్పు మాలా మా అనుబంధం గొప్పది కాదంటావా ? ఈ గోడలు నాతో ఏకీభవించడంలేదూ ??"

తిలక్ కంఠంలోంచి ఈ ధోరణిలో మాటలు వినడం అదే మొదటిసారి.

మాలతి మాట్లాడలేదు. రెండు చేతుల్లో ముఖం దాచుకుని కుమిలిపోసాగింది- 'అఖరికి ఇదన్నమాట తేలిన విషయం. ఎంత అమాయకత్వం తనది- తల్లి గాని, వదినలు గాని, అక్క-చెల్లెండ్రుగాని లేకుండా ఒంటరిగా బ్రతకడం మూలంగా మనుషులేంవిటో, వాళ్ల అంతరంగాలేంవిటో అర్థంచేసుకోలేని అశక్తురాలైంది తాను. ఇన్నాళ్లూ తిలక్ గుండెల్లో ఎంత బాధను అణచివేసుకున్నాడు '

ఆమె హృదయం ఒక విధంగా భారమయింది. మరో విధంగా తేలికపడింది. అతడు ఈ వృత్తాంతాన్ని చెప్పడం ఒక రకంగా మంచిదే అనుకుంది.

'చెప్పకపోతేనే బాగుండేదేమో ' అనుకుంది మళ్లీ.

అనుకోకుండా ఈ రోజున సంభాషణ ఇలా నడిచిందేంవిటి అనుకుంది. ఓమాటు దుఃఖం, ఇంకో మాటు భయం, మరోమాటు తిలక్‌పై జాలి ఇలా రక రకాలుగా ఆమె మనసును కలిచివేస్తున్నాయి.

దీని పరిణామం ఎలా వుంటుందో ? ఆపుకోలేనట్టు ఏడుపు వస్తోందామెకు.

"చాలు తిలక్ ఇంకేమీ చెప్పకు " అంటూ గట్టిగా అరవబోయింది. అయితే అది వెక్కిళ్ల రూపంలో బయటికి వచ్చింది.

తిలక్ వైఖరిలోనే ఏదో మార్పు వచ్చినట్టుంది. అతడు ఆమె శిరస్సుపై అతి సున్నితంగా, సానుభూతిగా, చేతిని వేసి నిమురుతూ . "ఛ ఊరుకో అప్పట్లో కనిపించని దేవుణ్ణి కోరికలు కోరుకునేలాంటి మూఢ భక్తుణ్ణి నేను. ఇప్పుడు మనసుని చంపుకుని నిగ్రహంతో నా జీవితాన్ని ఈ కటకటాలకు అంకితం చేసుకున్నాను. నా కిప్పుడు కోరికలు లేవు నశించినయి " అంటూ రహస్యం చెబుతున్నంత నెమ్మదిగా పలికి చప్పున ఆ గదిలోంచి నిష్క్రమించాడు.

మాలతి కదలా మెదలకుండా చూచునేవుంది-

తన కన్నీటితో అతడిని క్షమాభిక్ష కోరుతోందా అన్నట్టు నిశ్శబ్దంగా రోదించసాగింది. అతడు వెళ్లడిచేసిన ప్రతి సన్నివేశం ఆమె ఎదుట ప్రాణంపోసుకుని నిలిచినట్టయింది.



_తిలక్ మధుభాండాన్ని గుండెల్లో దాచుకుని మాటల రూపంలో ఒలికించినట్టే తియ్యగా మాట్లాడి వెళ్లాడు. అతని పలుకులు పన్నీటి జల్లులా ఆమె మనసుని తడిపినయి. వాటికి మత్తు కూడా వుండే వుంటుంది. అందుకే మైకంలాంటిదేదో ఆమెను ఆవహించి నీరసపరిచింది. మంచం వరకూ ఎలా నడిచి వచ్చిందో **ఆమెకే తెలియదు.**

....వస్తూనే దానిపై అడ్డంగా పడిపోయింది.

"మాలా.... ! టైమైంది నాకు.... వెళ్లొస్తాను.... !" అని తిలక్ వాకిట్లో నిలబడి కేకవేసి చెప్పినప్పుడు.... మొఖం చాటుచేసుకుని.... "అలాగే" అని మాత్రం అనగల్గింది.

—ఎంతో సేపటికిగ్గాని ఆ షాక్‌నించి ఆమె తేరుకోలేదు.

ఆమెను మగతలాంటి నిద్ర ముంచివేస్తోంది.

తెరిచి వుంచిన కిటికీల్లోంచి చల్లని గాలి వీస్తూ ఆమెను జోకొడుతోంది.

నిద్ర-

గత అనుభూతిని మరిచిపోయేందుకు అదొక్కటే సాధనమయినట్టు, పగలే రాత్రిగా మారినట్టు ఎంతో అలసటచెందినట్టు- ఆ నిశ్శబ్ద ప్రకృతిలో, ఏకాంతంగా మరో ప్రపంచంలోనికి యథేచ్ఛగా పయనిస్తూ నడుమ నడుమ తిలక్ రూపాన్నీ, మాటల్నీ మననంచేసుకుంటూ కళ్లు మూతలు వేసుకుంది.

ఆ తరువాత యింకేమీ ఆలోచనలు చెయ్యకుండా, మెదలకుండా, నిశ్చలంగా పరుండిపోయింది.

* * * * *

భళ్లున్న తెరుచుకున్న తలుపుల్లోంచి తిలక్ ప్రవేశించాడు.

మాలతి కంగారుగా లేచింది.

ఏదో మరిచిపోయినట్టు ఆదుర్దాగా.... మనసు విప్పి ఇంకేదో చెప్పాలని తపనగా.... తనను వదిలి వెళ్లలేనివాడికి మల్లే కాంక్షతో తన దగ్గరకు వస్తున్నాడు.

గాలి స్థంభించిపోయింది.

గదిలో ఒంటరిగా తామిద్దరే మిగిలిపోయారు. తాను భవబంధాలన్నీ తెంచుకుని నిస్సంకోచంగా అతనికై ఎదురుచూస్తూన్నట్టే కళ్లతో ఆహ్వానిస్తోంది. ఇద్దరూ ఒకరి నొకరు గుర్తించుకున్నారు. మనసుకు తెలీని పరవశం పొందారు. కోరికలకు పదునుపెట్టారు. జగమంతా ప్రేమమయం అని నిరూపిస్తున్నారు.

అది తిలక్ కోరిక- అది మాలతి కోరిక.

ఇద్దరి కోరికలకూ ప్రాణం పోశారు. అపూర్వమైన అనుభవానికి పునాది వేశారు. స్వేచ్ఛగా మైమరచిపోతున్నారు.

ఇంకా.... ఇంకా.... ఆ బంధం విడదీయరానిదై పోతోంది.

తిలక్ ఆరాటపడుతున్నాడు- "మాలా....! నన్ను విడిచిపెట్టవ్ కదూ.... మనిద్దరం జన్మజన్మలకీ ఇలాగే .. నా కోసం నువ్వూ; నీ కోసం నేనూ అన్నట్టు ప్రేమవాహినిలో పరుగులు తీద్దాం ... సరేనా ??- అవునని చెప్పు ... చెప్పు.... చెప్పు. త్వరగా చెప్పేయి-" అంటున్నాడు.

—అరే తాను కంఠం విప్పదేం.... నోరు పెగలదేం ... అసలు చలనం కని

పించదేం. సెకన్లు కదల్లేక కదల్లేక కదులుతున్నాయి. అసలు కదలడం లేదేమో—ఉహూఁ కదలడం లేదు....

ఓ కాలమా....! కదలకు. నువ్విలాగే నిలిచిపో....! ఓ గాలీ.... వీచకు— ఆగిపో— ఓ సూర్యుడా! ప్రకాశించకు.... మాడిపో!!

ఓ భూమీ....! మమ్మల్ని నీలో ఇముడ్చుకో.... మా గురించిన చరిత్ర లోకానికి తెలీకుండా నీలో ఐక్యంచేసుకో—

ముక్కోటి దేవతల్లారా.... మా జోలికి రాకండి. మమ్మల్ని డిస్టర్బ్ చేయకండి....— ఏమి హాయి....ఏమి తీపి....ఏమి సుఖం —

—"ఎవరా రాక్షసుడు ? తన పేరు ఉచ్చరిస్తూ సమీపిస్తున్నట్టున్నాడు.... ఎవరు....?? ఎవరీ ఆనందాన్ని భంగపరిచేది....??"

అబ్బ అలసటగా వుంది; లేవాల్నా ? లేచి తీరాలా.... తప్పదా.... ఉహూ తప్పేట్టు లేదే.... ఇదిగో వస్తున్నాను. ఉండవోయి.... వచ్చె వచ్చె.... అసలు ఇంతకీ ఎవరు నువ్.... నన్ను చూడనీ.... అరె....! నువ్వు....నువ్వు....నాకే మొపుతావ్ ???"—....

మాలతి భిచాల్న లేచి చూచుంది.

"మాలా! తలుపులు తెరచి ఇలా నిద్రపోతున్నావా....?"

భర్త— అలసటగా ఆపేక్షగా ఆమె ఎదుట నిలిచి చూస్తున్నట్టు మాలతి గ్రహించింది. గుడ్లప్పగించి చూస్తున్న మాలతిని అతను ప్రశ్నిస్తున్నాడు.

"ఏఁవిటలా చూస్తున్నావ్....?" అని—

మాలతికి కొంతసేపటివరకూ ఇవేం వినిపించడంలేదు. 'అయితే అది 'కల' అన్నా మాట. హమ్మయ్యా....' అనుకుంది—

ఆమె బాహ్యప్రపంచంలోకి పూర్తిగా వచ్చేసింది.

"అలా వున్నావేం.... మాలా....??"

ఏదో చెప్పబోయి తటక్కున నోరు నొక్కేసుకుంది. ఒక భయంకరపు చేదు నిజాన్ని ఉగ్గళించకుంటూనే గుటుక్కున మింగేసింది.

ప్రతీ విషయాన్నీ తిరగవేసి, బోర్లావేసి ఆలోచించే జబ్బు మాలతికుంది. దాని ఫలితమే ఆ కల. అయితే తానా విధంగా ఆలోచించిందా....? ఆలోచిస్తుందా....? ఎన్నటికీ కాదు. తిలక్ గురించి మనసారా జాలిపడింది. అంతే ఆ జాలికి నిర్వచనం ఇదేనా....? ఎంత అసందర్భమైనది ఆ కల—ఆ తలంపు—

ఒక వేళ తిలక్‌కి కూడా ఇటువంటి స్వప్నాలే వస్తే....? ఛీ...ఛీ...పాడు...! సాధ్యమయినంత వరకు అతనికి దూరంగా పారిపోతే మంచిది కాదూ....?

"ఏఁవిటి మాలా :.. ఇదీ ! మాట్లాడవేం ... కళ్లేం అలా వున్నాయి....ముఖం కూడా వాడినట్టుంది.... ఏమయింది నీకు....?"

"_ఏంలేదు తలనొప్పిగావుంది..." అతి సులభంగా అబద్ధం ఆడేసింది.

"సరే.... అయితే ... ఇప్పుడు చెప్పనులే; నీ తలనొప్పి ఇంకాస్త ఎక్కువవుతుంది..." అన్నాడు సుధాకర్ ఆమె చెంతనే కూచుంటూ.

"మీకు తెలీదు. ఇప్పుడు చెప్పకపోతే మరీ అధికమవుతుంది_ ఏఁవిటో చెప్పేయండి త్వరగా .. " అతని చేతులు పుచ్చుకుని బతిమాలింది.

"ఎల్లుండి మనం మనింటికి వెళ్లిపోవాలి. మంచిరోజట_ అన్నీ కనుక్కొని వచ్చాను .. "

"ఎంత చల్లని ఖబురు చెప్పారండీ... ! నా తలనొప్పి కాస్తా ఎగిరిపోయింది."

_మాలతి మొహం విప్పారింది.

"మాలా....!?"

"అవును. ఎల్లుండిదాకా ఎందుకట. ఇప్పుడు రమ్మన్నా రెడీయే నేను_" మధ్యాహ్నంనించీ ఆమె పడిన బాధ మరిచిపోయేందుకు ఇదొక్కటే మార్గంగా ఆమెకన్పించింది.

"అయితే నీ తలనొప్పికి కారణం ఇల్లన్నమాట ? ఏడీ మనవాడు....? రానివ్ చెబుతా .. ?"

మాలతి అతని హాస్యధోరణిని కొట్టిపారేస్తూ.... "ఈ కొద్దిరోజుల్లోనే నేను యవ్వనదశలోంచి వార్ధక్యంలోకి వచ్చేసినంత డల్‌గా అయిపోయాను_" అనుకుంటూ ఈ సందర్భంగా ఆమె తమ ఇంటికి త్వరగా వెళ్లిపోవాలన్న ఆతురతను వ్యక్తపరుస్తూ గబగబా ఏమేమో ఏకరువుపెట్టింది.

సుధాకర్ కూడా ఆ ఆలోచనతోనే వచ్చి వున్నాడు కాబట్టి మాలతి మాటలకు చెవులప్పగించి తమ ప్రయాణ సన్నాహానికి సంబంధించిన ఏర్పాట్లను గురించి ప్లానువేసుకోసాగాడు.

ఇద్దరూ కొన్ని నిముషాలపాటు ఒకర్నొకరు చూసుకుంటూ గడిపేశారు. కొంచెం తగ్గుస్వరాన మాలతి అంది_ "చిన్నప్పుడు మా ఇల్లూ, ఆ తర్వాత మన ఇల్లూ, ఇప్పుడు ఈ ఇల్లూ తప్ప .. నేనెన్నడూ ఇతరుల ఇళ్లకి వెళ్లలేదండీ_ వెళ్లినా....ఇన్నాళ్లుండలేదు. రేపొద్దున మనింటికి వెళ్లాక నెలసరిఖర్చులు, ఉప్పులు, పప్పులు అంటూ ఎన్ని వెదుక్కోవాలి ? మన సంసారం ! మనం.... అనుకోకుండా ఎన్నాళ్లిలా బేఫర్వాగా గడుపుతాం....?

పించదేం. రెకన్లు కదల్లేక కదల్లేక కదులుతున్నాయి. అసలు కదలడం లేదేమో—ఉహూఁ కదలడం లేదు....

ఓ కాలమా....! కదలకు. నువ్విలాగే నిలిచిపో....! ఓ గాలీ.... వీచకు—ఆగిపో— ఓ సూర్యుడా! ప్రకాశించకు.... మాడిపో!!

ఓ భూమి....! మమ్మల్ని నీలో ఇముడ్చుకో.... మా గురించిన చరిత్ర లోకానికి తెలీకుండా నీలో ఐక్యంచేసుకో—

ముక్కోటి దేవతల్లారా.... మా జోలికి రాకండి. మమ్మల్ని డిస్ట్రబ్ చేయకండి....— ఏమి హాయి....ఏమి తీపి....ఏమి సుఖం —

—"ఎవరా రాక్షసుడు? తన పేరు ఉచ్చరిస్తూ సమీపిస్తున్నట్టున్నాడు.... ఎవరు....?? ఎవరీ ఆనందాన్ని భంగపరిచేది....??"

అబ్బ అలసటగా వుంది; లేవాల్నా? లేచి తీరాలా.... తప్పదా.... ఉహూ తప్పేట్టు లేదే.... ఇదిగో వస్తున్నాను. ఉండవోయి.... వచ్చె వచ్చె.... అసలు ఇంతకీ ఎవరు నువ్.... నన్ను చూడనీ.... అరె....! నువ్వు....నువ్వు....నాకే మొగుడావ్???"........

మాలతి ఠివాల్న లేచి కూచుంది.

"మాలా! తలుపులు తెరచి ఇలా నిద్రపోతున్నావా....?"

భర్త— అలసటగా ఆపేక్షగా ఆమె ఎదుట నిలిచి చూస్తున్నట్టు మాలతి గ్రహించింది. గుడ్లప్పగించి చూస్తున్న మాలతిని అతను ప్రశ్నిస్తున్నాడు.

"ఏఁవిటలా చూస్తున్నావ్....?" అని—

మాలతికి కొంతసేపటివరకూ ఇవేం వినిపించడంలేదు. 'అయితే అది 'కల' అన్నా మాట. హమ్మయ్యా....' అనుకుంది—

ఆమె బాహ్యప్రపంచంలోకి పూర్తిగా వచ్చేసింది.

"అలా వున్నావేం.... మాలా....??"

ఏదో చెప్పబోయి తక్కున నోరు నొక్కేసుకుంది. ఒక భయంకరపు చేదు నిజాన్ని ఉగ్గళించుకుంటూనే గుటుక్కున మింగేసింది.

ప్రతీ విషయాన్నీ తిరగవేసి, బోర్లావేసి ఆలోచించే జబ్బు మాలతికుంది. దాని ఫలితమే ఆ కల. అయితే తానా విధంగా ఆలోచించిందా....? ఆలోచిస్తుందా....? ఎన్నటికీ కాదు. తిలక్ గురించి మనసారా జాలిపడింది. అంతే ఆ జాలికి నిర్వచనం ఇదేనా....? ఎంత అసందర్భమైనది ఆ కల—ఆ తలంపు—

ఒక వేళ తిలక్‌కి కూడా ఇటువంటి స్వప్నాలే వస్తే....? ఛీ...ఛీ...పాడు...! సాధ్యమయినంత వరకు అతనికి దూరంగా పారిపోతే మంచిది కాదూ....?

"ఏఁవిటి మాలా... ఇదీ! మాట్లాడవేం కళ్ళేం అలా వున్నాయి ముఖం కూడా వాడినట్టుంది ఏమయింది నీకు...?"

"_ఏంలేదు తలనొప్పిగా వుంది.." అతి సులభంగా అబద్ధం ఆడేసింది.

"సరే అయితే ఇప్పుడు చెప్పనులే; నీ తలనొప్పి ఇంకా స్త ఎక్కువవుతుంది." అన్నాడు సుధాకర్ ఆమె చెంతనే కూచుంటూ.

"మీకు తెలీదు. ఇప్పుడు చెప్పకపోతే మరీ అధికమవుతుంది_ ఏఁవిటో చెప్పేయండి త్వరగా " అతని చేతులు పుచ్చుకుని బతిమాలింది.

"ఎల్లుండి మనం మనింటికి వెళ్ళిపోవాలి. మంచిరోజట_ అన్నీ కనుక్కుని వచ్చాను "

"ఎంత చల్లని ఖబురు చెప్పారండీ ! నా తలనొప్పి కాస్తా ఎగిరిపోయింది."

_మాలతి మొహం విప్పారింది.

"మాలా !?"

"అవును. ఎల్లుండిదాకా ఎందుకుట. ఇప్పుడు రమ్మన్నా రెడీయే నేను_" మధ్యాహ్నంనించీ ఆమె పడిన బాధ మరిచిపోయేందుకు ఇదొక్కటే మార్గంగా ఆమెకనిపించింది.

"అయితే నీ తలనొప్పికి కారణం ఇల్లన్నమాట ? ఏడీ మనవాడు ? రానివ్ చెబుతా ?"

మాలతి అతని హాస్యధోరణిని కొట్టిపారేస్తూ "ఈ కొద్దిరోజుల్లోనే నేను యవ్వనదశలోంచి వార్ధక్యంలోకి వచ్చేసినంత డల్ గా అయిపోయాను_" అనుకుంటూ ఈ సందర్భంగా ఆమె తమ ఇంటికి త్వరగా వెళ్ళిపోవాలన్న ఆతురతను వ్యక్తపరుస్తూ గబగబా ఏమేమో ఏకరువుపెట్టింది.

సుధాకర్ కూడా ఆ ఆలోచనతోనే వచ్చి వున్నాడు కాబట్టి మాలతి మాటలకు చెవులప్పగించి తమ ప్రయాణ సన్నాహానికి సంబంధించిన ఏర్పాట్లను గురించి ప్లానువేసుకోసాగాడు.

ఇద్దరూ కొన్ని నిముషాలపాటు ఒకర్నొకరు చూసుకుంటూ గడిపేశారు. కొంచెం తగ్గుస్వరాన మాలతి అంది_ "చిన్నప్పుడు మా ఇల్లా, ఆ తర్వాత మన ఇల్లూ, ఇప్పుడు ఈ ఇల్లూ తప్ప నేనెన్నడూ ఇతరుల ఇళ్ళకి వెళ్ళలేదండీ_ వెళ్ళినా ఇన్నాళ్ళుండలేదు. రేపొద్దున మనింటికి వెళ్ళాక నెలసరిఖర్చులు, ఉప్పులు, పప్పులు అంటూ ఎన్ని వెదుక్కోవాలి ? మన సంసారం ! మనం అనుకోకుండా ఎన్నాళ్ళిలా బేఫర్వాగా గడుపుతాం ?

వేళకింత తినడం పడుకోవడం తప్ప వేరే పనేం కన్పించడంలా నాకు. పరాయిచోట వుంటూ, కొన్ని నియమాలకు కట్టుబడి వుండడంవల్లనేమో మనిద్దరి మధ్య మామూలు ప్రీడమ్ నశించింది. మానసికంగా ఎంతో దూరమవుతున్నట్టే అన్పిస్తోంది కూడా-

మనిల్లు, మన మంచం, మన కంచాలు, మన వాసనలు నాక్కావాలి- మనింటి గాలి పీల్చుకోవాలి నేను " అంటూ యావగా పూర్తిచేస్తుండగా ఏమీ ఎరుగని సుధాకర్- "అవు మాలా ! ఇహ చాలు; నీతో వచ్చిన తంటాయే ఇది. వట్టి ఎమోషనల్ మనిషివి. ఒక్కరోజు ఓపిక పట్టలేవూ ?" అంటూ ఆమె మాటలను అంగీకరిస్తూనే హాస్యంగా నవ్వేస్తూ లోపలికి వెళ్లాడు.

సుధాకర్ కాళ్లూ, మొహం సబ్బుతో కడిగేసుకుని, తల దువ్వుకుని పౌడర్ కూడా పులుముకుని పదినిముషాలు పోయాక ఇవుతలికి వచ్చాడు.

మాలతి అతనికోసమే కాచుకూర్చుని వుంది.

అతడు రాంగానే ఏదో చెప్పేందుకు నోరు విప్పబోయింది.

అదే సమయాన తిలక్ అడుగులో అడుగు వేసుకుంటూ రోజూకన్నా కొద్దిగా ఆలస్యంగా నిమ్మళంగా హాల్లోకి ప్రవేశించాడు.

మాలతి చెప్పడం ఆపి అటుతిరిగి అతనిని గమనించసాగింది. అతడి బాహ్య రూపంలో ఏ మార్పూ లేదు. ఆ జైలునే లోకంగా చూసుకుంటూ అక్కడి మనుషుల్లోపడి మధ్యాహ్నం జరిగిన విషయాన్ని మరిచిపోయి ఉంటాడనుకుంది. కానీ తిలక్ సుధాకర్‌నే పలుకరించి, అతనితోనే పిచ్చాపాటీ ఖబుర్లుచెప్పి తన నించి బలవంతంగా తప్పించుకు తిరుగుతున్నట్టుగా కన్పించేసరికి మాలతి వ్యూహ తారుమారయింది. కలవరపడింది కూడా. భగవంతుడా ఈ ఆపద కాపాడు తండ్రీ ! అంటూ లోలోన మొక్కుకుంది.

ఎంత గాంభీర్యం ప్రదర్శించబోయినా ఆమె చేతకాలేదు.

'అవును ఇతడు నామూలంగా నాన్నచేత ఎన్నో మాటలుపడ్డాడు. కష్టాలు పడ్డాడు. అయినా నా అభివృద్ధిని కోరుతూనే వున్నాడు. నన్ను సంపూర్తిగా క్షమించి నా వ్యక్తిత్వానికి విలువనిచ్చాడు. నాకోసమే జీవిస్తూ తన జీవితాన్ని త్యాగంచేసుకున్నాడు. ప్రేమలోని పవిత్రతను చాటిచెప్పాడు. ఒక భగ్న ప్రేమికుడు దుఃఖాన్ని సంతోషంగా అనుభవిస్తున్నాడు. ఇన్నాళ్లుగా గ్రహించలేని ఒకానొక నూతనమైన పవిత్రభావం ఇతని ఎడల నాకు అవగతమౌతోంది. మా ఇద్దరినీ కలుపుతూ బలీయమైన బంధం ఏదో ఉచ్చులు పన్నుతున్నట్టుగా వుంది.

అందుకే వీలైనంత త్వరగా ఈ స్థలాన్ని విడిచిపెట్టాలనుకుంటున్నాను–' మాలతి అతికష్టంమీద ఉబికిరాబోతున్న కన్నీటిని ఆపుకుంది.

'ఇది ఎవరికివారే లోలోన మదనపడాల్సిన ఒకానొక అతిమధురమైన బాధ. పరులతో చెప్పుకోరానిది. కనీసం సుధాకర్ ఈ విషయాన్ని పసికట్టేందు కూడా వీల్లేదు–'

స్నేహానికీ, బంధుత్వానికీ, భార్యాభర్తల అనుబంధానికీ విచ్ఛిన్నం కలగా ఉండే ఇటువంటిది ఒక్కటి చాలు. ఒక స్థిరనిర్ణయానికి వచ్చిన మాలతి నిబ్బ రంగా వంటఇంట్లో జొరబడింది.

* * *

ఆ మర్నాడు ఆదివారం.

రేపే తమ ప్రయాణం. సుధాకర్ పనివుందంటూ బయటికి వెళ్ళాడు. తిలక్ మామూలుగా డ్యూటీకి వెళ్ళాడు. సాధారణంగా ఆదివారాలు కూడా తిలక్ ఇంట్లో కనిపించడు.

గొప్పులు తవ్వే ఖైదీకూడా ఎప్పటివలె వచ్చి పనిచేసుకోసాగాడు.

అతడు మాలతిని చూస్తూ "పనయిపోయిందా తల్లీ" అంటూ పలక రించాడు. ఆమె గుండె ఆగినంత పనయింది.

"నీ ఒంట్లో ఇప్పుడెలావుంది ?" మాలతి కంఠం కొద్దిగా వణికింది.

"మీ దయవలన ఇప్పుడు బాగానేవుంది." అన్నాడు ఖైదీ. రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచాక ఎందుకైనా మంచిదని మాలతి తలుపులు గడియవేసి జాజి పందిరివున్న కిటికీవేపు వచ్చి నిన్నటిమాదిరే దాని లోపలిఅంచున కూచుంది.

అతడు మొక్కలకు నీళ్లుపెడుతున్నాడు. ఆమె గోళ్లు గిల్లుకుంటూ కూచు న్నది. సమయం గడిచేకొద్దీ ఆమెకు ఆతురత హెచ్చసాగింది. పైకి ధైర్యంగా వున్నా లోలోపల ఏం వినవలసి వస్తుందోనన్న భయం పీకుతూనేవుంది. అలాగే ఆమె ని గోళ్లు మంటపెట్టేంతవరకూ కొరుకుతూనేవుంది.

పనంతా పూర్తిచేసుకుని ఆ ఖైదీ ఆమె ఎదుటికి వచ్చి నిలిచేసరికి ఆమె గుండె గుభేలుమంది.

"సార్ లేరా అమ్మా ?" అనుమానంగా అడిగాడు అతడు.

"లేరు టౌన్‌లోకి వెళ్లారు–"

అతడు ఎవరిగురించి అడిగినా ఆమె ఆలోచనలో సుధాకర్ మాత్రమే స్పష్టంగా మెదిలాడు.

అతడు మళ్లీ మాట్లాడలేదు. ఏదో సందేహిస్తున్నట్టు బొటనవేలితో నేలపై రాస్తూ వున్నాడు.

మాలతి కల్పించుకుని "చూడూ నీతో ఒక ఆప్తురాలిగా మాత్రమే అడిగాను నిన్న ఊరికే- అసలు మీ భార్యాభర్తల నడుమ చంపుకోవా లన్నంత కసి ఎందుకు ఏర్పడిందోనని " అంది ఉపోద్ఘాతంగా.

అందుకోసమే చూస్తున్నట్టు అతడు "అమ్మా స్నేహితులు మొహ మాట పెడితే ఎప్పుడైనా కాస్తంత 'మందు' పుచ్చుకునేవాణ్ణి. అలాగని మంచి నీళ్లతో బ్రాందీ కలిపి తాగే అలవాటు నాకు లేదు. ధనం ఆర్జించాలని నాకుండేది. అయితే కష్టార్జితం కాని డబ్బుకి కక్కుర్తిపడే వాణ్ణికాను. లాటరీ టిక్కెట్లు, ఇనుప బీరువాలు, ఎయిర్ కండిషన్ల సుఖం నే కోరను. స్త్రీలు అందానికి ప్రతి రూపాలని నా భావన. కాని అడ్డమయిన ఆడవాళ్లనీ తాకితే కుష్టురోగం వస్తుం దని నాకు భయం. వెకిలితనంగా, వెటకారంగా, ఛలోక్తులు విసరడం నా చాతకాదు. స్నేహితులతో పిడివాదాలు వేసుకూర్చోడం నాకు చిరాకు. నాది అదోక పద్ధతి. నా అంత ధైర్యవంతుడు లేడు. నా అంతటి పిరికివాడూ లేడు.

మనుషులంటె సంఘం. సంఘం పేరెత్తితే నాకు 'బి.పి.' వస్తుంది. సంఘానికి నే జడుస్తాను. దాని చెప్పుచేతల్లో నే నడుస్తాను. -సంఘమనే 'సారె' నా వ్యక్తిత్వాన్ని పిసికి, నా అంతరాత్మను రుబ్బి, నన్ను ఖూనీచేసి నా అస్థిపంజ రంతో ఘాతుకాల్ని చేయించింది. -సంఘమనే పునాదిపై 'చచ్చు ఆదర్శం' పేరులో లేచిన కట్టడాన్ని నేను. సంఘం ఒహ పెద్ద సాలెగూడు వంటిది. ఆ గూటికి ఎన్నో గదులు. ఎన్నో చిల్లులు. ఆ చిల్లుల్లోంచి చూస్తుందది. మనిషికీ మనుగడకీ మధ్య దారాలు పేస్తుందది. మనిషి బ్రతుకులో చిల్లులకి ముడివేస్తుందది. మనిషి మొహంలో అన్నీ చిల్లులేగా- చెవుల చిల్లులు, ముక్కు చిల్లులు, నోరు చిల్లి, అసలు మనిషే చిల్లుల మనిషి. ఆ చిల్లుల ఆధారంతోనే ఈ గూడు నిర్మించబడింది. ఆ గూటిలో చిక్కుకుపోయి వలయాలు తిరుగుతూ, ఆ చిల్లుల్లో ఇరుక్కుని వచ్చేపోయే ప్రాణంగా బ్రతకడమే మనిషి విధి. నింగిన విహరించే పక్షుల సముదాయానికీ, అడవిన సంచరించే జంతుజాలానికీ వున్న పాటి స్వేచ్ఛ మనిషికెక్కడిది ?"

మాలతి అతనివంక విచారంగా చూసింది. అతని ఆఖరుమాట ఆమె గుండెల్లో గుచ్చుకుంది.

"నిజమే  నీది అసలైన సంకెళ్ల జీవితం. ఎందుకు ? ఇలా ఎందుకు జరిగింది–" అంది బాధగా.

అతడు ఆమెవంక వేదాంతిలా చూశాడు. ఆ చూపులో ఏదో ఘోష వినిపించింది.

"అమ్మా ఒక్క షరతు. నేనొక మూడ్‌నపడి చెప్పుకుంటూపోతాను. మీరు జస్ట్ ఊహూఁ అంటూ వినపడంవరకే. మధ్యలో నన్నేం ప్రశ్నించకండి. విషయం ఆసాంతం విన్నాక మీకే అర్థమౌతుంది" అన్నాడు వార్నింగ్ ఇస్తున్నట్టు.

"సరే  ఇంతకీ నీ పేరు  "

"ప్రశ్నలు అడగవద్దని చెప్పాను కదమ్మా ?" కొంచెం కఠినంగా వినిపించిందా స్వరం.

మాలతి మరేం మాట్లాడలేకపోయింది. కిటికీ చువ్వల్ని గట్టిగా పట్టేసుకుని 'ఇతడు మూడ్‌లోకి వచ్చేశా'డనుకుంది. ప్రయత్నపూర్వకంగా నవ్వుతూ "ఇహ చెప్పు మరి" అంది.

మంద్రస్వరాన ప్రారంభించాడు ఖైదీ–



మాది ఈ ప్రాంతం కాదని చెప్పాను కదా !

అది ఒక కొండప్రదేశం. ఒకనాడు అక్కడి సాయంత్రపు సూర్యుడు దూరంగా కన్పించే కొండల వెనక్కి అరుణ కిరణాలతో వింతసోయగాన్ని విరజిమ్ముతూ తరలిపోతుండగా  అడివిలా తోచే ఆ ప్రదేశంలో కొండలదాపున పచ్చని మైదానంమీద ప్రకాశమానమైన తెల్లని చీరెలో నిశ్శబ్దాన్ని పెనవేసుకుని ఒక స్త్రీమూర్తి కూచునివుంది.

తన చేతిలోవున్న పరిశుద్ధ గ్రంధాన్ని ఏకదీక్షగా పఠనంచేస్తూ నడుమ నడుమ ఆకాశంవేపు కన్నులు సాచి ముకుళిత హస్తాలతో పెదిమలు విడీవిడకుండా ఏదో జపిస్తోంది. భక్తిపారవశ్యం ఇనుమడించగా ఉన్నట్టుండి ఆమె కంఠాన్ని విప్పి బిగ్గరగా భజనకీర్తనలు పాడుతోంది. పక్కన ప్రవహిస్తున్న సెలయేరు భూమాత ఒడిలోకి చొచ్చుకుపోతూ అందంగా చప్పుడుచేస్తూ తాళంవేస్తోంది.

గుంపులుగా గూళ్లకి చేరే పక్షులు రెక్కలు టపటపలాడిస్తూ లయబద్ధంగా అనుపల్లవి నందుకుంటున్నాయి–

ఆమె శారదమ్మ !

ఇది ఆమె దిన చర్య. రోజూ ఇలాగే భక్తిగీతాలు పాడీ పాడీ పాడుతూనే ఇంటికి చేరుతుంది. ఆమె ఏకాకి!

ఇంట్లో కాలుపెట్టాక చేతిలోని బైబిలు భద్రపరిచి కాళ్లూ చేతులూ శుభ్రం చేసుకున్నాకగాని, ఆమె ప్రాపంచిక చింతనలోకి రాదు.

ఆమె విధవ!

భర్త దారుణంగా హత్య చేయబడ్డాడు. గండ్రగొడ్డలి గురి తప్పించుకోలేక 'హరీ' అన్నాడు. అప్పట్నించీ ఒక తెలిసిన క్రిస్టియను సోదరి ఆమెను ఆ దుఃఖ సముద్రంలోంచి ఇవుతల పడేసి ఆమెలో భక్తిరసాన్ని నింపింది.

ఆ రసాస్వాదనలో శారదమ్మ ఇహలోక సంబంధమైన విషయాలపై విరక్తి చూపెడుతూ 'అంతా భగవదేచ్ఛ'గా తలపోస్తూ అదో తన్మయంలో రోజులు గడుపుతోంది.

శారదమ్మ కొడుకు 'చంచల్'!

తండ్రిని వధించిన ఘనతతో తొమ్మిదేళ్లగా యావజ్జీవ కారాగారశిక్ష అనుభవిస్తూ ఆ మధ్య ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా విడుదలయాడు. విడుదల చేస్తున్నట్టు అధికారులు శారదమ్మకు తెలిపినప్పుడు.... "నేను నమ్మలేక పోతున్నాను; ప్రభువుకి స్తోత్రం...." అని మాత్రం అనుకుంది.

కానీ తీరా కొడుకు ఇంటికి వచ్చాక ఆమెలో ఎంతో మార్పు కన్పించింది.

చంచల్ విద్యావంతుడు. తండ్రి రూపురేఖలు సంతరించుకున్న మంచి అందగాడు. అందుకే అతనికి అన్ని విధాలా అతికిపోయే అమ్మాయిని వెదికింది తల్లి.

ఆ సంవత్సరం చంచల్‌కి పెళ్ళీ ఉద్యోగమూ ఒక్కమారే కుదిరినయ్.

'కానీ ... ఆ ముచ్చట ఎన్నాళ్లు ... ?'

చేస్తున్న ఉద్యోగం, కాపురం వదిలి బలిమిన జైల్లోకి తొయ్యబడ్డాడు. శారదమ్మ దీర్ఘంగా ఆలోచిస్తోంది. లోగడ కొడుకుతో విమర్శకు దిగినప్పుడు ... అతడు ఎన్నో మార్లు "-అమ్మా! నీకు పిచ్చి!" అంటూ చనువుగా తేలిగ్గా కొట్టి పారేసేవాడు.

రకరకాల మనుషుల్లో అనేక రీతులుగా పాతుకుపోయిన పిచ్చిని విపులీకరించేవాడు. ఎదురు వాదనకు దిగబోయిన ఆమెను అడ్డగించి-

"....నీ పిచ్చే నీది.... ! అంతే !!" అనేసి అక్కణ్ణించి తప్పుకునేవాడు.

సరిగ్గా ఆ రోజు భోజనాలయాక అదే జరిగింది. హడావిడిగా చొక్కా తగిలించుకుని జోళ్లు తొడుక్కుంటున్న కొడుకుని....

"అబ్బాయ్.... !" అంటూ నిలేసింది ఆమె.

"నీతో మాట్లాడాలి కూచో....!" అంది.

"అమ్మా అంత తొందరేమొచ్చింది. నిదానంగా మాట్లాడుకుందాము; నాకు అర్జెంటు పనుంది, వెళ్లాలి....-"

"ఒరే....! తీరా బయల్దేరినవాణ్ణి.... 'ఎక్కడికీ....?' అని అడగ్గూడదంటావ్- నీకు అదో పిచ్చి. కానీ అడుగుతున్నాను.... చెప్పు.... ఎక్కడికి నీ ప్రయాణం.... ఏంవిటంత అర్జెంటు....??"

"అమ్మా! నువు కాబట్టి సరిపోయింది. ఈ సమయంలో మరెవడయినా నన్నిలా అడ్డగించినట్టయితే.... వాణ్ణి.... నిలువునా చీరేసి...."

"చాల్లేరా.... చీరేస్తావ్....! నీకు చాతనయింది అదొక్కటేగా.... నీకు అడ్డొచ్చిన వాళ్లందరినీ చీరేసి, మాంసంముద్దనీ....బొమికల్నీ వేరుచేసి; ఆ రక్తపు మడుగులోంచి అడుగులు వేస్తూ కదిలిపోవడమేగా నీకు తెలుసు- పర్యవసానం ఎంత ఘోరంగా వున్నా నీ మూర్ఖత్వమే నీది. ఎవరు నేర్పిన పాఠంరా ఇదీ....? ఇంత జరిగినా ఆ భగవంతుడు నీ కళ్లపొరలు ఎందుకు తొలగించలేదో నాకు అర్థంకావడంలేదు-" ఆమెకు మళ్లీ వెనుకటి దుస్సంఘటన యాదొస్తూ కళ్లముందు మెదిలి నిలువునా దహించుకుపోయింది.

"అసలు వుంటే కదమ్మా నువు చెప్పే భగవంతుడూ...." అన్నాడు.

"ఛీ.... విశ్వాస ఘాతుకుడా....!" శారదమ్మ మండిపడుతూ-

"దేవుడు మనయందు ఉండబట్టే నువ్విలా మళ్లీ మనుషుల్లో పడ్డావు, తెలిసిందా....?" అంది

చంచల్ ఓమారు తల విదిలించి అసహనంగా.... "అమ్మా! నేను ముగించవలసిన కార్యం మరొకటి వుంది. అందుకే నేను.... ఇలా...."

"చంచల్....? నువ్వు.... అచ్యుతాన్ని....??"

"అవును....!"

"ఒరేయి! నీకిది మంచిది కాదు. నా మాట విను. నువు ఎక్కడికీ వెళ్లొద్దు. లోకం గొడ్డుపోలేదు. నాలుగు రోజులు ఓపిక పట్టు- దేవుడు మేలుచేస్తే నీకు నచ్చిన సంబంధం చూసి ఆ మూడు ముళ్లూ వేయిస్తాను. మగవాడివి. దానితో లెక్కేంవిటి నీకు....?" కొడుకును బతిమాలుతూనే అడ్డగించబోయింది శారదమ్మ.

"అమ్మా నేను మంచివాణ్ణే. నా మంచితనం రెట్టింపు అయి ఉన్నతుణ్ణి అయాను. ఉన్నతుడికి అర్థం నిజాయితీపరుడు. నేను తిరిగి వివాహం ఎలా



చేసుకోను. అలాగని ఆమెను ఏలుకోడం మొదలెడితే నిజాయితీపరుణ్ణి ఎలాగ అవుతాను....? మహానటుణ్ణి అవుతానుగాని_ కాబట్టి నాకు నా మంచితనంమీద నమ్మకం పోతోంది. నన్ను నిత్యం కోతపెట్టే అంతరాత్మకు జవాబుదారుణ్ణి నేను...." అంటూ క్షణం ఆగి_

"అమ్మా నా శరీరంతో ఆడుకున్నట్టే మనసుతో కూడా ఆడాలని చూసిన ఆ ఆడదాన్ని నేను ఒక పట్టాన వదల్ను. దాన్ని అడ్డంగా ముక్క ముక్కలుగా నరికి ప్రోవుపెట్టందే నిద్రపోను. మోసాన్ని మోసంతోనే జయిస్తాను. అదే దానికి శిక్ష.... అడ్డులే...." అన్నాడు.

ఆమె భయంతో గడ్డకట్టుకుపోయింది.

-"ప్రభువా ఏది దారి ? వీడు మళ్లీ మరో హత్య చేయనున్నాడా? కళ్ళ ముందు మెరుపులా మెరిసి ఇట్టే మాయమవబోతున్నాడా ? ఈ తడవ ఏ శాసనం కూడా వీణ్ణి వూరికే విడిచిపెట్టదే " గతాన్ని జ్ఞప్తి తెచ్చుకుని భవిష్యత్తుని ఊహించుకుంటూ ఆమె అసహాయంగా కంపించిపోయింది.

'దాన్ని చంపితే వీణ్ణి బతకనిస్తుందా చట్టం ఉరి తీయందే ఊరుకోదే ఉరి-' ఆమె కడుపులో చెయిపెట్టి దేవినట్టయింది.

"బాబూ! పొరబడుతున్నావు. శాంతంగా ఆలోచించు. శిక్షించడానికి ఇది ఎవరు చేసిన నేరంరా ? నీ నిర్ణయం మార్చుకోకపోతే మళ్లీ నువ్వెక్కడుంటావో ఒక్కమారు ఆలోచించుకో "-

"లక్షసార్లు ఆలోచించి చేసిన నిర్ణయం ఇది- నే నెక్కడున్నా పర్వాలేదు." చంచల్ తాపీగా ధైర్యంగా పలికాడు.

ఆమె వడివడిగా లోపలికి వెళ్లి కొయ్యబీరువాలో దాచిన బైబిలు చేతికి తీసుకుని పేజీలు తిరగేస్తూ

"ఇదిగో- ఈ వాక్యాన్ని ఒక్కమారు చూడు " అంటూ అదుర్దాగా చదవబోయింది.

చంచల్ నిర్లక్ష్యంగా చేతిని అడ్డుపెడుతూ- "ఆc అందులో ఏం వుంటుందిలే న్యాయంగా, పవిత్రంగా జీవించమనేగా; నేను కోరేదీ అదే నమ్మా!" అన్నాడు.

కొడుకు ధోరణి మళ్లించేందుకు ఆఖరు అస్త్రంగా ఉపయోగించిన ఆ బైబిలు ఆమె కళ్ల కద్దుకుని- "అహc అలా అనకు; ఇందులో భగవంతుడంటే ఏcవిటో, మానవుడి బలహీనతలు వాటినించి రక్షింపబడే మార్గం, దుష్టులకు అంత్య కాలంలో సంభవించబోయే శిక్షలు, మంచివారికి సంప్రాప్తించబోయే స్వర్గ సౌఖ్యాలూ; వగైరా గురించి వివరంగా తెలుపబడింది. ఒక్కమారు నీ చేతికి దీనిని తీసుకుంటే నువు తప్పక రక్షణ పొందుతావు-" అంది.

"అమ్మా ! నీకు పిచ్చి !!" అంటూ చంచల్ నవ్వి ఆమె మాటలు చులకనగా కొట్టిపారవేస్తూ గుమ్మం దిగాడు.

శారదమ్మ గుండె జారిపోయింది.

'వాడు మళ్ళీ ఏం ఉపద్రవం తెచ్చిపెడతాడో - శారీరకంగా మానసికంగా నాకన్నా బలవంతుడు- వాడిని నేను ఆపగలనా ?' అనుకుంది.

'సున్నితమైన ఈ గుండెమీద ఎన్నెన్ని గాయాలు ఎన్నెన్ని దెబ్బలు. ఇది చావుదెబ్బ- భగవాన్ !'

దిక్కుతోచక మనశ్శాంతి నిమిత్తం ఆమె చేతిలోని బైబిలు తిరగేస్తూ కూచుంది.

-రోమా ఏడవ అధ్యాయంలో "భర్తగల స్త్రీ భర్త బ్రతికియున్నంత వరకే ధర్మశాస్త్రము వలన అతనికి బద్ధురాలు గాని, భర్త చనిపోయిన ఎడల భర్త విషయమైన ధర్మశాస్త్రము నుండి ఆమె విడుదలపొందును. కాబట్టి భర్త బ్రతికియుండగా ఆమె వేరొక పురుషుని చేరిన ఎడల వ్యభిచారిణి యనబడును-" అనే వాక్యం ఆమె కంటబడగానే ఆమె భయపడుతూ నల్లని అట్టలతోవున్న ఆ గ్రంథాన్ని రక్కున మూసివేసింది.

"అచ్యుతం ఏం చేసింది ?"

భర్త బ్రతికుండగానే మరొకణ్ణి చేసుకుంది.

"ఆమె వ్యభిచారిణిగా ముద్రించబడుతుందా ??"

" మరి ??"

చట్టం నేరస్తుడిగా పరిగణించి ఆజన్మఖైదు నిర్ణయించాక ఎవరూ వాడు తిరిగి వస్తాడనుకోలేదు. కొడుకు రౌద్రంతో కూడిన దుడుకు స్వభావం ఆమె ఎరగంది కాదు—— పైగా ధృఢకాయుడు; ధృఢచిత్తుడు.

—'వాడిని విడుదలచేసి ప్రభుత్వమే నేరం చేసిందా ' అనుకుంది ఒక క్షణం.

ప్రాణప్రదంగా పెంచిన కొడుకుని గురించి ఈ విధంగా ఊహించవలసి వచ్చినందుకు తన దౌర్భాగ్యాన్ని నిందించుకుంది మరుక్షణం. ఆమెకు గత స్మృతులు నెమరుకు వచ్చినయి——

'మేనత్త కొడుకు శ్రీనివాస్‌కి తన ఎడల అమితమైన ప్రేమ. వయస్సు తేడా అట్టేలేదని పెద్దలు తమ వివాహాన్ని కుదరనివ్వారు కాదు. శ్రీనివాస్ చాలా అల్లరివాడు. అందునా చిన్నతనంలో అంతా 'తామిద్దరే భార్యభర్తలు' అన్నట్టు ప్రవర్తించేవారు. ఆ వార్త ఆ నోటా ఆ నోటా తన భర్తకు తెలిసి "ఇకమీదట వాడితో నువ్వు మాట్లాడితే నేను చచ్చినంత ఒట్టు " అంటూ కట్టడిచేశాడు.

అంతటిలో ఆ అధ్యాయం ముగిసింది.

సంవత్సరాలు దొర్లినయి. తాను శారద బదులు శారదమ్మగా మారింది. కానీ పలు దుర్భాషల నడుమ భర్త వేసిన ఒట్టు మరచిపోలేదు. ఒకరోజు ఏదో పనుండి శ్రీనివాసయ్య (శ్రీనివాస్) ఆ ఊరు వచ్చి తమ ఇంటికూడా చనువుగా వచ్చాడు.

భర్త ఇంట్లో లేని సమయం.

అతని రాకకై ఎదురుచూస్తూ కనిపించీ కనిపించకుండా తాను అతిధి మర్యాదలు మౌనంగా చేస్తోంది—

గడపలో చెంబుతో నీళ్లందించింది. 'కాళ్లు కడుక్కో'.... మన్నట్టు. అతడు కాళ్లూ మొహం కడుక్కొని దండెంమీది తువ్వాలుతో తుడుచుకుని గదిలో కొచ్చాడు. గోడనున్న అద్దంవద్ద నిలిచి క్రాపు నున్నగా దువ్వుకుని పొట్టీ పొడుగూ లేకుండా చేతితో సర్దుకుంటూ.... అతని వెనుకగా అద్దంలోంచి కనిపించిన తనతో—

"శారదా.... ఇంత వయసొచ్చినా ఇంకా సిగ్గేనా....? మీ ఆయన దగ్గరకూడా ఇలాగే చేస్తుంటావా....??" అని అభిమానంగా అడిగాడు.

తన మౌనం—

"వెఱ్ఱిదానా.... నిన్నేం చేస్తానని....? ఈ ఊరు పనితగిలినప్పుడు ఎంత సంబరపడ్డానో తెలుసునా.... నిన్ను చూస్తానని; నీతో మాటాడవచ్చని— నీ కొడుక్కి పెళ్లిచేసుకుంటూ.... అందరికీ ఖబుర్లుచేస్తూ నన్ను మాత్రం మరచిపోవడానికి కారణం....??"

—అతడు స్వయానా తన బావ. అయితేనేం. భర్త దృష్టిలో పరాయి మగాడు.

"అప్పుడూ....అసలే కాస్త పుష్టిగా వుండేదానివనుకో; ఎంత ఒళ్లు చేశావో..? నాకు పెద్దక్కలా....అందుకే మనిద్దరికీ కుదరదన్నారు—ఇంతకీ నీ కొడుకేడీ? వాడూ శాండోగాడేనా....?" అంటూ విరగబడి నవ్వుతుండగా తన భర్త ప్రవేశించాడు.

ఆ రాత్రి.... తనను అనుమానిస్తూ భర్త పేలే బండబూతులు వినలేక ముఖాముఖీ భేటీపడిన చంచల్—

ఆ కోపంలో తండ్రి.... "నువ్వసలు నాకు పుట్టలేదురా....!" అంటూ ఇరుగూ పొరుగూ సమక్షంలో అన్నాడని.... పట్టుదలలు సడలించుకోలేక....మాటామాటా పెంచుకుని.... పౌరుషంతో గొడ్డలి చేతబూని....తండ్రిమీదకే లంఘించాడు.

'అంతే !! అదే జరిగింది....!! కానీ ఫలితం??'

మళ్లీ ఈ రోజున— 'బాబూ....!! చంచల్....??'

పొంగిపొరలే వేడి కన్నీటిని తుడుచుకుంటూ ఆమె అతని గదిలోకి పరుగెత్తింది. మూసివున్న తలుపులు తెరవగానే.... గుప్పుమంటూ అప్పటివరకూ

అక్కడ మసిలిన తన కొడుకు ఉనికిని తెలుపుతూ సిగరెట్ వాసనతో మిళితమైన గాలి ఆమె నాసికాపుటాల్ని తాకింది.

అతడు అస్థిమితంగా రాత్రినించీ పడిదొర్లిన విహ్నంగా మంచంమీది దుప్పటి ఒక పక్కకు చుట్టుకుపోయింది.

బాధాపూరితమైన మనసుతో ఒక చెంప దుఃఖిస్తూనే గదంతా యథాప్రకారం సర్దుతోంది.

ఆమె వద్దనుకుంటూనే అలమరవద్దకు నడిచింది. అక్కడ దినపత్రిక కింద భద్రంగా దాచుకున్న అతని డైరీ కన్పించింది. మొదటి అట్ట తెరవంగానే కవరు ఇరుకులో ప్లాస్టిక్ కాగితంలోంచి

'శుభాకాంక్షలతో అచ్యుతవల్లి' అంటూ సంతకం పెట్టివున్న కార్డ్ సైజు ఫొటో ఒకటి కన్పించింది.

'వాడు దాన్ని మరువలేదు— ప్రభూ— , ఏమిటి నీ చిత్తం నాయనా' అనుకుంది.

ఆ ఫొటో కింద బరువుగా ఒక కవరు. స్టాంపులు అంటించి కూడా పోస్టు చేయనిది—

ఇంగితాన్ని కూడా మరిచి ఆతృతగా విప్పి చూడగా అందులో—

"అచ్యుతా !"

నీకో గుడ్ న్యూస్ బహుశా నా వద్దనించి ఇటువంటి ఉత్తరం వస్తుందని నువు ఎన్నడూ ఊహించి వుండవ్ చెప్పనా?

ఊహూఁ ఆ శుభవార్త అప్పుడే కాదు— నిన్ను కాస్త ఊరించిగాని

అసలు అమ్మ ఆ రోజు నిన్ను చూపించి— 'ఈ అమ్మాయి నీకు నచ్చిందిరా అబ్బాయ్ ?' అని అడిగినప్పుడు తొలిసారిగా మనిద్దరి కళ్లూ లంకె వేసుకున్న క్షణం ఆనాటికీ ఈనాటికీ నేను మరువలేను.

నీ రూపం నా మనోఫలకంమీద అచ్చులా పడింది. అది మొదలు నిన్ను తలుస్తూ బహిరంగంగా ప్రేమిస్తూ రోజులు గడుపుకొచ్చాను. మన పెళ్లయి ఇన్ని వసంతాలు గడిచినా మన వైవాహిక జీవితం ఎన్నాళ్లు కొనసాగింది ?

మహా అయితే ఒకటిన్నర సంవత్సరాలు—

అయితేనేం ? జీవిత పర్యంతం మధుర మధురంగా తలుచుకునేందుకు సరిపడా 'అనుభవం' పొందాను. ఆ తరువాత ఈ అవాంతర వచ్చిపడింది.

అయినప్పటికీ నిన్ను తలచని క్షణం లేదంటే నీకు ఆశ్చర్యం కలగడం లేదూ ? ఇహ పోతే అమ్మ—

ఈ పాటికి ఆమె గురించి నాకన్నా నీకే ఎక్కువ తెలిసుండాలి! వట్టి పిచ్చిది.

నాకు శిక్ష విధించాక నిస్సహాయురాల్లా ఆమె ఏడుస్తూ ఏమని అడిగిందో జ్ఞాపకం వుందా ?

'బాబూ— ఈ జన్మ కిహ ఇంతేనా ? కండను కొండ చేశానే ! అయినా నా దృష్టిలో పసివాడివే నువు. కోడిపిల్లను గద్ద తన్నుకుపోయినట్టు ఎగరేసుకు పోతున్నార్రా వీళ్లు నిన్నూ ఇన్నాళ్లుగా కనీ పెంచింది నిన్ను బందిఖానాలో బందీగా వదిలేందుకట్రా !? ఏనాటి పాపంరా ఇదీ ?' అని—

సహజంగా నేను సింహబలుణ్ణి. అయినా ఆ ఇనుప గొలుసులూ, ఉక్కు కడ్డీల ముందు నా బలం ఎందుకూ కొరగాకుండా పోయిందనుకో ! తరచూ అమ్మ ఉత్తరాల్లో—'నా గుండె బండబారింది బాబూ! అందుకే తిండి తినగల్గుతున్నాను, తిరగ్గలుగుతున్నాను. 'వాక్యం'— నాకా శక్తని ప్రసాదించింది. భగవత్ ధ్యానాన్ని మించినది లేదు. నిత్యం వాని సంస్మరణలో నీ కాలం గడిపి ముక్తిని పొందు' మంటూ నాకు హితబోధలు చేసేది.

ఆమెను సంతృప్తి పరిచేందుకు 'అలాగే' అంటూ జవాబిచ్చేవాణ్ణి. ఒక విధంగా అమ్మ ఈ బోధకుల భక్తిలో దిగడం మంచిదే అయింది. ఆమె పిచ్చికి తోడు ఈ పిచ్చి ఆమెను అమాత్రంగా నిలబెట్టింది. తన భర్తను వధించిన చిన్న కొడుకుని ఆజన్మ ఖైదీగా జైల్లో విడిచి ఏ తల్లి ప్రాణాలతో మన గలదు ?

మరో విధంగా ఈ మత ప్రచారకుల్ని నేను అభినందిస్తున్నాను. ఆమెకు సాంత్వన వచనాలు చెబుతూ ముల్లులాంటి ఈ వేదనకూ, దుఃఖానికీ ఆమెను దూరం చెయగలిగేరు.

అవునూ ? అమ్మ ఎన్నడూ నీ సంబంధించిన ఎట్టి వివరమూ నాకు వ్రాయ లేదు. నీ వద్దనించి కూడా చాలా కాలంగా నాకు ఉత్తరమే లేదు.

నువ్వు ఎలా వున్నావ్ ? నా గురించిన చింతతో బెంగటిల్లి కృంగి కృశించి వుంటావ్. నీ బ్రతుకు నవ్వులపాలు చేసి నీకు తీరని అన్యాయం చేశాను.

అచ్యుత్ ? మళ్లీ జీవితంలో ఎన్నడూ అటువంటి పని చేయనని ప్రమాణం చేస్తున్నాను. ముఖ్యంగా నిన్ను విడిచి వెళ్లవలసి వచ్చినాడు నేను పొందిన దుఃఖాన్ని మాటల్లో చెప్పలేను.

అయితే పరువు మర్యాదలకు మించిన ఘనత మరోటి లేదని నా నమ్మకం—

అందునా వంశ ప్రతిష్ఠకు నా వ్యక్తిత్వానికే దెబ్బకొట్టిన నా తండ్రికి




ఎదురుదెబ్బ వేశాను. ఆనాడు_నీతో అబద్ధం చెప్పి ముఖ్య స్నేహితులతో కలిసి 'పార్టీ' కి అటెండయి ఆలస్యంగా ఇల్లు చేరాను.

—ఏక్చువల్లీ ఐ వాజ్ వెరీ డ్రంక్ ఎట్ ద టైమ్ !

ఆ సన్నివేశం తలుచుకుని ఇప్పటికీ గగుర్పాటు చెందుతుంటాను. తండ్రిని పోగొట్టుకోవడం కన్నా వేరే శిక్ష నాకు అనవసరం.

అయినా   అయినా . సరే ! అది గతం— ప్రస్తుతం నేను కొద్దిరోజుల్లో నీ సముఖంలో వుంటాను. ఇహ నువ్వు ? నువ్వు   మధువులా వుండాలి. తాగిన కొలదీ మత్తులో ముంచే మధుపాత్రలా నా చేతిలో సదా నిలిచి పోవాలి. లోక మంతటినీ గెలువ గలిగే ఉత్సాహం, బలం, నాకున్నప్పటికీ నీచేత నే నోడి పోవాలి !

నేను వచ్చేది ఏ విధంగా అనేది సస్పెన్సు దొంగతనంగా తప్పించుకు పారిపోయి మాత్రం కాదు సుమా! మనిద్దరం ఒకరి నొకరం చుట్టేసుకుని ఆ కౌగిట్లో మన బాధల్ని, కష్టాల్ని కర్పూరంలా హరించిపోయేట్టు చేసుకుందాం.

నేను తిరిగి వస్తున్నాననే ఆరాటంతో వ్రాస్తున్న కవనం కాదిది—

ఈ బాతిగోడల నడుమ కటిక నేలపై అదమరచి నిద్రిస్తూ, నేను కన్న కలలకు రూపకల్పన. ఇంతకీ నా.... ఈ.... రాకకు మీ రెవ్వరూ ఊహించి వుండరు కదూ....?

నేను మాత్రం....??

తిరిగి నీ చెంతకు చేరబోతున్న ఆనందం ఇంచుమించు నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది. నా హృదయంలో భద్రంగా దాచుకున్న నీ బొమ్మకు ప్రాణం పోసి తిరిగి నీలో చైతన్యం కల్గించి, అబద్ధంలాంటి మన భవిష్యత్తుని నిజం చేస్తాను.

ఇట్లు

నీ....'చంచల్'

ప్చ్....

ఉత్తరం పూర్తిగా చదివిన శారదమ్మ గాఢంగా నిట్టూర్చింది. 'వాళ్లిద్దరూ ఎంత అన్యోన్యంగా వుండేవారు....! క్షణం విడిచిపెట్టేవాడా దాన్ని ? ఎందుకని ఈ జాబు పంపించలేదో....? ఆమె మనసు పరిపరివిధాల పోయింది. అచ్యుతవల్లి ఫోటో వంక కోపంగా చూచింది.

ఎంత పని చేశావే.... అచుత్యం....?? నేనన్నా నా కొడుకన్నా నీకు గౌరవం వుంది. ప్రేమ వుంది. అయితే ఆ ప్రేమకు చిహ్నంగా నీ జీవితాన్ని అర్పణం చేసుకోడం మాని క్షణికమైన సుఖాలకు లోభించావా....?'

ఆమెకు వెంటనే వాక్యం గుర్తు వచ్చింది—

"....స్త్రీని ముట్టకుండుట పురుషునికి మేలు. అయినను జారత్వములు జరుగుచున్నందున ప్రతివానికి సొంత భార్య యుండవలెను. ప్రతి స్త్రీకి సొంత భర్త యుండవలెను. భర్త భార్యకును అలాగుననే భార్య భర్తకును వారి వారి ధర్మములు నడుపవలెను. భర్తకే గాని భార్యకు తన దేహముపైని అధికారము లేదు. అలాగున భార్యకేగాని భర్తకు తన దేహముపైని అధికారము లేదు—"

"మరి.... ?"—

"మరి ఏ అధికారంతో నువు నీ భర్తకు వ్యతిరేకంగా ఈ పని చేశావ్ ?" ఫోటోలోని అచ్యుతవల్లిని ఆమె సూటిగా ప్రశ్నించింది.

—మర్మ మెరుగని చిరునవ్వుతో రెప్పవేయకుండా చూస్తున్న అచ్యుతం జవాబీయలేదు.

'ద్రోహం ! ద్రోహం !' అనుకుంది శారదమ్మ.

కొన్ని నిముషాలు గడిచాక ఆమె గది తలుపులు జాగ్రత్తగావేసి గడియ బిగించి ఇవతలికి వచ్చింది.

ఇన్ని నీళ్లు తాగి మనశ్శాంతి నిమిత్తం బైబిలు చంకన బెట్టుకుని ప్రశాంత మైన ఊరి చివరి కొండలకేసి వడివడిగా నడక సాగించింది. నిర్మలమైన ఆ వాతావరణం ఆమెను 'రా రమ్మని' ఆహ్వానించింది.

* * * * *

రైల్లో ప్రయాణంచేస్తున్న చంచల్ నిద్రాహారాలు కూడా మరిచి యోచిస్తూ వాచున్నాడు. అతను తీసుకున్న గట్టి నిర్ణయం గతంలో అచ్యుతవల్లితో అతనికి గల అనుబంధాన్నీ, బాంధవ్యాన్నీ విస్మరించేలా చేసింది. ఆమె గురించిన వాస్తవ పరిస్థితి తెలుసుకున్న కొద్దీ ఆమె మీది విముఖత్వం నిముష నిముషానికీ పెరగసాగింది.

ఎర్రజీరలు తేలిన కళ్లతో కసితో కూడిన పిచ్చి ఆవేశాన్ని పిడికిళ్ల మధ్య బిగించి అదునుకోసం వేచిచూస్తున్నాడు. బండి పరుగిడుతోంది.

వెనక్కి పారిపోతున్న చెట్లూ చేమలూ భూతకాలాన్ని చూపిస్తూ, వర్తమానాన్ని వదిలి, భవిష్యత్తులోనికి బాటవేస్తూ త్రికాల సూత్రాన్ని విశదీ కరిస్తున్నాయి. అతని ఆలోచనల సారాంశం ఒక్క ముక్కలో చెప్పాలంటే— 'అచ్యుతాన్ని అంతంచేసి—'

అవును ! అనాదిగా వస్తున్న సంఘ నియమాలకు వ్యతిరేకంగా విన్పించిన ఏ అక్రమాన్నైతే సహించలేక, దానిని సమూలంగా నాశనంచేయ బూనాడో అటువంటిదే తిరిగి తన వంశంలో తన భార్య అయివుండీ ప్రవేశపెట్టింది. కట కటాల మధ్య ఆజన్మాంతం మ్రగ్గడానికి సిద్ధమైన తనతో సమంగా చేతులు కలపవలసిన ఆమె— కర్కశంగా తన చేతిని వెనక్కి లాక్కుంది. ఏ మాత్రపు త్యాగమూ కనబరచలేకపోయింది

'బెబ్బులిని బోనులో బంధించినంత మాత్రాన సాధువుగా మారబోదు—'

ఆమెపై తనకున్న హక్కు, మక్కువలకు నిదర్శనంగా ఇంటింటా, వాడవాడా తమ కథ చెప్పుకు తీరేట్టుగా ఈ 'పని' చేసితీరాలి. తనక్కా వలసిందదే !

చంచల్ పళ్లు పటపట లాడినయి.

చేతిలో తగలడుతున్న సిగరెట్ పూర్తవంగానే దాంతోనే మరోటి వెల్గించాడు

'ఈ దెబ్బతో అటో ఇటో తేలిపోవాలి. తెలిసీ తెలిసీ ఊబిలో దిగాక కూరుకుపోక తప్పదు—' అనుకున్నాడు.

—ఏదో స్టేషన్లో బండి నిలబడింది.

ఊరు పెద్దదే అని చెప్పుకునేందుగ్గాను ప్లాట్‌ఫారమ్ ఈ కొసనించీ ఆ కొస వరకూ ఎదురు బదురుగా ఒకటే జన సందోహం. తాను పట్టీపట్టనట్టు నిశ్చలంగా చూచున్నా తన చుట్టూరా ప్రపంచం వర్ణన ప్తకంలా తనను భ్రమింపజేస్తూ గిరగిరా తిరుగుతున్నట్టే అన్పించింది.

కొంత తడవే ఆ కోలాహం—

అలసట తీర్చుకున్న బండి ఈసురో....మని నడక మొదలెట్టింది. నల్లని దట్టమైన పొగను గాలి మోసుకొస్తోంది బరువుగా. రంగు రంగుల దుస్తులు ధరించిన కొత్త కొత్త మొహాలతో పెట్టె కళకళలాడింది. బండి మళ్ళీ పరుగు లంకించుకుంది.

'—దీనంతటికీ కారణం ఆమె అందం.... ! ఇన్నాళ్లూ ఏ సౌందర్యాన్నయితే తన అదృష్టంగా తలిచాడో, ఆ సుందర రూపాన్ని ఛిన్నాభిన్నం చేసేస్తే వికృతమైన ఆ ముఖాన్ని నలుగురిలో చూపించలేక—

వద్దు వద్దు.... ప్రాణాలతో బ్రతుకనివ్వరాదు !'

చంచల్ తన దృష్టిని చేతి వాచీవేపు మరలించాడు. టైమ్ ఆరున్నర అయింది. ట్రెయిన్‌లోనే పొద్దు కుంకింది. ఆ ట్రెయిన్‌లోనే తెల్లవారింది. కానీ గమ్యం ఇంకా చేరలేదు. ఒక్క క్షణం అతనికి తన తల్లిరూపం జ్ఞాపకం వచ్చింది.

'బహుశా తాను పుట్టింది ఇందుకేనేమో.....! ' అనుకున్నాడు.

కన్నతండ్రినీ, కట్టుకున్న భార్యనూ చూస్తూ చూస్తూ ఏ మనిషీ ఇంత నిర్దాక్షిణ్యంగా చంపి వుండడు. అయితే వాడిని పురికొల్పే పరిస్థితులు అలాంటివి మరి. తనలోని ఓర్పూ క్షమలకూ కూడా ఒక పరిమితి వుంది. తాను రాక్షసుడిలా కిరాతకుడిలా మారడానికి బలీయమైన కారణాలు కన్పిస్తున్నాయి. ఆమెను హత మార్చిన మరుక్షణం తన జన్మ సార్థకమైనట్టే లెఖ్ఖ.

• పులివాతబడిన ప్రాణి ఎక్కడోగాని ప్రాణాలు దక్కించుకోలేదు. ఆ పులే ఆ ప్రాణి కోసం పొంచి చూసిగాని పైనబడదు.

చూశావా మన ఫ్రెండ్స్ అంతా ఎలాంటి బహుమతులు ఇచ్చారో




కాబట్టి తానూ పొంచి చూడాలి; మామూలుగా వున్నట్టే నటించాలి. ఇదెంత వరకు సాధ్యం....?'

"అచ్యుతా....!?"

—హృదయం కాస్త తేలికపడినట్టుగా వుంది. స్టేషను దగ్గిరవుతోందని తెల్పుతూ పళ్ళతోటలూ, కాయగూరల మళ్లూ, ఎలక్ట్రిక్ స్తంభాలూ, చిన్న చిన్న పూరిళ్లూ.... కళ్ళముందర కన్పించి మాయమవుతున్నాయి. మరొక్క కొద్ది నిమిషాలు.... హమ్మ....! దిగవలసిన స్థలానికి చేరిపోయినట్టే.

ఉబికి వచ్చే ఉద్రేకాన్ని బలవంతంగా అణిచిపెట్టి రిక్షా పిలిచాడు. పగ, ద్వేషాన్ని తొక్కిపట్టి అడ్రెసు వివరించాడు. తత్కాలీక ప్రేమ అనురాగాల్ని, పైపూతగా పులుముకుని ప్రయాణం సాగించాడు.

—గతుకుల రోడ్లు, సందులూ గొందులూ అతని సహనాన్ని పరీక్షించినయి. రిక్షా కదిలీ కదిలీ మారుమూలగా వున్న ఓ ఇంటి ముందాగింది.

* * * * *

అచ్యుతవల్లికి తన భర్త జైలునించి తిరిగివచ్చాడనే వార్త తెలిసింది. అతిగా సంతోషించవలసిన ఆ సమయాన ఆమె నీరసంగా మూల్గి కుప్పలా కూలిపోయింది. ఏ జబ్బూ లేకుండానే మంచమెక్కింది.

ఆమె శరీరం ఒకప్పుడు చంచల్‌దే....! ఆ తరువాత....?– 'స్వామి.... 'చంచల్' ఇద్దరూ ఆమెను అమితంగా ప్రేమించి పూజించినవారే .... కానీ; ఈ రోజున.... ?

–చంచల్ వుండగా స్వామి గురించి ఆమె ఎన్నడూ తలంచలేదు. స్వామి సమక్షంలో చంచల్ విధిగా గుర్తొచ్చేవాడు.

ఆమె హృదయపూర్వకంగా, పవిత్రంగా తన శరీరాన్ని స్వామికి అర్పించిం చెప్పుడు.... ? అయినా.... స్వామికి ఆ విషయం తెలిసినా....ఎన్నడూ అతడు బాధపడినట్టుగాని, ఖాతరుచేసినట్టుగాని కన్పించలేదు.

"నువ్వే... నీమీదే నా దృష్టంతా– నీ సమక్షంలో నాకు మరో ప్రాణి గుర్తుకి రాదు....!" అంటూ మనఃపూర్వకంగా ఒప్పుకునేవాడు.

కానీ—ఆమె దెంత దురదృష్టం....!

'చంచల్ చేజేతులా ఆమెను దూరం చేసుకున్నాడు. విధిరక్కసి నిర్దాక్షిణ్యంగా స్వామిని ఆమె నించి దూరంచేసింది. చంచల్ చెరిపివేయలేని కుంకుమ స్వామి తుడిపివేశాడు.

చంచల్ ఎడబాటుతో సంఘం ఆమెను చులకనగా చూస్తే స్వామి గతించాక అదే సంఘం వెలిపెట్టింది.

ఆనాడు చంచల్‌తో చేయి కలిపి నడిస్తే స్వామి ఆత్మ ఏమీ అనుకోకపోగా ....హర్షం వెలిబుచ్చుతుంది.

కానీ స్వామితో తన సంబంధాన్ని ఎత్తిచూపుతూ గద్దించి గర్జించేహక్కు చంచల్ కుంది–'

'ఓ.... చంచల్....!!

ఆమె వ్యాకుల చిత్తయై మంచాన దొర్లుతోంది. విడుదలై వచ్చిన చంచల్ తనను ఒక పట్టాన విడిచిపెట్టడు.

ఏ క్షణాన్నైనా అతడు ప్రత్యక్షం కావచ్చు అనుకుంటూ—

* * *

దగ్గరగా వేసివున్న తలుపుని టకటకమని తడుతూ ఒక ఆకారం గుమ్మంలో నిలిచింది. ఉలిబి పక్కగా వున్న మంచంమీద నిద్రపోతున్నట్టే పడుకుని వున్న అచ్యుతవల్లి చివ్వున తలెత్తింది

తలుపు రెక్కమీద చేతిని వేసి, మెడ కొద్దిగా పైకెత్తి ఆహ్వానం కోసం ఎదురుచూస్తున్న ఆ వ్యక్తిని ఆమె వెంటనే పోల్చింది.

ఇద్దరూ ఒకరి నొకరు వింతగా, అచేతనంగా, దీర్ఘంగా చూసుకున్నారు.

అంతే!

మరుక్షణంలో ఆమె మొహంమీద ప్రేతచ్ఛాయలు కమ్ముకొనయి. కళ్లల్లో ప్రాణభయం తాండవించింది.

నల్లకోటు భుజాలకు మాత్రమే తగిలించుకుని.... ఎఱ్ఱని కళ్లతో చూస్తున్న అతడు .. పై ప్రాణాలు పైనే ఎగిరిపోగా, మిటకరించి చూస్తున్న శవంలాంటి తనను పొడుచుకు తినే రాబందులా కన్పించాడు.

ఆమె శరీరం జలదరించింది. అయినా తమాయించుకుని ధైర్యం తెచ్చిపెట్టుకుంది.

'మొగుడు' అనే పరదా జీవితానికి స్వస్తి చెప్పి కొన్ని సంవత్సరాలుగా మగవాళ్ల నడుమ ఉద్యోగం చేస్తున్నందున ఆమెలో స్త్రీ సహజపు పిరికితనం చాలావరకు తగ్గింది. అందుకే మంచం మీంచి లేస్తూ అంది...."అరె....మీ....రు..?" అని.

ఆ గుర్తింపులో తమ గత చరిత్ర అంతా ఒక్క క్షణం కళ్ల ముందుకి తెచ్చినట్టయింది చంచల్ కి.

"ప్లీజ్...గెట్....ఇన్....ద....రూమ్....!" లోపలికి ఆహ్వానించింది. ఆమె తెగింపు, మొండితనం చూసిన చంచల్ నిర్ఘాంతపోయాడు. వెంటనే సర్దుకుని, లోపలికి వచ్చి.... చుట్టూ కలియజూచి, అలాగే ఆమెవంక కూడా నిశితంగా చూస్తూ....

"గుడ్.... ఫైన్....!!" అన్నాడు.

అతని మాటతీరుకు ఆ వ్యంగ్యానికి ఈ మాటు నిర్ఘాంతపోవడం ఆమె వంతయింది. చంచల్ నెమ్మదిగా నడిచివచ్చి మంచంమీద విశ్రాంతిగా వెనకనున్న గోడకు జేరగిలబడి కూచున్నాడు.

'ఇతడు మారిపోయాడు పూర్తిగా.... రూపమే కాదు; గుణం కూడా....!' అనుకుంది అచ్యుతవల్లి.

తుఫాను ముందు ప్రశాంతతలా వుంది వాతావరణం.

కాళ్లలో వొణుకు....ఎగిసిపడే గుండెలతో...."కాఫీ....ఏమయినా...." అంది ఆమె.

"నో మాటర్.... ఇట్స్ నాట్ ఇంపార్టెంట్....!" ఒక చేతిమీదుగా ఆనుకుని కూచుని సిగరెట్ వెల్గించి పొగవదుల్తూ పలికాడు.

ఆమె మస్తిష్కంలో పలురకాల ఆలోచనలు గిరికీలు కొట్టినయి. సమయం వస్తే ఆమె సరళంగా....ధారాళంగా మాట్లాడగలదు. మరి ఇదేం సమయం....? కదలా మెదలకుండా నిల్చున్న అచ్యుతం ఎటూ తేల్చుకోలేక పోతోంది. చంచల్ 'మౌనం' ఆమెలోని ధైర్యాన్ని పింజాలుపింజాలుగా ఎగుర గొడుతోంది.

గంట క్రితం 'కోమలి' అనే ఆమె సహఉద్యోగి.... ఆమె వద్దకు వచ్చి ధైర్యం నూరిపోస్తూ.... "పిచ్చి మొహమా....! మహిళల అంతర్జాతీయ మహా సభలు ఊరూరా జరిగినయి. అందు పాల్గొన్నవారు గాని, ఆ చర్చా గోష్ఠులు గురించిన వివరాలు కనీసం విన్నవారు గాని మన మహిళలు ఎందరున్నా రంటావ్....? అలావుంది మన ప్రగతి. ప్రస్తుతం మన ఆడవాళ్ళకి ఎక్కడ స్వాతంత్రం లేకపోయినా.... వంటింట్లో, పడగ్గదిలోనైనా ఆమాత్రం స్వేచ్ఛ పొందుతున్నామా....? అందునా ఇది కేవలం నీ పడగ్గది సమస్య. పూర్తిగా నీ వ్యక్తిగతం! వయసు పోరుతున్న నీ కోర్కెను నిర్మొహమాటంగా తీర్చుకునే హక్కు నీకుంది. ఇదే అవస్థలో పురుషుడే గనుక అవుతే ఢంకా బజాయిస్తూ వెంటనే జంటను ఏరి తెచ్చుకునేవాడు కాదా....? ఇది మహిళా యుగం—స్త్రీ పురుషులు సమానం అంటూ తీవ్రంగా ఘోషించే ఈ తరుణంలో ఆ మాత్రం ముందడుగు వేసి నీ మొదటి మొగుణ్ణి సమాధానపరచలేవా....?

ఫర్వాలేదు....!

ఇదీ ఒక రకం మహిళాభ్యుదయమే....! మరో విధంగా స్త్రీ విమోచనమే...!! ఈ సమస్యలో సర్వవిధాలా నువ్వు అర్హురాలివి. చెయ్యని నేరానికి వెయ్యని శిక్ష అనుభవిస్తూ ముసుగు కప్పుకుని ఎందుకిలా బాధపడ్తావ్....? నువ్వు సుఖసౌఖ్యా లన్నీ బడాయించుకూర్చున్నంత మాత్రాన నీకో ఉన్నత స్థానాన్ని ప్రత్యేకించి చేదా ఈ సంఘం....?

....లే....! శక్తి మేరకు అతనితో పరిస్థితి వివరించి నీ స్థానాన్ని పటిష్ఠం చేసుకో....!" మంటూ చిన్నసైజు ఉపన్యాసం దంచింది.

—నిజమేనేమో... ! నేను చేసిన పని తప్పుకాదేమో.... చంచల్ నన్ను క్షమిస్తే....!?

"అండర్ వ్హాట్ సర్కమ్‌స్టెన్సెస్ యు ఆర్ వర్కింగ్....?" సడన్‌గా ప్రశ్నించాడు చంచల్.

"—ఇట్స్ ద మనీ.... ఐ వాంట్!....ఓన్లీ ద మనీ.... ఐ నీడ్ ఇట్....!?" ఆమె తల యెత్తి అతనివంక చూస్తూ జవాబిచ్చింది.

"అచ్యుత్ ....??"—

"ఇట్స్ ట్రూ... ఐ వోంట్ లైక్ యూ....!"

'పిచ్చి అచ్యుత— ఇంకా నన్ను నమ్మించాలని వృధా ప్రయాసపడుతోంది. నాకే జోస్యం చెబుతోంది.' అనుకున్నాడు చంచల్.

ఆమెను ప్రశ్నిస్తూ అలా మాట్లాడనిస్తూ కొంత తడవు వదిలేస్తే ఆమెలోని కొన్ని రహస్యాలైనా బయటపడగలవు. సిగరెట్ కొనవేలితో విదిలిస్తూ.... ఎటో చూస్తూ.... "యేస్....ఐ.... అండర్‌స్టాండ్....!" అన్నాడు పైకి. ఇద్దరూ కొన్ని ఘడియలపాటు కూడబలుక్కున్నట్టే మౌనం వహించారు.

'మనిషిని అగ్నిపరీక్షకు నిలబెట్టి ఆడించేది యౌవనపు దశ. శరీరాన్ని దహించివేసే ఆ అవస్థలో మొండికెత్తి మొరటుదేలేవారు కొందరైతే....తట్టుకో లేక ఆహుతయేవారు మరి కొందరు. ఎవరో ఒకరు చేశారని మనమెందుకు చేయరాదని అనుకున్నదేగాని, ..

'ఇది తాను చేయడం ఎంతవరకు సబబు అనిగాని, తనకూ తన కుటుంబానికీ ఇది అనుకూలిస్తుందా అని గాని, యోచించలేకపోయింది అచ్యుతవల్లి. తాను తొందరపడిందా....? అబ్బే.... అదేంకాదు.

'మీకు ఏం తెలుసునండీ.... ఏం తెలుసు....? నేనైతే మటుకు సిగ్గువిడిచి ఏమని వివరించను.... ఎలా వివరించను....? అధోగతి పాలయిన నా బ్రతుకును గురించి ఏం చెప్పుకోను....? నేను పతితను కాను. భర్తృవిహీనను కాను. అలాగయినా కొంతలో కొంత సానుభూతి పొందివుండేదాన్నేమో...! నిండు యవ్వనంలో వున్నాను-

నా నిగ్రహాన్ని సవాల్‌చేస్తూ సమాజంచేత విసరబడే ప్రతి రాతినీ తప్పించు కుంటూ రేయింబవళ్లూ అతి మెళుకువగా గడపాల్సి వచ్చేది-

ఇది గ్రహించితే చాలు మీరు....

అమ్మో.... మీరా....? సాహసంతో కూడిన ఎటువంటి పనినైనా అతి సునా యాసంగా చేయగలిగిన మీరు.... ఇంత అల్ప విషయానికి ప్రాధాన్యత నిస్తారా ?

భర్త వంక తదేకంగా చూస్తూ అచ్యుతవల్లి అనుకోసాగింది. ఇంకా—

'తరుణ వయస్సులో సంసార సుఖం సర్వం కోల్పోయిన ఈ మనిషిలో ఎంత మార్పు కన్పిస్తోందో... '

'విధి మనల్ని వేరుచేసినా ఏదో విధంగా తిరిగి కల్సుకున్నాం— ఆ కళ్ల

గుంటలుపడి ఎక్కణ్ణించో తేలి చూస్తున్నట్టు.... అమ్మయ్యో ఎలాగయి పోయారో ఏంవిటండీ ఈ వాలకం....?' అంటూ అడగాలనుకుంది.

కానీ మాట తడబడి పెదాలు వణకడంతో ఆ ప్రయత్నం విరమించుకుంది.

"ఐ డోంట్ ఎగ్జాక్టిలీ అండర్‌స్టాండ్....హూ యీజ్ దట్ జంటిల్‌మాన్ 'స్వామి'... ??" చంచల్ వేసిన ఈ ప్రశ్నతో ఆమెకు ఒక జవాబు స్పష్టంగా విన్పించింది- అది....

'అవును- ఈ మూడు రోజులుగా నిద్రాహారాలు లేక భ్రష్టుపట్టిపోయిన నీ గురించిన చరిత్ర విని.... అంతేగాని; నాకేం- ఎంతో బాగున్నాను-' అని.

ఆమె తల పూర్తిగా వాలిపోయింది.

"ఆన్సర్ మై క్వెశ్చన్ ప్లీజ్ .... !!" అతడు కోపాన్ని దిగమింగుకోడానికి విశ్వప్రయత్నం చేశాడు.

ఆమె గుండె గుభిల్లుమంది. అతని వంక చూడవలసి వస్తుందని సమీపంలో వున్న ఒక పుస్తకం అందుకుని అందులో పేజీలు తిరగేస్తూ.... "అతడు ఒకప్పుడు నా క్లాస్‌మేట్....! ఇప్పుడు నా కొలీగ్.... మా ఊరే! ఆ రోజుల్లో నన్ను ఇష్టపడి స్నేహంచేసుకోవాలని చూసిన అభాగ్యుడు " అంటూ ఆగింది.

"థాంక్స్ ఫర్ ఎన్ హానెస్ట్ ఆన్సర్.... !"

అచ్యుతవల్లికి చాచిపెట్టి మొహంమీద చరిచినట్టయింది. అయినా ఓర్పుతో శుష్కంగా మందహాసం చేసింది.

"ఇస్ దేర్ బి ఎనీ థింగ్ ఎల్స్.... !?"

"నా పట్ల జాలితో హృదయమున్న మనిషిగా రెండు సంవత్సరాల క్రితం గుళ్లో తాళికట్టాడు." అంది ముగింపుగా.

"ఉరిబిగించలేకపోయాడూ.... !?" ఎంతగా నటించాలని చూసినా అతని అక్కసు ఆగలేదు.

అచ్యుతవల్లి కలవరపడుతూ— "ఐ డోన్ట్ నో వ్హాట్ యూ మీన్....అప్పటికే అడపాదడపా నేను వ్రాసే ఉత్తరాలకి మీరు— 'నన్ను మర్చిపో అచ్యుతా.... మర్చిపో...." అంటూ జవాబులిచ్చేవారు. ఇల్లు కదిలినా ఇంట్లో వున్నా రక రకాల విమర్శలు. నేను విధవనై తేకదా! అలంకరించుకోక పోవడానికి. జాబ్ చేస్తున్నాను.... ఏజ్‌లో వున్నానే- ఆ మాత్రం ఛేంజ్ నాలో కన్పించడం సహజం. శుభ్రమైన చీరె కడితే వెయ్యి విసుర్లు. అదో నరకమైంది నాకు ..

ఐ వజ్‌న్ట్ హాపీ ఎబవుట్ ఇట్....! ఇన్ ఫాక్ట్ ఐ ఫెల్ట్ వర్స్-"



"అందుకని ?"

"నన్ను ఆట్టే సాధించకండి. తప్పయిపోయిందని ఒప్పుకుంటున్నాను. చేతులు జోడించి మీ ఎదుట మోకాళ్లాని క్షమాభిక్ష కోరుతున్నాను_"

"అచ్యుతా... ?"

"అవును_ మీ సంగతి నాకు బాగా తెలుసు. ఇవ్వాళ కాకపోయినా మరో రోజయినా ఈ విషయాలు కూపీతీయగల సమర్థులు. మీ వద్ద నిజం దాచీ ప్రయోజనంలేదు. మీరు జైలుకి వెళ్లాక నలుగురూ నన్నెంత లేకిగా చూశారో చెప్పినా అర్థం చేసుకోలేరు. అయినవాళ్ల నిరాదరణవల్ల.... ఈసడింపులు దెప్పిళ్ల మూలంగా, రోషపడిన నేను, ఎన్నో రోజులు పస్తులుండి మలమల మాడిపోయాను_

'ఖూనీకోరు పెళ్లాం' అంటూ ఎవ్వరూ నన్ను దరికి జేరనిచ్చేవారు కాదు. దాదాపుగా సమాజంలోంచీ బహిష్కరించబడ్డాను_"

"అమ్మనెందుకు విడిచిపెట్టావ్ నువ్వు....?"

"ఆమె 'పిచ్చి' తట్టుకోలేక_"

చంచల్ ఉగ్రుడై ఆమె వంక చూశాడు. తీవ్రమైన ఆ చూపుల్లోంచి నిప్పులు రాలినయి.

కొంగుతో కన్నీళ్లు అద్దుకుంటూ తలదించుకు చెప్పుకుపోతున్న ఆమె అది గమనించలేదు_

"ఈలోగా మిమ్మల్ని అక్కణ్ణించి మరో ఊరు మరో జైలుకి పంపిస్తే

న్నట్టుగా తెలిసింది. అయిన దానికి విచారించి లాభంలేదు. ఎటూ మీరు తిరిగి రారు...."

"నీ కెంత ధైర్యం....?" కోపంతో ఉబ్బరించడం వలన నిగ్గుదేలిన ముక్కు-లోంచి గుప్పున పొగ వదిలాడు.

"ఇదిగో ఇది చూశారా....?" అంటూ ఆమె అతడు కూచున్న మంచానికి అతి సమీపంగా వున్న బల్లదగ్గిరగా వచ్చింది- చంచల్ అనుకోకుండా ఎడంగా జరిగాడు. అచ్యుతవల్లి అది గ్రహించి మహా నీరసపడింది. ఆమె బల్ల సొరుగులో దేని గురించో తెగ వెతుకుతూ.... చెప్పుకుపోతోంది.

-"అతడు నన్ను పెళ్లాడేందుకు సిద్ధపడినప్పుడు నేను ఒక పట్టాన సమ్మతించ లేదు. కొంతకాలం గడిచింది. మేము కాస్త సన్నిహితంగా వుంటున్నామని పసిగట్టిన సంఘం వూరుకోలేదు. ఫలితం-! నేను ఏకాకిని.

నన్ను చూస్తే భూతాన్ని చూసినట్టే పారిపోయి దాగుండేవారు....! దీనికి విమోచన కన్పించక కష్టాలు ధైర్యంగా ఎదుర్కొ-ని జీవితాన్ని సార్థకం చేసుకునే నిమిత్తం ఆ పని చేయవలసి వచ్చింది. నా డైరీలు ఇవిగోండి. ఇవి చదివితే మీకు తెలిసిపోతుంది."

"మరి వాడెందుకు చచ్చాడు ....??"

"అతనికి పూర్వంనించీ గుండెజబ్బు ఉందట...."

నీకు తెలేదేం పాపం! అనుకున్నాడు చంచల్. ఆమె వ్యాఖ్యానం వింటున్న కొద్దీ తన అనుమానాలు నివృత్తిఅయేకొద్దీ....అతని గుండె కరగాల్సింది పోయి కరుడుగడుతోంది.

తరతరాలుగా విశృంఖలత్వానికి అలవాటుగా మలచబడిన పురుషుడూ, సహజంగా మగజాతిలోని దౌర్జన్య విధానానికి వారసుడూ అయిన చంచల్....ఆమె దైన్యపరిస్థితిని ఏమాత్రం అర్థంచేసుకోలేకపోయాడు.

ఆమె ధోరణి అతనికి అర్థరహితంగా విన్పించింది కూడా! పైపెచ్చు ఆమె గుండె నిబ్బరానికి జోహారు లర్పిస్తూ....రెట్టించిన కోపంతో "అయినా పుస్తెమీద పుస్తె కట్టించుకునే హక్కు- నీ కెవడిచ్చాడు....?" అని అడిగాడు.

కటువుగా విన్పించిన ఆ స్వరానికి ఆమె వదనం వివర్ణమైంది. ఏమనేందుకూ తోచక నిశ్చేష్టురాలైంది. ఆమె మనోపథంలో ఒకే ఒక జవాబు మెరుపులా మెరిసింది. అది చెప్పాలని ప్రయత్నించీ ఆగిపోయింది.

ఆ సంధిగ్ధాన్ని అతడు కనిపెట్టి కూడా నిర్లిప్తంగా వూరుకున్నాడు. నీరు

నిండిన కళ్ళతో ప్రాధేయపడుతూ "చూడండి. పరిస్థితి అంతా వివరించాను. దీనికి జవాబు నేను కాదు మీరే చెప్పాలి" అంది చివరికి.

"చెబుతాను. మంచి జవాబే చెపుతాను...." అతడు ధృడంగా పలికాడు. అచ్యుతవల్లి గుండెలు గబగబా కొట్టుకున్నాయి. ఏదో అమానుషం జరుగ బోతోందని గ్రహించినదై బ్రతిమాలుతూ...

"ఏఁవిటది...." అని అడిగింది.

"ముందీ సంగతి చెప్పు....! వాడిదగ్గర నువు సుఖపడ్డావా....? నువు కోరిన గౌరవ మర్యాదలు సమాజం నీకు అందించిందా....? నీతి, నియమాన్ని విస్మరించి... ధర్మాన్ని విడిచిపెట్టి మన సంస్కృతిని కాలదన్నిన నిన్ను లోకం అవహేళన చెయ్యకుండా వదిలిందంటావా....?"

ఆ ప్రశ్నాపరంపరకు వరుస క్రమంగా జవాబు లీయగల అచ్యుతం ఏదో యావతో కూడిన కంగారుతో తడబడింది.

చంచల్ నవ్వాడు.

ఆ నవ్వులో వంకర తిరిగే వ్యంగ్యాన్ని గమనించిన ఆమె మనసు చిన్న బుచ్చుకుంటూ "యెస్ ఐ వాజ్ ఐ అడ్మిట్ ఇట్....ఐ అడ్మిట్ ఎవ్విరి థింగ్. అయినా నాకు మాత్రం ఆ సమయంలో ఆదరణతో కూడిన పూర్తి అండ అతని వద్ద లభించింది. తనకు పూర్తి రక్షణ కోరి కెనెడీ మరణించాక జాకీ ఏం చేసింది ?" అంది.

"ఏమన్నావ్....ముండమోసిన ఆడది తిరిగి పెళ్ళిచేసుకోడం అక్కడి సాంప్రదాయం. నీ మొగుణ్ణి ఎవరూ కాల్చి చంపలేదుగా...."

"క్షమించండి. మీరు తిరిగి వస్తారనుకోలేదు."

"నోర్మయ్_" చంచల్ దౌర్జన్యంగా, క్రూరంగా ఆమెవేపు తిరిగి పలికాడు.

చెంపల కిందుగా కారుతున్న చెమటను తుడుచుకునే ప్రయత్నం మానివేసి ఆ గదిని మరోమాటు నిశితంగా పరీక్షించాడు.

గోడలకు వేసిన సున్నం పెచ్చులుగా రాలిపోవడంవలన తెరిచివుంచిన కిటికీల్లోంచి వచ్చే వెలుతురు ఆ గదిని ఏమాత్రం కాంతివంతం చేయలేక పోతోంది. దాని నానుకుని అవుతలివేపు చిన్న వరండా వుంది. గదిలో ఒకే ఒక మంచం. రెండు కుర్చీలు, ఒక టేబులు. దానిపై కాన్వాసు గుడ్డ. నేలభాగం అద్దంలా నున్నగా - ఉన్నంతలో నీట్‌గా సర్దాలని తాపత్రయపడినట్టుంది.

తతిమ్మా కొంపలకు సంబంధంలేకుండా ఎడంగా వున్నందున అరఫర్లాంగు దూరంవరకూ అరిచినా విన్పించదు.

ఒకవేళ గట్టిగా కేకలువేసినప్పటికీ ఆర్తత్రాణపరాయణత నిమిత్తం పరుగు లిడే వారెవ్వరూ అగుపించలేదు.

అతడు ఖాళీఅయిన సిగరెట్ పెట్టెను కసిగా మూలకి విసిరేశాడు. చూస్తుండ గానే అతని ముఖం వికృతంగా మారింది. పగబూనిన నాగులా విషపు చూపుల్తో బుసలు కక్కుతూ కనురెప్పపాటు కాలంలో కసాయివాడిలా మారాడు.

ఉన్నట్టుండి చరనాకోల ఝుళిపించినట్టుగా విన్పించి కంగారుగా తలెత్తిన అచ్యుతవల్లి దండెంమీది టర్కిష్ టవలు గట్టిగా విదిలించి మెలిపెట్టి మీది కొస్తున్న భర్త రౌద్రరూపం కంటబడి కొయ్యబారిపోయింది.

తన బ్రతుకు ఇవాల్టితో సరి అని తెలుసుకుని కంపించింది. బాధాపూరిత స్వరంతో అతన్ని నిరోధించడానికి కృషిచేస్తూ ఆఖరుసారిగా అతడి కాళ్ళను పెనవేసుకుని అడిగింది.

"ఏవండీ....ఏఁవిటిది....? మీరు నన్ను....???"

"నథింగ్....! ఐయామ్ గోయింగ్ టు బి ఎ బిట్ బ్రూటల్.. దట్సాల్!!"

"ఏమండీ....ఒక్కమాట వినండి....ప్లీజ్!!"

"ఏఁవిటి....?" తీక్షణంగా ఆమెవంక చూశాడు.

"మీరు చేస్తున్న ఈ పనివలన తిరిగి మీరు జైలుకి వెళ్ళాలి. ఈ వార్త రేపీపాటికి స్థానిక పత్రికలన్నీ ఉద్ఘోషిస్తాయి. ఈమాటు 'చట్టం' మిమ్మల్ని ప్రాణాలతో విడిచిపెట్టదని నా ఉద్దేశం...."

"అలాగని....ఆ వంకని బెదిరిస్తున్నావా నన్ను....?

"లేదు లేదు. మీ ఔదార్యం నాకు తెలును. మీరు గాఢంగా ప్రేమించిన మీ అచ్యుతం మీ ఏబ్సెన్స్‌లో నిజంగా హద్దుమీరి మీ పట్ల ద్రోహం చేసినట్టయితే..."

"అయితే ... "

"తన ఛావేదో తను చస్తుంది. ఆమెను వదిలివేయండి. అంతేగాని మీరు కలుగజేసుకుని దారుణంగా చంపకండి. అత్తయ్య బాధపడతారు. ఆ తరువాత మీరూ—"

చంచల్ తల అప్పటికే దిమ్మెక్కిపోయింది.

సెంటిమెంటల్‌గా మాట్లాడుతున్న భార్యవంక నిస్తేజంగా చూస్తూ అనుకు న్నాడు. 'అచ్యుత్! నిన్ను కాదు నేను చంపుత; నీలోని తెగింపుని....కూలి పోయిన మన కుటుంబ గౌరవాన్ని తిరిగి నిలబెట్టే ప్రయత్నంలో నువ్వు బలి పశువ్వి కాక తప్పదు. నిన్ను దక్కించుకోవాలనే తాపత్రయంలో ...నిన్ను పోగొట్టుకుంటేనే నీకూ నాకూ సంఘంలో ఒక స్థానం ఏర్పడుతుంది.

నన్నొక అసమర్థుడిగా, బలహీనుడిగా, చవటగా నిలబెట్టే ఈ సమాజపు సానుభూతి నాకు లభ్యమవుతుంది. ఇలా అర్థరహితంగా ముగిసిన మన బ్రతుకులు మరోతరానికి ఉపమానాలు. ఎటూ ఈ సంఘం మనల్ని మామ్మూలుగా బ్రతుక నివ్వదు... ఖాయం' అని.

వెల్లువలా పొంగుతున్న ఆవేశంతో మెలితిరిగిన కండల్తో మెలిపెట్టిన కండువాతో మానవరూపంలో వున్న 'మిత్తి'ని చూస్తూనే అచ్యుతవల్లి పారి పోవాలని చూసింది.

"ఆగు అచ్యుతా, నువు తప్పించుకోలేవు. నీకు కొన్ని నిముషాలు టైమ్ ఇస్తున్నాను. ఆఖరు కోర్కె ఏదేనా వుంటే కోరుకో."

అన్ని బంధాలూ తెగతెంపులు చేసుకుని ప్రాణాలు తీసేందుకు సన్నద్ధుడయిన అతన్ని చూస్తూ ఆమె రెప్పవేయడం మరిచిపోయింది. పిన్నుపడినా వినిపించేంత నిశ్శబ్దమైంది గదిలో.

ఒకటి.... రెండు.... మూడు.....!

కాలయాపన భరించలేని చంచల్ అసహనంగా మరో అడుగు ముందుకివేస్తూ చివరిసారిగా ఆమెతో ఖండితంగా చెప్పివేశాడు.

"అచ్యుత్! మూడు నిముషాల్లో ముగించవలసిన పనికి ముప్పది నిముషాలు వెచ్చించాను....ఇప్పటికే - నీవద్దనించి నే నాశించిన సంజాయిషీ వేరు. నిన్ను క్షమించి విడిచిపెట్టి అపాత్రదానం చెయ్యలేను. అయినా ఇది నాకు పరీక్షా సమయం కాదు. మనల్ని ఎరిగిన లోకం నిన్ను ఏనాడో డిజైన్ చేసింది. ఐయామ్ సారీ ఫర్ ఎవ్విరి థింగ్!" ఆమె అదిరిపడి నిస్సహాయంగా కొంగు చాపి ప్రాణభిక్షకై గిలగిలలాడిపోతూ "ఏ....మం....డీ" అరిటూ దీనాతి దీనంగా అర్థించింది.

మరుక్షణం గాలిలో ఎగిరిన ఆ తువ్వాలు కోమలమైన ఆమె కంఠాన్ని చుట్టు కుంది. అది కసిదీరా క్షణక్షణానికీ బిగిసిపోసాగింది.

పాపం అచ్యుతవల్లి చూస్తుండగానే తన సహజమైన తేజస్సును కోల్పో యింది. జీవంలేని ఆ కళ్ళు రెండింతలుగా ఉబికి, చాచివుంచిన నాల్కతో చంచల్‌ని వెక్కిరిస్తున్నట్టే అన్పించింది.

మరో కావ్యం ముగిసింది అనుకున్నాడు అయోమయంగా అయిపోయిన చంచల్. నిండు ప్రాణాలు నిలువునా తీశాక అతనికి మత్తువదిలినట్టయింది. ముఖాన కారుతున్న చెమట్లు తుడుచుకుని శూన్యమయిన హృదయంతో ఆమె వంక తదేకంగా కొంత తడవు చూశాడు.

వంశ మర్యాదకు పరువు ప్రతిష్ఠలకు గులాముగా బ్రతికిన అచ్యుతవల్లి సామాజికపరమైన ఆ మూఢ వ్యవస్థనుంచి శాశ్వత విముక్తి పొందింది.

ఆమె మరణాన్ని సమీక్షిస్తూ 'నేను నమ్మిన సిద్ధాంతాన్ని అమలుపరిచే ప్రయత్నంలో ప్రాణాల్ని సైతం తీసేందుకు వెనుకాడను. చేసిన నేరాన్ని దాచి న్యాయానికి ఎదురుతిరగను - అది మరో గొప్ప నేరం —' అనుకున్నాడు.

అతనిలోని అలజడి, ఆవేశం చప్పగా చల్లారినయి. భవిష్యత్తేలేని తమ జీవితాలకి బలమైన పునాది వేశానని అపోహపడిన చంచల్ పోలీసుకి శ్రమ తగ్గిస్తూ యాంత్రికంగా ఠాణా వేపు కదిలాడు.

— అదే సూర్యుడు..

అవే కొండలు.

పచ్చని పచ్చికలో తెల్లని చీరెతో ...ఆమె శారదమ్మే-కానీ ఆమె కిప్పుడు నిజమైన పిచ్చి.

సెలయేరు అందంగా చప్పుడు చేస్తూ తాళంవేస్తూనే వుంది; వెర్రి ఆవేశంతో ఆమె పాడే పాటలకి అడవి పక్షులు అనుపల్లవి నందుకుంటూనే వున్నాయి ఆ కీర్తనలకి

'కొండల తట్టు కన్నులెత్తియున్నాను....

నాకు సహాయ మెక్కడినుండి వచ్చును?" అంటూ

ఆమె పాడుతూనే ఏడుస్తుంటుంది. ఏడుస్తూనే పిచ్చిగా నవ్వుతుంటుంది —

* * *

జరిగిన విషయాన్ని కథలా చెప్పుకుపోయిన చంచల్ మాలతితో....

"అమ్మా! కుట్రలూ, కుతంత్రాలూ నే నెరుగను. వివేకమో, అవివేకమో తర్కించుకునే శక్తి నాకు లేదు. మీరు నన్ను అపార్థం చేసుకోకండి!" అంటూ ఆగిపోయాడు. రివ్వుమంటూ ఒక గాలికెరటం వీచింది; మాలతికి పట్టిన చెమటలు చల్లారుస్తూ.

గొడ్డలిపట్టిన చేతితో తవ్వుగోలను పట్టి, భూమిని పెళ్ళగించి విత్తులు నాటి నీరుపెట్టి పెంచి పెద్దచేసిన ఆ తోట ప్రకృతి రమణీయకతను ఎత్తిచూపుతూ ఒకింతసేపు లాస్యం చేసింది,

సుకుమారంగా, సుగంధాలను విరజిమ్ముతూ గులాబీలు మత్తుగా గమ్మత్తుగా తమ అందాలు ప్రదర్శించినయి.

ఇటువంటి కథ వినడం మాలతి కిదే ప్రథమం. చంచల్ పరితప్త

హృదయంలోంచి వెలువడిన అగాధం ఆమెను కలచివేసింది, ముగింపుగా చెప్పుకుపోతున్న అతని ఆఖరు మాటలకు ఆమె చెవులప్పగించింది.

"అమ్మా! ఈ సృష్టి తీరే ఒక విచిత్రం. ప్రాణికి అనుకూలంగా ఉన్నంత వరకే దీని గొప్పతనం. మనిషి ఎందుకు పుట్టాడో నాకు తెలీదు_ ఈ తోటనే తీసుకోండి. దీనిని ఎప్పటికప్పుడు సంరక్షిస్తూ పెంచి పెద్దచేశాను. అవసర మైన మొక్కల్ని మాత్రమే పెంచుతూ అనవసరమైనవాటిని పెరికివేసేందుకే నేనిక్కడ నిర్దేశించబడ్డాను. నోరులేని మొక్కలకున్న ఈ న్యాయం నోరున్న మనిషి కెందుకులేదో నాకు తెలీదు. అనవసరమనుకున్న మనుషుల్ని తొలగించే హక్కు మనిషికి లేదు. ఒకప్పుడు చట్టాని కుంది. నే నిప్పుడు మనుషుల్లో మనిషిని కాను. నా చుట్టూరా ఒక పరిధి వుంది. అది దాట శక్యంకానిది. నేను ఒక సజీవయంత్రాన్ని—"

చెప్పడం ఆపి అంతటితో తన పని తీరిపోయినట్టు, దిమ్మెరపోయి చూస్తున్న మాలతి వద్ద సెలవుతీసుకుని పెద్దపెద్ద అంగలు వేస్తూ చరచర నడిచి వెళ్ళిపోయాడు చంచల్. అతడు పోతూ పోతూ ఆమె గుండెల్లో పెద్ద బరువునే దించిపోయాడు. అతడు చెప్పిన ఒక్కో సంఘటనా ఆమెకు ఊపిరి బిగించేలా చేసింది.

సామాన్యంగా ఆవేశంలో వున్నవాడికి ఆలోచన వుండదంటారు. ఇతడికి ఆవేశమూ ఆలోచనా రెండూ వున్నాయి. అందుకే హత్య మీద హత్య రెండు హత్యలు చేయగల్గాడు.

ఆ తల్లిని కూడా జీవచ్ఛవాన్ని చేసి వదిలాడు. తన నేరాన్ని నా ముందు వెల్లడించా ననుకున్నాడు గాని, ఉత్తరాలు డైరీల ఆధారంగా పెట్టుకుని అతడు నిష్పాక్షికంగా చెప్పినదానిని బట్టి....భార్యనూ, తండ్రినీ, తల్లినీ విపులంగా.... నిశ్చలంగా వారి వారి నిజస్వరూపాలను ఒకమాటు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు— అనుకుంది.

అతని ఎడల ఏర్పడిన భయం స్థానంలో ఆలోచనలు చేలరేగి ఆమెలో తీవ్ర మైన సంఘర్షన ప్రారంభమైంది.

—శారదమ్మ. . శ్రీనివాసయ్య.

అచ్యుతవల్లి స్వామి.

తానూ తిలక్!

ఇంచుమించుగా ఈ మూడు జంటలూ ఒక కోవకు చెందినవే_ ఎంత చిత్ర

మైన పోలిక. ఏదో తెలీని భయం, శంక ఆమె గుండెల నిండుగా పేరు కుంటోంది. తిలక్ ఆమెకు బాగా తెలుసును. అతడు చంచల్ కధలోని 'స్వామి' లాంటి వాడు. కల్లా కపటం ఎరుగని వాడు. స్వామి మాదిరే తనను ఇష్టపడి పెళ్లి చేసుకోవాలని తపనపడిన అభాగ్యుడు.

ఒకే ఇంట్లో తామిద్దరూ పెరిగి పెద్దవుతూ వచ్చారు. కనుక, అతనిలో ఆశలు పెంచేలా.... అతడికి సన్నిహితంగా వుంటూ వచ్చిన మొట్టమొదటి స్త్రీ తానే కనుక తనను బ్రతికుండగా అతడు మరువలేడు.

ఇహ మీదట అభిమానం అన్న పేరుతో పంచికీ చెడుకీ అన్నింటికీ తమని ఆదుకునేందుకు వస్తూంటాడు— తప్పదు।

అవసరం మేరకు చొరవగా, దగ్గరగా అతి సమీపంగా వచ్చేస్తాడు. అతనికి దూరంగా వుండడం తనకు సాధ్యంకాని పని. తనది మమతానుబంధంతో ఏర్పడిన జాలి మనసు. సుధాకర్ ఇంట్లో వున్నా లేకున్నా....సుధాకర్ కి నచ్చినా నచ్చకపోయినా ఇది జరిగి తీరుతుంది.

ఏమీ లేనిచోట అనుమానాలు పుట్టించి పెంచే సంఘం మధ్య, దోషంలేని ఈ రకపు చుట్టరికం, స్నేహం కొనసాగడం కష్టం.

పైగా అతడు అవివాహితుడు.

తమ గురించి ఎంతటి నీచమైన కథలైనా ఈ లోకం ఇట్టే పుట్టించగలదు. సుధాకర్ కి తన ఎడల నమ్మకం, విశ్వాసం వుండొచ్చు గాక ! అది శాశ్వతంగా నిలిచిపోవాలని లేదు. అతడు మరొక చంచల్‌గా మారేందుకు, తమ మధ్య జరిగిన ఆ చిన్న సంఘటన ఆధారంగా తీసుకుని కొండంతగా వూహించుకుని, ఉద్రేకపడి, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి.... పచ్చని కాపురాన్ని విచ్ఛిన్నం చేసుకునేందుకు అవకాశం లేకపోలేదు. లేదా తనమూలంగా అతనికి మనశ్శాంతి లేకుండా పోవచ్చు....

మాలతి మానసిక అవస్థ ఇంతా అంతా అని చెప్పేందుకు వీల్లేకుండా వుంది. ఆమె తీరని వ్యథ చెందింది.

తనూ సుధాకర్ భార్యాభర్తల్లా జీవితమంతా కాపురంచేస్తూ గడపాలంటే తమ బ్రతుకుల్లో ఎటువంటి లొసుగూ వుండరాదు. మగవాడిలో ఏదైనా లొసుగు వుంటే ఆడది క్షమిస్తూ సహిస్తూ పోవాలన్నది సర్వసాధారణంగా సమాజంలో అమలులో వున్న మామూలు లొసుగు.

చంచల్ కేవలం ఈ సమాజానికి దడిచి, ఈ సమాజపు సానుభూతిని కోరే అమృతవల్లిని అంతంచేశాడు.




మాలతికి అన్పించింది.....

'లక్షణంగా కాపురాలు చేసుకునే సంసారాలన్నీ సలక్షణమైనవేనా....? వారి వారి అంతరంగాలు కదిపిచూస్తే ఎన్నెన్ని దోషాలు వెలికివస్తాయో.... 'మనసొక చోటా, మనువొక చోటా' అన్నట్టు కాపురాలు చేసేవారెందరు లేరు. వాళ్లంతా పిల్లాపాపల్తో హాయిగా లేరూ....? తానేం మానసిక వ్యభిచారం చెయ్యడంలేదుగా....? అయినా ఎందుకొచ్చిన జంజాటం.... వొదిలించుకున్నంత సుఖం లేదు...' అని మాలతి గంభీరంగా మారిపోయింది.

నిర్వికారంగా మహాజ్ఞానిలా వుందామె ఇప్పుడు. ఎంతో జీవితానుభవం సంపాదించినట్టూ, తాను మరెంతో ఎదిగిపోయినట్టూ, ఈ విశాల ప్రపంచంలో ఇలాంటి గాధలు ఇంకా ఇంకా తెలుసుకోవాల్సినవి అనేకం మిగిలిపోయినట్టూ, ఎన్ని విన్నా తట్టుకునే నూతన శక్తి ఏదో తనకూ సంప్రాప్తించినట్టూ అనుభూతి పొందింది.

చంచల్ ! ఎంత సహజంగా ఎంత రసవంతంగా చెప్పుకున్నాడు....?

హింసాత్మకమైన అతని చరిత్రలో తర్కమూ, విమర్శా రెండూ వున్నాయి-అనుకుంది.....

'జరిగింది పట్టుకూర్చుంటే ఎలాగు? జరుగవలసినవి ఎన్నో వుండగా....' అనుకుంటూ తత్కాలికంగా తన ఆలోచనలకు స్వస్తి చెప్పి ఆమె డాంబికంగా, పెద్దమనిషి తరహాగా ఇంట్లో పనులకు పూనుకుంది.

తిలక్, సుధాకర్ వచ్చేసరికి కమ్మని ఫలహారం తయారుచేసి వుంచింది. గదుల్లో సామాన్లు ఇటు వటూ అటు విటూ నీట్‌గా సర్ది ఆ ఇంటికి సరికొత్త శోభను సమకూర్చిపెట్టింది. ఈ పనులు చేస్తున్నంతసేపూ ఆ విషయాలు మదిలో మెదుల్తూనే వున్నాయి. వాటిని పక్కకు తోసివేస్తూ- సమాజమూ, మనుషులూ ఎక్కడ వున్నప్పటికీ అక్కడ ఇలాంటివే ఏవో అలజడులు తప్పవు' అనుకోసాగింది.

పరిశుభ్రంగా స్నానంచేసి అందంగా ముస్తాబై ఇద్దరు మగవాళ్లూ ఇల్లు చేరే సరికి ఏదో పత్రిక చేతబూని తిరగేస్తూ కూచుంది. ఆ సాయంత్రం సుధాకర్ కోరికపై ఒక హిందీ సినిమాకు తిలక్‌తోపాటుగా బయల్దేరింది.

అయితే ఆ రాత్రి మాత్రం భయంతో భర్తను గట్టిగా పట్టేసుకుని నిద్రపట్టక నానా అవస్థా పడింది. ఎంత ప్రౌఢంగా ఆలోచించినప్పటికీ చంచల్ చర్యలో నేరం ఎవరిదో ఆమెకు అవగాహన కాలేదు.

* * * * *

తెల్లవారుతూనే సుధాకర్ మాలతిని తీసుకుని అద్దెకొంపకు ప్రయాణమైనాడు. తిలక్ వారివంక వడిలిన మొహంతో పిచ్చివాడిలా చూడసాగాడు. అతడి వాలకం అప్రసన్నంగా వుంది.

'వీళ్లసలు ఇక్కడికి రాకుండా వున్నట్టయితే నాకీ దిగులు తప్పేది కదా !' అనుకోసాగాడు.

సుధాకర్ అతడి భుజంపై తట్టి మృదువుగా— "చూడు బ్రదర్.... ! మేమేం ఊరు విడిచి వెళ్లడం లేదుగా ! వీలు చిక్కినప్పుడు నువ్వైనా రావచ్చు; లేదా మేమైనా రావచ్చు. మాలతిని కనిపెట్టుకుని చూడడం నీ బాధ్యతల్లో ఒకటని మాత్రం మరిచిపోకు...." అంటూ ప్రశాంతంగా నవ్వుతూ పలికాడు.

"క్షమించు సుధా.... ! నేనే ఎందుకో సరిపెట్టుకోలేకపోతున్నాను. ఆల్‌రైట్ నా మీది గౌరవంతో ఈ కొద్ది రోజులూ నావద్ద వున్నారు. అదే పదివేలు- మాలా.... ! ఆరోగ్యం జాగ్రత్త.... !!" అంటూ బరువుగా నిట్టూర్చి వెనక్కి తగ్గాడు.

టాక్సీ శరవేగంతో దూసుకుపోయింది.

* * *

కాలేజికి వరుసగా మూడు రోజులు సెలవులు దొరికినయి. ఈ మధ్య కాలంలో అప్పుడప్పుడు తిలక్ సుధాకర్‌వాళ్లని చూసి వచ్చాడు. వాంట్లో సరిగా

లేదనే నెపంతో మాలతి తిలక్ ఆహ్వానాన్ని అనేక మార్లు తోసిపుచ్చి అతని గుమ్మంలో మళ్ళీ కాలుపెట్టనేలేదు. ఈ మాటు సుధాకర్ మాలతిని తీసుకుని వాళ్ళ వూరు బయల్దేరాడు. తిరిగివచ్చేముందు— "కోడల్ని నా దగ్గర వుంచి వెళ్లు నాయనా.... పాపం దానికి మాత్రం ఎవరున్నారు....?" అంటూ సుధాకర్ తల్లి అడిగింది లాంఛనంగా.

అది హాస్పిటలు సౌకర్యం కూడా లేని పల్లెటూరు.

పైగా ఆమె రోగిష్టి.... పెద్దతనం. ఉన్న ఊళ్లోనే ఒక కూతుర్ని తమ్ముడి కిచ్చుకుని అతడి పంచనే వుంటున్నారు. అతడి సంపాదనా అంతంత మాత్రమే. వాళ్ల పోషణాభారం కూడా సుధాకర్ చాలా వరకు భరిస్తుంటాడు. వాళ్లు మనుషులే అదో రకం.

అందుకే సుధాకర్ ఇష్టపడలేదు.

ఇంకో గంటకు బయలుదేరుతా రనగా— అద్దంముందు కూచుని అలంకరించు కుంటున్న మాలతిని సుధాకర్ ఊరికే అడిగాడు.

"—అమ్మ నిన్ను వుంచేసి వెళ్ళమంటోంది. నీ యిష్టం చెప్పు మాలా...."అని మాలతి బదులు పలుకలేదు. జడ విసురుగా వెనక్కి వేసుకుంది.

సుధాకర్ ఆమె ముక్కు పట్టుకుని మీదికి లాక్కున్నాడు—

"అబ్బ, వదలండి నా ముక్కు.... ఎక్కడా తావులేనట్టు...."

"ఎక్కడుంది తావు....? ఎటు చూద్దామన్నా ఉబ్బు ఉబ్బుగా.... ఈ ముక్కే మామ్మూలుగా కన్పిస్తోంది—" దానిపై చిటికెవేసి ఘరీ చెప్పాడు.

....నిజమే. పల్చగా నాజూగ్గా వుండే మాలతి వొళ్లుచేసి ఇప్పుడు నిండుగా హుందాగా అన్పిస్తోంది—

పొట్టకు తగిలీ తగలకుండా ఆమెను కౌగిట్లోకి తీసుకుని వొళ్లు తిమ్మిరెక్కించే వెచ్చటి ముద్దు నొకదాన్ని ప్రసాదిస్తూ....

"చెప్పు మాలా...! వుండి పోతావా....?" అంటూ మళ్లీ అడిగాడు.

"మీకు నన్ను శాశ్వతంగా వొదిలించుకోవాలనుంటే అలాగే కానివ్వండి...." అంది పెంకెగా.

పొద్దు ఎక్కువైనప్పుడు పసిపిల్లల పాల బుగ్గల మీద పళ్లన్నీ బిగించి ఎడా పెడా వాయించినట్టు— మాలతిపై వచ్చిన కోపాన్ని నిగ్రహించుకుంటూ.... ఆమె చెంపలపై సున్నితంగా చరిచి "నీ బదులు నేను వేశాను లెంపలు; తప్పు కదూ! ఇంకెప్పుడూ ఇలా మాట్లాడకు"— అంటూ ఆమె తలను అతని గుండెల సమీపా

నికి తెచ్చుకుని.... "మనం ఎప్పటికీ ఒకరి ప్రక్కన ఒకరం ఇలాగే నిలిచి పోవాలి" అని గంభీరంగా పలికాడు సుధాకర్. మాలతికి ఆ కంఠంలో బాధ స్పష్టంగా విన్పించింది.

'అవును. సుధాకర్‌కి తనంటే ప్రాణం. తామిద్దరూ ఒకటే. ఒకరిని విడిచి మరొకరు జీవించలేరు—' అనుకుంది.

ఆ వూహ ఆమెకెంతో సంతృప్తి నిచ్చింది.

మరో పావుగంటలో అత్తమామల వద్ద సెలవుతీసుకుని సుధాకర్‌తో ప్రయాణమైంది.

తిలక్ విషయంలో సంభవించిన ప్రతి సంఘటనా మాలతి క్రమంగా మరిచి పోతొచ్చింది. ఆ సంఘటనల మూలంగా ఆమెకు కనువిప్పు కలిగింది. తన ఐన్మకు అసలు కారణం గ్రహించ గలిగింది.

'స్త్రీకి సంబంధించినంతవరకూ తన సంసారం సక్రమ మార్గంలో నడుపు కోవడమే తన గమ్యం' అని తెలుసుకోగల్గింది. ఇప్పుడామె ఎటువంటి సంఘ టనలనైనా ఈజీగా, తెలివిగా ఎదుర్కొని అందరి సమస్యలు స్వశక్తితో పరిష్క రించుకోగల్గిన స్థాయికి వచ్చేసింది. అదేనేమో అసలయిన జీవితం....!

మాలతికి నెలలు నిండినయి...

క్రితం రోజున హాస్పిటలుకి వెళ్లి పరీక్షచేయించుకుంటే మరో వారం రోజులు టైముందని చెప్పింది డాక్టరు. సుధాకర్ ఆమెను పువ్వులా చూసుకుంటూ కాలు క్రిందపెట్టనీకుండా అన్ని ఏర్పాట్లు చేస్తున్నాడు.

అయినా ఏదో ఒక పని కల్పించుకుని చేస్తూ తిరుగుతుంటే, పురుడు సులభంగా వస్తుందని అనుభవజ్ఞురాలయిన ఒక నర్స్ చెప్పిన విషయం గుర్తుచేసుకుని భర్త కాలేజికి వెళ్లంగానే మాలతి పూరికే కూచోక ఆ పనీ ఈ పనీ చేస్తూ వుంటుంది.

ఆ రోజున కాలేజిలో ఏదో మీటింగ్ వుందని కొంచెం ఆలస్యంగా వస్తానంటూ చెప్పి వెళ్లాడు సుధాకర్. తలంటి పోసుకుని జారుముడి వేసుకున్న మాలతి బిక్కు బిక్కుమంటూ అతని రాకకై ఎదురుచూస్తూ వాకిట్లో నిలుచుంది. అంత క్రితమే 'తొట్టి'లా వుందంటూ పట్టెమంచం గది మధ్యకు ఈడ్చి ఓపిగ్గా నవారు బిగించింది. ఆ కారణంగా నడుము కాస్త సలిపినట్టయింది. 'అదే పోతుందిలే'— అనుకుని తేలిగ్గా తిరిగేందుకు ప్రయత్నించింది.

ఉండి ఉండీ ఒక్కొక్క నొప్పి డొక్కలోకి తంతోంది. మాలతి ఎంతోసేపు

అక్కడ నిల్చోలేకపోయింది. తలుపు గడియ బిగించి ఇంట్లోకి వస్తూ . . 'ఇలాగని చెబితే అతను తిట్టిపోస్తారు—' అనుకుంది.

ఆమె నిదానంగా అడుగులు వేస్తూ వచ్చి మంచంమీద వాలింది. చూస్తుండగానే పొట్ట ఉబ్బరించి నట్టయి ఊపిరి సలపలేనంత నొప్పులు ఒకదాని తర్వాత ఒకటి కడుపులోంచి బయల్దేరి చెమటలు పట్టేసినయి.

సుధాకర్ ఎటూ 'ఆలస్యం అవుతుంది వచ్చేసరికి' అని చెప్పాడు. ఈ మధ్య నెలలు నిండిన మాలతిని పరామర్శించేందుగ్గాను తిలక్ రోజూ సాయంత్రం వేళ ఓమాటు వచ్చి పోతున్నాడు. ఈ రోజు అతను ఇంకా రాలేదు ఎందుకో.

ఒంటరిగా వున్న మాలతికి ఆ సమయంలో చెప్పరానంత భయం వేసింది. బాదను తట్టుకోలేకపోతోంది.

'ఓ మాటు డాక్టరమ్మకు చూపిస్తేనో.. ' అనుకుని చిల్లర డబ్బులు వెతికి తీసుకుని తలుపులు బిగించి బరువుగా అడుగులు వేస్తూ వీధిలో కొచ్చింది.

ఆమె గబగబా నడవాలనుకుంది. కానీ నడవలేక పోతోంది. బాధ అలాం టిది. భర్త వచ్చేలోగా ఏదేనా టాబ్లెట్లు రాయించుకుని వచ్చేస్తాను; అనుకుంటూ అడుగులు వేస్తోంది. అప్పటికి పొద్దు బాగా వాటారింది.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. అసలా రోడ్డు ఎప్పుడూ అదే తీరు. అతి కష్టంమీద కొంత దూరం నడిచింది.

కృష్ణపక్షపు వెన్నెల మసకమసగ్గా అలుముకుంటోంది.

దూరంగా వాడు... ! రిక్షావాడు....!! రిక్షా వదిలి తిన్నగా నిశ్శబ్దంగా ఆమెను సమీపించాడు. వాడి దృష్టంతా ఆమె మీదే. మంచి బేరం తగిలిందన్న సంబరం కాబోలు.

"—బండి కావాల్నేటమ్మా ?" బుద్ధిగా అడిగాడు.

ప్రాణం లేచొచ్చింది మాలతికి. అమ్మయ్య ! బ్రతికి పోయాను!! అనుకుంది.

"అవును—శకుంతలమ్మ హాస్పిటల్ కి వెళ్లాలి ." అంది.

"ఎక్కండి .!" వాడు బేరమాడలేదు.

మనిషి సాయంలేకుండా రిక్షా ఎక్కడానికి కాస్తంత యాతనపడింది. బండిలో అస్థిమితంగా కూచున్న మాలతి—

"జాగ్రత్త ! నెమ్మదిగా పోనివ్ !" అంది ఆయాసపడుతూ.

"అలాగే !" జవాబిచ్చాడు వాడు.

తన దురదృష్టాన్ని తలుచుకున్నకొద్దీ మాలతికి కళ్లనీళ్ల పర్యంత మవుతోంది. తల్లి లేకపోవడం. అత్త వున్నా ఆపదకు కలిసివచ్చే మనిషి కాకపోవడం. ఆమెను తీవ్రంగా వ్యధపరిచింది.

'అయినా ఇదేంవిటి నాకిలాగయింది. అకాలంలో కాన్పు అవదు కదా !

ఛఛ. డాక్టరు చెప్పలేదుగా. మనసుండబట్టలేక ఆ మంచం బిగించడం వలన ఇలాగయిందంతే ! ఏముంది .. మందులు రాయించుకుని అరగంటలో ఇల్లు చేరిపోవచ్చును. తాను చేసిన ఈ 'ఎడ్వెంచరు' విని సుధాకర్ ఆశ్చర్య పడతాడు.

ఒకవేళ . ఇవి పురుటినొప్పులే అయితే . ?

అతనికి ఈ ఖబురెలా తెలుస్తుంది... ??

ఇదే తిలక్ ఇంట్లో అయినట్టయితే సుధాకర్‌కి ముందుగానే ఫోన్‌చేసి ఓయర్తోనేది. అసలు ఫోన్‌చేసి డాక్టర్‌నే పిలిపించేవాడు తిలక్.

"అన్ని వసతులూ బాగుంటయి ఇక్కడికే వచ్చెయండి...." అంటూ ఆపేక్షగా అడిగేడు కూడా.

తానే వద్దంది.

ఈ పురుడు సవ్యంగా జరిగితే తమకి పాపగాని బాబుగాని పుడతారు. గారాబం ఒలకబోసే తండ్రి. అపురూపంగా అప్యాయతలు కురిపించే తిలక్— తమ ఇంట బోలెడంత సందడి.

ఒకవేళ పురుడు కష్టమై తాను చచ్చిపోతే ?

ఛ. తనకెప్పుడూ ఇటువంటి ఆలోచనలే రేకెత్తుతుంటాయి. అన్నీ అనుమానాలే. !

అవునూ. . తోడులేకుండా ఒంటరిగా ఆడమనిషి ప్రయాణం; పైగా ఒంటి మీద ఏడెనిమిది తులాల బంగారం .. అసలు ఈ రిక్షావాడు ఈ రాత్రివేళ తిన్నగా తీసుకెడతాడా లేదా ? అనుకుని

"ఏయ్ అవు ! ఇటెక్కడికీ . ! శకుంతలమ్మ హాస్పిటలని చెప్పలేమా ?" అంది.

"అఁనమ్మా .. సెప్పినారు. అటు రోడ్డు బాగుసేత్తన్నరు . "

—మాలతి ఆ మాట నమ్మాలో వద్దో తేల్చుకోలేకుండా వుంది.

' . నల్లగా ఇనుప దిమ్మల్లాంటి చేతులూ, కాళ్లూ; నాపరాతికి మల్లే నిగనిగలాడే వీపూ మెతక వాసన కొట్టే చిరుగుల బనీనూ, ఎర్రని డ్రాయరుతో— దొంగాడికి మల్లే '

అవును; పట్టు జారిపోయేందుకు అనువుగా ఉప్పు కారే చెమట— జాయ్‌గా పోతున్న బండి గతుకుల్లో పడి 'ధన్' మంటూ లేచింది. మళ్ళీ పరుగు తీస్తోంది.

"అమ్మో . !" మాలతి ఆర్తనాదం చేసింది.

"నొచ్చినాదేటమ్మ... ?" స్పీడు హెచ్చిస్తూనే పరామర్శించాడు.

మాలతి వెంటనే జవాబీయలేకపోయింది.

నొప్పి . నొప్పి తరువాత నొప్పి . . మూడవ నొప్పి గుండెల్లోకొ్కట్టింది. క్రమంగా దొంతర నొప్పులు. ఆమె పరిసరాలు గమనించలేకపోతోంది. ఏదో కొత్తగా వుంది. కళ్ళు మూతలు పడుతున్నయి.

ఆమె కిహ ఆలోచించే ఓపిక లేదు. రిక్షావాడు ఆలోచించడం మొదలెట్టాడు.

"—పాపం నిండు మడిసి. దసలచ్చి౦ది నాగుంది. కరమ గాలి 'రుచ్చా' పిలిసినాది గాని, మోటారు బండి మీన పయనమవాల్సిన మాట— దేవిమీన ఎత్తేనేం.... నరసమ్మలు, డాకటేరులు ఆజీలుగ సోగతం పలికి తోడి తీసిక పోతరు. తలాపిన దిండూ, నడుం కింద సెయ్యా, మీదని కళ్ళూ ఎట్టి అగ్గగలాడుకుంత అరిసేవలు జేత్తరు ... అయమ్మ మీనకంటా అయమ్మ ఇచ్చే ఇనాములమీన ఆరి మనసు నిలిసిపోతది. డబ్బనేది మడిసిని ఏదయినా సేయిత్తది. డబ్బునోడు ఎలాటోడేనా గాని గొప్పోడు. . !

ఆడి మాటలు సేతలు అన్నీ గొప్పే !

పేదరికం అంతేని గొప్పోడు కాలుజారి సాటుమాటున కనిపారేసిన పాపాల పిండం అన్నామాట.

ఆడు సులువుగా కని, సెలామనీ అయిపోతాడు. ఈడికి మంచీ సెడ్డా ఎదుగూబొదుగూ వుండదు. ఊరవకాడ రోడ్లంట. . దొంకల్లో.... తుప్పల్లో ద్రాని ద్రాని అక్కన్నే అంత౯పై పోతడు.

'ఇదీ నా నెత్తురే— . నా యవకతవకల్లో జరిగిన అపశారం౯వే ' అని ఆడు ఒప్పుకోడు. పైగా 'ఒకనాటికి బలపడి, తిరగబడి వాటా కొచ్చీగలడు' ...గవి— రాల్లు రువ్వి సంపీనందుకే సూత్తుంటడు. లేనోడి బతుకుల్ని సెలికి సెలికి రెచ్చగొడితేగాని ఉన్నోడి కకుర్తి కూడు అరగదు.

లేనోడు పేదోడయితే మటుకేం మంచోడు !

ఆడీకే ఇలవ లేనప్పుడు ఆడి మంచికి ఇలవేటుంటది.... ?

ఆడి అత్తంలో కూడా అతిమానం వుంటాదనీ.... (ఆత్మాభిమానం) 'సీ. ! ఈ నికృష్టపు బతుకు బతికేకన్నా సవ్వటం మేలు....'— అని ఆడూ సింత పడుతుంటడనీ ఈరికేం తెలుసును.... ?

సిః కలిఁవి నేఁవి.... అంతా వల్లకాట్లో బుగ్గి నాగ సమానం అయే రోజు రావాల...." అనుకుంటూ రిక్షావాడు మండతోనే ముఖంమీది చెమట తుడిచేసు కున్నాడు.

అయిదు నిముషాలు గడిచినయి.

రిక్షాబండి అఘమేఘాల మీద పరుగెత్తుతూనే వుంది.

బాధలో వున్న మాలతికి ఏమీ కన్పించడంలేదు. దారంతా అలుక్కుపోయి నట్టుగా వుంది. మనుష్యులు సంచరించని మారుమూలకు చేరుకున్న బండి సడన్‌గా ఒక బలమైన కుదుపుతో ఆగిపోయింది.

మనస్సూ శరీరం మొద్దెక్కి తిమ్మిరిలాంటి అనుభూతిని మాత్రమే పొందు తున్న మాలతి నింపాదిగా కళ్లు తెరిచింది.

ఎదురుగా వాడే.... !

వాడి చీకిరి కళ్లు ప్రతీకారంతో భగ్గుమంటున్నాయి. నములుతున్న ఎంగిలి బీడీ తుప్పున వుమ్మేసి దగ్గరకు వస్తున్నాడు.

మాలతి ఏదో అత్యాచారాన్ని క్షణాల మీద ఊహించింది. ఆ ఖంగారులో తానెంత బిగ్గరగా అరవగలదో అంత బిగ్గరగానూ అరిచింది.

"అమ్మో.... !" అంటూ గావుకేక పెట్టింది.

గుండె అంచులను మాత్రమే తాకి లోలోపలే తారట్లాడిన ఆ కేక పైకి విన్పించలేదు.

"దిగెహె.... ! కొత్తఁవాస కోడిపెట్టనాగ గుత్తం గున్నవ్ సూడనాకి.. " వెటకారంగా పలికి రెక్కపుచ్చుకు ఒక్క గుంజు గుంజాడు.

సున్నితమైన ఆమె చేతి ఎముకలు పటపటమన్నాయి. అతడి చెయ్యి ఆమె వొంటిమీద మంటలు మండించింది. వాడి పెదాలమీది వక్రపు నవ్వు- ఆ నవ్వులో అదో రకం పగ.... తొంగిచూస్తోంది-

ఆమె ప్రాణం విలవిల్లాడింది. శక్తినంతటినీ కూడదీసుకుని కిందికి దిగేందుకు చూసింది. కాని లాభంలేకపోయింది. గుండెల్లో సుళ్లు తిరిగే భయంతో 'నేను సర్వనాశనం కాబోతున్నాను....' అనుకుంది. అలాగే రిక్షా సీటును గట్టిగా అంటిపెట్టుకూర్చుంది శూన్యమయిన హృదయంతో.

"ఏటి....మాలావు మునిగిపోతన్నట్టిగె నాజూకు నూకుతున్నవ్ ? నీ పేనాని కేం అని సెయ్యనులే. నిన్ను బలవంతంగ అనబగిందారన్న దుర్గునం నాకాడ నేదు"_ అంటూ ఆమెను చూపులతోనే వెంటాడుతూ_

"ఏటాకోలం గాదు. నీ బాబు గడించినట్టిగె రుచ్చాబండిల తన్నిపట్టుకొక్క కున్నవ్‌గాని .. దిగు సెప్తా.... !" అన్నాడు.

ఈ హఠాత్పరిణామానికి మాలతి ప్రాన్పడిపో యింది. కెవ్వు మనబోయి సంబాళించుకుంది. సరదాగా అందంగా పెంచుకున్న చేతి గోళ్లవంక పరీక్షగా చూసుకుంది. కాని అవేం అగుతయి. తనకి ఆత్మీయులయిన సుధాకర్‌ని తిలక్‌ని తలుచుకుంటోంది. 'గొప్ప ఆపదలో వున్నాను.... రండీ' అంటూ భూమి గిర గిరా తిరుగుతున్నట్టూ తానూ దానితోపాటే గిరున తిరుగుతున్నట్టూ.... అదో విధంగా వుంది— కన్పించని దేవుళ్లను రక్షించమంటూ అడిగేందుకు చేతులు జోడించబోయింది. దెబ్బతిన్న చేతిని లేపలేకపోవడంతో వున్నా ఒక్క చేయి మాత్రమే పైకి లేచింది.

ఎదురుగా భూతం మాదిరి మళ్ళీ వాడే ప్రత్యక్షమయాడు.

"దిగమంటేని .. ? తమాసాలాడతన్నవేటి.... నీ ఎదురుగుంట నాటకం ఆడత ఏాకుంటేని ఆయనక కడుపుల కూక్కొ దెలగొ స్తాది మాకు ?" గదమా యించాడు.

'.... ఇప్పుదేఁవిటి చెయ్యను దేఁవుడా.... ! నన్నిలా చిత్రహింసలు పెట్టే కన్నా ఒక్కమారే చంపేయరాదూ ?' ఆమె అత్మ ఆర్ద్రితతో మొత్తుకుంది. దుఃఖం ముంచుకురాగా వెక్కి వెక్కి ఏడుస్తూ—

"చూడూ .. ! నీకేం కావాలన్నా ఎదురుచెప్పకుండా ఇచ్చేస్తాను. ఇదిగో.... బంగారం ! ఇది తీసుకెళ్లి కొన్నాళ్లపాటు హాయిగా బతుకు—" వేదనతో పలికింది.

"అచ్చే....శా !! పొరబాటు మాట. డబ్బా ... బంగారం వూసు నా దెగ్గిర ఎత్తక మరి. ఓరిసన్నా చరే— అదే గడ్డి గరిపిస్తుంటుంది."

"మరి ... ? మరేం కావాలి నాయనా నీకూ.... ? నన్నిలా దుఃఖపెడితే నీకు లాభించేదేముంది చెప్పు....?? నీకు ఏదేనా కావాలంటే అడుగు...." ఏడుపు ఆపి కంపనస్వరంతో వేడుకుంది.

"నాకేటీ వొద్దుగాని.... ఇక్కణ్ణించి దిగి తిన్నంగ నడిసి ఎలిపో— బేగి ఎల్లాల.... ! డాట్రమ్మ ఉంటాది. ఆలీసమైతే ఆసిపత్తిరి జేరనేవు. ఈ రాకాసి నోయలోనే పురుడై పోతాది—" చెవిలోంచి మరో బీడీ తీసి రిక్షా దీఃవద్ద వెలిగించుకుంటూ పలికాడు.

"నేను నీకేం అపకారం చేశాను బాబూ !? నా కెందుకింత శిక్ష ? అపదాన్ని చేసి "

"అందుకే ....! మొగాడివయే నాగుంతేని, ఇలాంటి శాన్సు దొరికినందికి ఒంటిమీన గుడ్డాగోడ ఒలిసీసుకుని.... సంపీసుండేటోణ్ణి- సీల్సి పారీసీవోణ్ణి. నిన్నొగ్గినందికి ఒక కారనం ఉండిపోనాది. బతికిపోనావ్.... !"

అంతేచాలు....అనుకున్న మాలతి మొండిధైర్యం తెచ్చుకుంది. లేనిశక్తిని పుంజుకుంది. కడుపులో పోట్లు పొడుస్తూనే వున్నయి. ఆమె కంట తడిరాక పోయినా.... జాలిగొలిపేలా సిగ్గు విడిచి.... గొంతెత్తి 'అమ్మో అయ్యో' అంటూ అనాగరికురాలికి మల్లే రాగం అందుకుంది.

"అద్గదీ ....! నిజంగా దుక్కం(వొత్తేని ఇలగే ఏడవాలి.

బలే బలే.... నా సెపులారా ఆలకిత్తాను.... ఏడు.... ! నీ గోడు ఓరికీ ఇన బడగూడదు. నివ్విలాగే ఏడిసేడిసి....సొరంఅతప్పి.... ఆకరుకి-నీ 'చవం'...." రిక్షావాడు ఇంకా కసిగా ఏదో అనబోతుండగా....

"అన్నా ....!!" మాలతి పొలికేకవేసింది.

ఆ కేక వాడి గుండెల్లో ప్రతిధ్వనించింది. రిక్షా గంగులు తుళ్ళిపడ్డాడు. ఆమె వంక నిదానించి చూశాడు. చేతిలో బీడీ దూరంగా విసిరేశాడు.

మాలతి ఏడుపాపింది.

"నన్ను తీసికెళ్లు.... వేగంగా బండిని లాగించు నాకేదో అయిపోతోంది.... నేను.... నేను.... అన్నా.... నీకు పుణ్యముంటుంది...."

గతంలో కడుపునిండిన ఇటువంటి మారాజుల మాటలు, చేతలు వాడికి బాగా అనుభవమయినయి. వాడందుకే తటస్థంగా చూస్తున్నాడు.

"రక్షించు.... నేను కష్టంలో వున్నాను.... నీకు తోబుట్టువులాంటిదాన్ని.... తల్లిలాంటి దాన్ని...." బాధగా భయం భయంగా మాటలు కూడదీసుకుంటూ ప్రార్థించింది మాలతి.

"-అచ్చే.... వోరూగాదు.... ! పెల్లం నాటి దానివి. నాకు తోబుట్టూలే నేరు. తల్లి వొపులో తెలీని అనాదపోణ్ణి. నన్ను శారదీసి-తల్లీ, సెల్లా, అలూ.... అన్నీ తానే అయి- 'పెపంచికం అన్నా, పకుర్తి (ప్రకృతి) అన్నా ఇదిరా.... నాయూలా....' అని నన్నొక ఇంటోణ్ణి సేసింది నా భార్య నచ్చిఁవి. (లక్ష్మి)

మాలచ్చిఁవి నాటి నా యాడది ఇలగే తుట్టె తిరగబడి....కట్టపడతందని డబ్బామీన ఏసికెళ్లిపోయి డాట్రుకాడ సూపిచ్చబోతే- ఆడు 'డబ్బు తీసుకోని ఎలిపోరమ్మన్నడు.' గవురమెంటోడే మల్లీ. సెయ్యీ కాలూ ఆడనోణ్ణి నన్ను వాకట కూకుండబెట్టి.... దాన్ని వొగ్గినాడు. డబ్బుకోసం దాని పేనాలనే తాకట్టు పెట్టుకున్నడు.

-నీకు మల్లె నాజెంగ పెరక్కపోయినా.... దాన్నిగోడాని పేణవే గదా టయానికి మందులేక.... డబ్బులేక.... వొయిద్దిగం లేక.... గిలగిలమంతాని నా పెల్లం ఆడిగుమ్మ్రం లానె పానాలొగ్గినాది.

ఏటంతావ్....? నా బార్య పానాలు ముప్పది రూపాలకు ఇలవ కట్టినాడు. పానం నిలపవలసి నోడు డబ్బు నిలుపుకోనందికి సూసినాడు.

డబ్బు నిలవేసుకోడమంతే.... ముందు సూపు సూద్దం—

ఆడికంత ముందుసూపున్నప్పుడు....అడి బతుకంత ఇలువైనప్పుడు.... రేపటి గురించి అన్ని ఆశలు నింపుకున్నోడికి.... ఆడి జీవనోపాది మీద అంత లచ్యం వున్నోడికి— ఎదుటోడి బతుకు ఎందుకని నీళకంగ అవుపడినాది....?

దీంతల్లి శిగ్గొయ్య....! వొగులూ రెయ్యా కట్టకపడి ముప్పయి రూపాలూ శాతబట్టుకుని.... ఆడికాడికెల్లి— "ఇదుగోరా డబ్బూ...! ఇది సంపాదిచ్చి నందికి మూడ్రోజులు పట్టినాది: తీసుకోరా....! యీట్ని అందుకుని నా పెళ్లాన్ని నాకిచ్చేరా .." అని కమీజట్టుకుని అడిగినానని—

'బంగలాలో దొంగతనం సెయ్యనందుకొచ్చి పట్టుపడిపోయి.... పైగా నన్ను కొట్టేసినాడు.... సంపేబోనాడలగని—' నామీన నేరం రుద్ది పోలీసోల్ల కొప్పజెప్పినాడు.

అమ్మా ! వొల్లాంచేవోడు వొంగనోడికి నోకువ— శిచ్చ అనబగించి నందికి నాకేం శాతర్నేదు....! కానీ నువు సెప్పు....వోరిది నాయం....???"

రిక్షా గంగులు ఆత్మనివేదన చేసుకున్నాడు. వాని గొంతుకలోని కంపనం స్పష్టంగా గ్రహించిన మాలతి మనసు కల్లోలిత సాగరమయింది.

"నిజమే అన్నా.... నువ్వు అభాగ్యుడివి. నిన్ను చూస్తుంటే నాకు జాలి వేస్తోంది—" అంటూ మనసారా ఒప్పుకుంది.

గంగులు తెల్లబోతూ.... పట్టరాని సంతోషంతో— "ఏటన్నవ్....? ఇదేమాట! అవును ఇంగే....అచ్చంగ ఇలాగే చెప్పినాది ఆయమ్మ. నీ బోటి అమ్మ. ఆయాల వున్నవినాడు జైల్లో నాబోటి అనాదలకు నేనున్నానంటూ ముందుకొచ్చి— "మిమ్మల్ని సూస్తుంటే నాకు జాలిగావుందని...." కల్లనిండా నీల్లెట్టుకుని మరీ సెప్పింది— ఫో.. ! బతికిపోనావ్ పో— ఆయమ్మ నీలాగేవుంది. గొప్పోల పెల్లాలంతా ఒక్కనాగే వుంతరులే—!

నా సేతికి రచ్చరేకకట్టి నన్నొక అన్నదమ్ముడినాగ ఒప్పేసుకుంది: మమ్ముల్ని సూసి మడుసుల్లాగ జాలిపడే 'అమ్మ'....లు ఊరికి ఒక్కరుంటే శాన. సెపించికవే మారిపోద్ది.

ఈ రోజికి ఈ మాత్తరం దయాదాచ్చిన్నెం నాయెగ్గిర మిగిలినయ్యాతేని అయమ్మ సలవే– లేకుంతె ఈపాటికి ఊరు ఊరంతా బుగ్గిజేసుండేటోడ్ని....

పద ! సిటంలో నిన్ను పురుళ్లాసిపత్తిరికాడ ఒగ్గేత్తను. మరేం పరవనేదు. నన్ను మల్లీ జైలుకి ఒప్పజెపుతావన్న బయం నాకు లేదులే!

అదే మంచిదనుకోరి–

మల్లీ ఒకునాటికి రచ్చరేక సేతబట్టుకుని అక్కడికి నా 'సెల్లి' రాకపోదు.... ఆ 'యాస'తో నల్లంగ ఎల్లిపోతాను."

రిక్షాగంగులు కళ్లొత్తుకుంటూ రిక్షాహాండిలు అందుకున్నాడు. మాలతి చలించి పోయింది.

–పాపం మానవసేవకై అహరహం కృషిచేయవలసిన బాధ్యత కల్గిన ఒకానొక వైద్యుని ధనదాహం మూలంగా ఇతని భార్య నిండుచూలాలుగా ప్రాణాలు వదిలింది. నిజానికి శిక్ష పడవలసింది అక్కడ. అతనికి–

అందుకే ఈ బాధితుడు ధనవంతుల ఎడల ఈర్ష్యాభావం పెంపొందించుకుని క్రమంగా ఆ అసూయే క్రోధంగా మార్చుకుని ఈ ముహూర్తంకోసమే ఎదురు చూస్తూ ఈ అఘాయిత్యానికి తలపడ్డాడు.

ప్రతి మనిషిలో ఒక మనసూ.... దానిని అంటిపట్టుకుని మానవత్వమనే ఒక సున్నితమైన పొర దాగుంటయి. దానిని తాకే రీతిగా తాకితే పంచామృతాన్ని పంచిపెడుతుంది. ఛేదిస్తే కాలకూటాన్ని కక్కుతుంది.

మాలతి ఆ రిక్షావాని అంతరంగ క్షోభను అర్థంచేసుకుంది. జైలు అధికారులు ఆనాడు దూరదృష్టితో శిక్షాకాలంలో సున్నితమైన వారిమనసుపొరలను స్పృశించేలా సమాజానికీ .. నేరానికీ నడుమ బిగింపజేసిన ఆ 'బంధం' ఎంత బలమైనది....?

'అన్నా....! ఆ రాఖికట్టిందాన్ని నేనే .. నిజంగా ఆవేళ నీ చేతికి రక్షాబంధన్ కడుతుండగా నా హృదయం తీవ్రంగా స్పందించింది. నేనే నువ్వు ఎదురుచూసే నీ చెల్లాయిని–' అంటూ చెప్పాలనుకుంది.

తాను కట్టిన రాఖీ ఒక నేరస్థుడిలో ఇంతటి చైతన్యం తెస్తుందనిగాని.... ఆ దారాలపోగుల్లో అంతటి మహత్తరమైన శక్తి దాగుందని గాని ఆమె ఊహించలేదు.

ఆ రోజున అదొక సామాజిక వినోదంగా భావించి వెళ్లింది. ఆ సంఘటనను గుర్తుంచుకుని దాపరికంలేకుండా గంగులుచేసిన వ్యాఖ్య.... అతనిలో పరివర్తనా ఆమెను ముగ్ధురాలిని చేసింది.




వెన్నెల ముగ్గులు పరుచుకున్న ఆ నిర్జన మైదానంనించి బండి కదిలింది.

మాలతి జాగ్రత్తగా సీటుమీద ఒక పక్కకు ఒరిగి వెన్ను వాల్చింది. ఆమె నడుము విరిగిపోతున్నట్టూ.... కాళ్లు తేలిపోతున్నట్టూ.... ప్రాణమే పోతున్నట్టు బాధపడసాగింది.

'_పాపిష్టోణ్ణి. ఒకపాలి సెయ్యిజారిపోనాది గదా? అది సాలక ఏటి మళ్లీ ఈ దారునం. వొవుడో చేసిన పాపానికి వొవులో సిచ్చబడాలనా? ఏ తల్లి కన్నబిడ్డో....నా యదాన బడినాది....గొప్ప కట్టంలో వున్నాది....బతుకుతాదో? నేదో...? నానే అనాద ననుకుంటె నా కంటా దిక్కూ దివానం లేనట్టుగుంది. ఒక్కర్తీ బయిలెల్లినాది.

ఈ తప్పు నాది గనుక నా రగతం సెవటకింద సెల్లబెట్టయినా ఈ యమ్మని అసుపత్రికి ఒప్పజెప్పాల....' అభిమానంగా అనుకుంటూ బండిని ఇంతదూరం లాక్కొచ్చినందుకు గంగులు మనసులోనే విసుక్కున్నాడు.

మృత్యుకోరల్లో ఇరుక్కుపోయినట్టు మాలతి మూలగసాగింది. అతని కప్పుడు తన భార్య 'లచ్చిమి' గుర్తుకొచ్చింది. పాలిపోయిన ముఖంతో ఆమె తనవంక దేవిరిగా చూసిన చూపులు గుర్తుకొచ్చినయి. నొప్పుల బాధ తట్టుకో లేక ఒంటిమీది బట్టలు ఊడబెరుక్కుంటూ.... జుట్టు పీక్కుంటూ.... తల నేలకేసి కొట్టుకోడం గుర్తుకొస్తోంది. రెండుచేతుల్తో కడుపుపై రుద్దుకుంటూ.... "మామా....! ఈ మానులో మాను బయటపడే మారగం సూడు బేగి...." అంటూ అసహాయంగా మూలిగిన మూల్గులు వినిపిస్తున్నట్టయింది. తెల్లని బట్టతో

ఈ యమ్మ యజమాని ఏడబోనాడో....? ఇప్పటికి నానే దిక్కయినాను.... సూసినావా బగమంతుడా ?

ఈ తప్పు నాది గనక నా రగతం సెమట కింద సెల్లబెట్టయినా ఈయమ్మని అసుపత్రికి ఒప్పజెప్పాల....' అభిమానంగా అనుకుంటూ బండిని ఇంతదూరం లాక్కొచ్చినందుకు గంగులు మనసులోనే విసుక్కున్నాడు.

మృత్యుకోరల్లో ఇరుక్కుపోయినట్టు మాలతి మూలగసాగింది.... అతని కప్పుడు తన భార్య 'లచ్చిమి' గుర్తుకొచ్చింది. పాలిపోయిన ముఖంతో ఆమె తన వంక దేవిరిగా చూసిన చూపులు గుర్తుకొచ్చినయి. నొప్పులబాధ తట్టుకోలేక ఒంటిమీది బట్టలు ఊడబెరుక్కుంటూ.... జుట్టు పీక్కుంటూ.... తల నేలకేసి కొట్టుకోడం గుర్తుకొస్తోంది. రెండు చేతుల్తో కడుపుపై రుద్దుకుంటూ.... "మామా....! ఈ మానులోంచి మాను బయటపడే మారగం సూడు బేగి...." అంటూ అసహాయంగా మూలిగిన మూల్గులు వినిపిస్తున్నట్టయింది. తెల్లనిబట్టతో చుట్టబెట్టి పెళ్ళికూతుర్లా పసుపూ కుంకాలతో, పూలహారంతో ఊరుచివరికి తరలి పోతున్న దృశ్యం కళ్ళముందు కదిలాడింది. గంగులు గుండె ఝల్లుమంది.

అంత మనిషీ జావలా జారిపోతూ కళ్ళవెంట అశ్రువులు రాల్చసాగాడు.

రోడ్డుమీది కంకరరాళ్ళని ఒరుసుకుంటూ రిక్షా చప్పుడుచేస్తూ దూసుకు పోతోంది. ఆలోచిస్తూ ఆ గాభరాలో.... ఊరకుక్క కాలుమీదికి ఎక్కించేశాడు బండిని. అది కుయ్యోమంటూ పారిపోయింది.

'ధూత్....! యదవ శకునం'– అనుకున్నాడు.

ఉన్నట్టుండి హృదయ విదారకమైన ఒకే ఒక అరుపు అరిచింది మాలతి–

అతడు వెనక్కి తిరిగి సంకోచంగా ఆమెవంక చూశాడు. "రామ రామ...." అనేశాడు పైకి.

వాడి గుండె కరిగి 'ఇప్పుడేంచేస్తావ్....?' అని ఎదురు సవాలు వేసింది.

రిక్షాగంగులు ఓడిపోయినవాడిలా డీలాపడిపోయి.... విలవిల్లాడుతూ, మనిషిలా జాలిపడుతూ, తనకు తానే ఊరటపొందుతూ, చెమటలు కక్కుతూ నొవ్వకుండా నొచ్చకుండా అరిచేతుల్లో పెట్టుకు తీసుకువచ్చినట్టు అతిప్రయాసతో జాగ్రత్తగా అసుపత్రి ఆవరణపద్దకు ఆమెను చేర్చాడు.

–గేటుముందరే ఎదురైన సుధాకర్.... తిలక్ అదుర్దాగా బండిలోపలికి వంగిచూస్తూ చెరోవేపు పరుగెత్తుకువచ్చారు.

"మాలా....! ఎలావుందమ్మా....?" అంటూ తిలక్ మాలతిని ఆప్యాయంగా పలుకరించబోయాడు.

సుధాకర్ నిలువెల్లా కంపించిపోతూ.... ఆమెను తట్టితట్టి లేపబూనాడు.

గంగులు కల్పించుకుని.... రిక్షాదీపం ఎత్తిచూపుతూ నిర్వికారంగా "బాబూ ....! ఆలీసంలేకంటా డాట్రమ్మగోర్ని పిలవండి.... పురుడైపోనాది. అమ్మగారు తెలివితప్పిపోర్ను_" అని చెప్పి చేతులు నులుముకోసాగాడు.

మ్లానమయిన మొహంతో తలదించుకు నిలుచున్న గంగులు ఎదుటివ్యక్తుల్ని గమనించుదామన్న కుతూహలం కూడా లేనివాడయ్యాడు.

మాలతికి హఠాత్తుగా పురుడురావడం చూసి డాక్టరమ్మ కొంచెం గాభరా పడింది. హాస్పిటలు సిబ్బంది ఆదరాబాదరాగా ఆమెకు అటెండయారు. మాలతి పల్స్‌చూసిన డాక్టరు_ "ఫరవాలేదు_ అలసట, బలహీనతవలన ఇలా జరిగింది. ఈమెకొచ్చిన భయంలేదు...." అంటూ ధైర్యంతెచ్చుకుంది. అదేమాట తిలక్ సుధాకర్‌లకు కూడా చెప్పింది.

ఆ తరువాత మాలతిని ఎమర్జెన్సీ వార్డులోకి తరలించారు. ఖరీదయిన మందులూ, శ్రద్ధతోకూడిన సపర్యలూ ఎలాగైతేనేం ఆమెను బ్రతికించినయి.

తల్లీ పిల్లవాడూ తిరిగి ఆరోగ్యంగా, ఆనందంగా కన్పించేసరికి పక్షుల కలకలారావంతో తూరుపు తెల్లవారింది. తిలక్ మాలతి మంచంవద్దకు వచ్చి ఉత్సాహంగా అడిగాడు_ "డాక్టర్‌ని అడిగి స్పెషల్ పర్మిషన్ తీసుకుంటాను. వాన్ తీసుకొస్తాను. మనింటికి వెళ్ళిపోదామా....?" అని.

మాలతి నీరసంగా_ "అమ్మో....! మళ్లీ మీ ఇంటికా....?" అని మాత్రం అనగల్గింది.

అంతవరకూ రాత్రంతా తిండికోర్చి, నిద్రకాచి, బేరం ఒదులుకుని అక్కడే చెట్లనీడను, గోడలపక్క ఆతృతతో తచ్చాడుతూ "తల్లీ....! నూకాల్లల్లి....!! ఈ సుట్టు మనూరి తీర్థంనాడు పొద్దల్లా ఒక్కపొద్దుండి.... నీ కోవిలముంగల ఆంజినేయుడి ఏసం కడతాను_ ఇదే నా పెలిగ్న... నా యమ్మని నువ్వే రచ్చించాల....!!" అంటూ దండాలు పెట్టుకునే రిక్షాగంగుల్ని ఎవరూ గమనించలేదు.

— —

# రామాలాలీ



పురాణం సుబ్రహ్మణ్యశర్మ

అనుభవం లేకపోవడం వలన తప్పులు చేస్తారు. అలా తప్పులు చేసుకుంటూ పోవడమ్ దాన్నే అనుభవమనే పెద్ద పేరు పెట్టి పిలుచుకుంటారు. అదే జీవితం–రాజుకి రోజంతా చిరాగ్గా వుంది– అలా పైకి దువ్వుకోవద్దని చెప్పినా సీతారామారావు వినిపించుకోలేదు. ఎగదువ్వగా ఎగదువ్వగా తలంతా వూడిపోయి బట్టతల వచ్చేస్తుందని రాజేశ్వరికీ భయం! దువ్వెనతో పనిలేని భర్తను వూహించుకోవడానికే కంపరంగా వుంది రాజుకి. సీతారామారావు రెండు మూడు రోజులు గడ్డంచేసుకోకుండా వుంటే, కాస్త నలిగిన బట్టలు వేసుకుంటే అదో మూడ్‌లో అదో రకంగా నచ్చుతాడు రాజుకి. మరి ఏరోజు కారోజు ఇస్త్రీ మడతలు నలగకుండా డ్రెస్ చేసుకునే మనాళ్ళ టైలర్స్ డమ్మీలా షోబాయిస్‌లా వుంటాడుగాని నిజరూపు కాస్త కేర్‌లెస్‌గా వుంటేనే వస్తుంది. బూట్సు సాక్స్ వేయకుండా చెప్పులు, లోపల బనీను వేయకుండా షర్టు, పైగుండీలు కాస్త వదిలేస్తే, షర్టు కొంచెం లూజుగా వుండి పొడుగు చేతులు కాస్త పైకి మడిస్తే సీతారామారావు కూడా అందంగానే వుంటాడు. మగాడికి కాజువల్ లుక్ అందమిస్తుంది. తెచ్చిపెట్టుకున్న అలంకారాలూ డాబులు మగాళ్ళకి అందమివ్వవు అని రాజు నిశ్చితాభిప్రాయం లేక అంచనా.

'మీ వారికి బోడిగుండు వచ్చేస్తుందోయ్!' అని తన క్లాస్‌మేట్ సుజాత వుడికించినప్పటి నుంచి అతని క్రాపును చూడగానే మండిపోతోంది రాజేశ్వరి. అతనికి బట్టతల వచ్చేస్తున్నట్లు, అటువంటి మగనితో తను షాపింగ్‌కి వెళ్ళినట్టు, సినిమాకి పోయి పక్కనే కూర్చున్నట్లు, హోటల్లో ఎదురెదురుగా కూర్చుని టిఫిన్ చేస్తున్నట్లు వూహించుకుని రాజు తీవ్రంగా అప్‌సెట్ అయిపోతోంది.

రాజు అంటే సీతారామారావుకి చాలా బెరుకు. అతను చిన్నప్పట్నుంచీ ప్రయివేటు మాష్టర్లన్నా, పోలీసు, టీకాల

ఇనస్పెక్టరు, కాలేజి ప్రిన్సిపాల్, దీపావళి టపాకాయలన్నా అపరిమితమైన భయం. రైలు ఇంజన్ కూత వింటే జనగణమనకి లేచి నిలబడినట్లు లేచి నిలబడి చెవులు మూసుకుంటాడు. అతనికి గట్టిగా మాట్లాడే వాళ్ళన్నా, పోట్లాటలన్నా, జంతికలూ చేగోడీలన్నా విసుగు. సిటీబస్సు హారన్లూ, రిక్షావాళ్ళ గంటలూ లారీల రొద, మోటారుసైకిలు చప్పుళ్ళూ జనం అరుపులూ భరించలేక పెద్ద పెద్ద రోడ్లను వదిలేసి సందుల్లోంచి వెళ్తాడు. సినిమాల్లో సహజంగా వుండే రేపుసీను వచ్చినపుడు బయటికి వెళ్ళిపోయి డాన్సు పాటో రాగానే తిరిగివచ్చి సీట్లో కూర్చుంటాడు. రాజుకి స్టంట్లూ ఫైటింగ్ సీన్లూ చాలా యిష్టం.

రాజేశ్వరి సీతారామారావుని సీతా అని పిలుస్తుంది. అతనామెను రాజూ అని పిలుస్తాడు. అలా పిలిపించుకోవడం ఆమెకిష్టం. రాజేశ్వరి కస్తూరిబా కాలేజిలో ఇంగ్లీషు లెక్చరర్. సీతారామారావు రైల్వేలో అసిస్టెంట్ ఎకవుంట్స్ ఆఫీసర్. అతడు అయిదడుగుల మూడున్నర అంగుళాలుంటే ఆవిడ అయిదూ అయిదున్నర వుంటుంది. ఆపైన హైహీల్స్. ముదురు రంగులు కడుతుంది. జడ చాలా పెద్దది కొరడాలా. ఆమె నేత్రాలు అమ్మవారి కళ్ళలా విశాలంగానూ తీక్షణంగానూ వుంటాయి. సీతారామారావుకి చాలా కోపంవచ్చినపుడు 'రాజూ నువ్వు నా ప్రాణానికి ద్రిల్లుమేష్టారి వోయ్' అని విసుక్కుంటాడు.

'ఈ ఆడాళ్ళు లేకపోతే మనం ఎంత సుఖంగా వుందుమో! అన్నిటికీ మేనర్స్ మేనర్సని మన ప్రాణాలు తోడేస్తారు—' అని మేనర్సూ మర్యాదయూ అక్కర్లేని ప్రపంచాన్ని వూహించుకుని మురిసిపోతూ వుంటాడు. ఎవరేనా వచ్చినపుడు లేచి నిలబడడం, నవ్వడం, చేతులు జోడించడం, గేటుదాకా వెళ్ళడం, స్టేషన్‌కి వెళ్ళి రైలెక్కించి రావడం, నమస్కారాలు పెట్టడం, ఆస్పత్రులకు వెళ్ళి రోగుల్ని చూడటం, పోయినవారి బంధువుల్ని పరామర్శించిరావడం, పిక్నిక్కులకు వెళ్ళి పేకాడటం, పాటలు పాడడం, ఎగ్జిబిషన్‌లో నిలబడి బజ్జీలు, అప్పడాలు తినడం, పోలింగ్ రోజున వెళ్ళి ఓటు వేసిరావడం, టైలరు దగ్గరకెళ్ళి కొలత నివ్వడం, బ్యాంకుకు వెళ్ళి చెక్కు మార్చుకోడం, ఆగస్ట్ 15న రేడియో వినడం, మీటింగులకు వెళ్ళి ఉపన్యాసాలు వినడం, దినపత్రికలలో సంపాదకీయాలు చదవడం యిలా చాలా సంగతులు అతనికి సరిపడవు. అతనికి చదరంగం కొరమూ వచ్చు. చాలా సార్లు 'టీ' త్రాగడం, లైబ్రరీ నుంచి పుస్తకాలు తెచ్చుకుని తెగ చదవడం, తెల్ల దుప్పటి వేసిన మంచంమీద ఒకక్కడూ పడుకుని ఆలోచిస్తూ ఆవలిస్తూ, ఒళ్ళు విరుచుకుంటూ దొర్లుతూ గడపడం

యిష్టం. కిటికీరెక్క తెరవగానే హోరు గాలి మొహంమీద కొట్టినట్లు రాజు కాపరానికి రాగానే కరెక్యులం, జీవిత సరళి, యిష్టానిష్టాలు అన్నీ దెబ్బతిన్నాయి. అతని కోటగోడలు పగుళ్ళువారి బీటలు తీసి అందులోంచి పిచ్చి మొక్కలు వస్తున్నట్లతనికి అనిపించ సాగింది. అంగుళంఅంగుళం పైకివస్తున్న నీటిలో అతను మునిగిపోతున్నట్లు ఫీలవసాగాడు. బలమైన ఏ శక్తినీ అడ్డుకోలేకపోవడం అతని బలహీనత.

అతనికి చాలా కాలంనుంచి వుంది ఓ కోరిక_ పెళ్ళాంచేత వీపు తోమించుకోవాలని. రాజుని ఆ కోరిక ఎలా అడిగి తీర్చుకోవాలో అతనికి తెలీదు. తనంతట తాను గ్రహించి ఎలాగో ఓలాగ ఎప్పుడో ఒకప్పుడు తను ముచ్చటపడే ఆ సరదా రాజు తీరుస్తుందని అతను వూహించుకుని వుబ్బి తబ్బిబ్బవుతూ వుంటాడు. తీరా ఆమె ఎదురవగానే 'ఛా యిటువంటి కోరిక కోరడం మేవిటీ? ఆవిడ ఏమనుకుంటుందో' నని బెంగపడి పోతాడు. పెళ్ళయిన కొత్తలో పుట్టిన యీ కోరిక చదువుదామని తెచ్చి చదవని పుస్తకం వూరించినట్లు వూరిస్తూ వుందే కాని తీరలేదు. ఇది గుర్తుకువచ్చినప్పుడల్లా తను బలిచక్రవర్తిలా అట్టడుక్కి కుంగిపోతున్నట్లు ఫీలయాలడు ఆ కోరిక మాత్రం వామనుళ్ళా 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు సమస్తాశావకాశాల్నీ అందుకుంటోంది. బాత్రూంలోకి వెళ్ళి వెళ్ళగానే అతనికా చాదస్తం తెలియకుండా ఆవహిస్తుంది. బాయిలర్లో కాచిన నీళ్ళన్నీ పోసేసుకుంటాడు. అలా పరధ్యానంగా ఆలోచిస్తూ ఆవిడ దివి నుంచి దిగివచ్చిన దేవకన్యలా హఠాత్తుగా అవతరిస్తుందేమోనని వూహిస్తూ తోమిన చోటే తోముతూ సబ్బు అరగదీస్తూ ఎప్పటికీ బైవిలి యివతలకు రాడు. 'మరీ అంత చాదస్తమయితే ఎలాగండీ' అని రాజు విసుక్కుని కేకవేసేదాక అతను రాలేడు. మళ్ళీ మర్నాటి దాకా ఆ కోరికను బాత్రూంలోనే వదిలేసి, తడి ఒంటితో భార్యను తనివితీరా కౌగలించుకోవడం మర్నాటికి వాయిదావేసి టిఫినుకి కూర్చుంటాడు. డ్రెస్ చేసుకున్నాక టిఫిన్ చేయాలని రాజు వాదన రోజూ. 'టిఫిన్ చేయడానికి కూడా టై కట్టి సూటేసుకోవాలా రాజూ' అని దీనంగా అడుగుతాడు. రాజు నవ్వదు. డ్రిల్లు మేష్టారిలా అది అంతేనంటుంది.

మరో చమత్కారం_

రాజు ఎప్పుడూ సీరియస్ మూడ్‌లో వున్నట్లు సీతారామారావుకి అనుమానం. తను డ్రెస్‌చేసుకునేప్పుడు ఆ గదిలోకి ఆమె యధాలాపంగా వస్తే 'ప్లీజ్ రాజూ' అని గెటవుట్ అనకుండా వెళ్ళిపొమ్మని కళ్ళతో అభ్యర్థించి మరీ సిగ్గుపడి పోతాడు.

తన కవసరమై ఆమె చీర కట్టుకునేప్పుడు ఆ గదిలోకి వెళ్తే నాలిక్కరుచు

కుని 'సారీ రాజూ' అని క్షమాపణ చెప్పేస్తూ తప్పుచేసినవాడిలా యివతలకు పరిగెత్తుకు వచ్చేస్తాడు. రాజు తల ఓరగాపెట్టి 'సిల్లీ' అని నవ్వుకుంటుంది.

ఒక రకంగా చూస్తే ఈ జంట 'నాట్ మేడ్ ఫర్ యీచ్ అదర్'లా అనుకోవచ్చు. సీతారామారావుకి చిన్నచిన్న దురలవాట్లున్నాయి. ఉత్తరాలు చదివేక చింపి ముక్కలు కింద పారవేస్తాడు. సోఫా మీద కూర్చున్నప్పుడు కాళ్ళు మీద పెట్టుకు ఖాసింపట్టు వేసుకు కూర్చుంటాడు. ప్రతి శుక్రవారం తలకు ఆముదం రాసుకుని అండర్ వేర్‌తో పచార్లుచేస్తాడు ఉదయపు ఎండలో. నీళ్ళతో వున్న సోప్‌బాక్స్‌ని నేలమీదనే వుంచి నిలబడి తలస్నానం చేస్తాడు. తడి తువ్వాళ్ళను మంచంమీద విసిరేస్తాడు. మాసిన షర్టును లుంగీలను డ్రాయింగ్ రూంలో కుర్చీలమీద సోఫా మీద వదిలేస్తాడు. కాలి జోళ్ళను ముందుగదిలో విప్పి లోపలకు రాకుండా నేరుగా పడగ్గదిలోకి వచ్చి మంచంకింద వొదిలేస్తాడు. సూట్ కేస్ తెరిస్తే మూత వేయకుండా వదిలేస్తాడు. కాఫీ తాగాక ఎంగిలి కప్పుల్ని బీరువా మీదో మంచం క్రిందో కిటికీలోనో మారుమూలల్లో దాచినట్లు వుంచేస్తాడు. మాసిన చేతిరుమాళ్ళను పుస్తకాల వెనకో డ్రాయర్ సొరుగులోనో దిండు క్రిందో పెడతాడు. మరొక విశేషం ఏమంటే ప్రతిరోజూ అతనికి డబ్బులు పోతాయ్. కంగారుపడి వెతుకుతాడు కనిపించవు. నోటు మార్చగానే చిల్లర నోట్లను చదువుతున్న పుస్తకంలోనో వారపత్రికలోనో రైల్వే టైం టేబిలులోనే పెట్టేస్తాడు. మర్చిపోతాడు. అవన్నీ పురావస్తు శిథిలాల్ని తవ్వి వెలికి తీయ్యడంలా రాజుకి ఓ తలనొప్పి. పైగా అతను జేబునిండా పాత సినిమా టికెట్లు, ప్రోగ్రాం కాగితాలు, ఎవరెవరో యిచ్చిన విజిటింగ్ కార్డులు, స్లిప్పులు, రకరకాల రశీదులు, ఎలక్ట్రిక్ బిల్లులు, లాండ్రీ చీటీలు వాటి మధ్య వెయింగ్ మిషన్‌మీద తూకం చూసుకున్నపుడు వచ్చే టిక్కెటు ముక్కలు భద్రంగా దాచుకుని తిరుగుతాడని రాజుకి కోపం. ఓసారి సీతారామారావు తూకం చూసుకుంటే వచ్చిన కార్డు వెనకాల 'మీరు స్త్రీ అయితే ఆదర్శ గృహిణి అవుతారు. మనసు కోమలం. మాట మెత్తన' అని వచ్చింది. రాజు అక్కడికక్కడే పడి పడీ విరగబడి నవ్వింది. 'ఎందుకలా నవ్వుతావు. నీకంత సరదాగా వుందా?' అని చిన్న చిరాకు ప్రదర్శించాడు. అతను ఉడుక్కున్న కొద్దీ దానిపొడుగునా 'సీతా మై డార్లింగ్' అనిరాజు తెగ వెక్కిరించింది. ఆమె అంత అల్లరిచేయగలదని అతననుకోలేదు. చేతులు గట్టిగా నొక్కి చిరునవ్వు నవ్వి తల దించుకున్నాడు.

ఓ రాత్రి ఆమె ఎక్కడో లోపల

పనిచేసుకుంటుంది. హఠాత్తుగా కరెంట్ పోయింది. అప్పుడు సీతారామారావు గదిలో డబల్‌కాట్ మీద బాసింపట్టు వేసుకుని కూర్చుని ఏమేమో ఆలోచించు కుంటున్నాడు.

సడన్‌గా రాజుకి 'మొక్కజొన్న తోటలో, ముసిరిన చీకట్లలో' అనే పాట ఎక్కడ్నుంచో చీకట్లో గాలిలో తేల్తూ వచ్చి పలకరించింది. ఎవరు పాడుతున్నారబ్బా అని విస్తుపోయింది. అప్పటికప్పుడు గజ్జెలుకట్టుకుని నృత్యం చేయాలని రాజు మనసు ఉరకలువేసింది. పాట పూర్తవగానే పరిగెత్తుకెళ్ళి రాజును గట్టిగా వాటేసుకుని ముద్దుల్తో ముంచెత్తింది. సీతారామారావు ఉక్కిరిబిక్కిరయాడు.

'పాడింది మీరేనా ?'

'అదంతా నీ భ్రమ'

'యూ సిల్లీ'

సీతారామారావు సిగ్గుపడిపోయాడు.

'మరో పాట పాడరూ ?'

'ఏం పాట ?'

'మీ కొచ్చింది'

'నువ్విలా వూపిరి సలపకుండా చేస్తే ఎలా ?'

'అయితే నేనిక్కడ్నుంచి వెళ్ళి పోనా'

'వూ'

రాజు అతన్ని వదిలేసి తలుపువెనక్కి వెళ్ళి నిలబడింది. అప్పుడామెకు 'మీపాట నా నోట పలకాలి చిలకా' వినిపించింది. రాజు నిలువెల్లా పరవశించిపోయింది. 'అహ్హా! కరెంటుకోత ఎంత మధురం?' అనుకుని మురిసింది. అడక్కుండానే మరో పాట అందుకున్నాడు_ 'ఆపలేనే ఎంకి యీ పడవ యిసురు, పాడతానే యెంకి పదమురళీ రొదలో' పాటమధ్యలో కరెంటు వచ్చేసింది. అతను ఆపేశాడు.

'ఎప్పుడూ పాడారు కారేం ?' అని కోపంగా చూస్తూ అలిగినట్లు అడిగింది.

'నాకు సిగ్గు రాజూ' అని తల దించుకున్నాడు. 'నాకో భర్త నిమ్మంటే నాకో పెళ్ళానిచ్చావేమిటి దేవుడా' అని ఆకాశం కేసి చేతులెత్తి నమస్కారం చేసింది.

చాలామంది సామాన్య స్త్రీలకు మల్లె రాజుకో అలవాటు. చదువుతూ చదువుతూ నేలమీదే ఓ పక్కకు ఒరిగి నిద్ర పోతుంది. పగలయినా రాత్రయినా పడుకునేందుకు వేరే ప్రయత్నమేమీ లేకుండా అలా ఎక్కడపడితే అక్కడ కటికనేల మీద గాఢంగా నిద్రలోకి వెళ్ళిపోతుంది. తెల్లారి చూసుకునేసరికి ఆవిడ హంస తూలికాతల్పంమీద శయనించిన రాకుమారిలా మంచంమీద వయ్యారంగా విశ్రమించి వుంటుంది.

'నేనిక్కడికెలా వచ్చానబ్బా?' అని కళ్ళు నులుముకుంటూ అడుగుతుంది.

'దేవతలు' అంటాడతను నవ్వుతూ.

'దేవతలకిదే పని ?'

అతను ప్రతి రాత్రీ తన్ను పొదివి

పట్టుకుని పూలగంపలా ఎత్తి మంచం మీద పండుకోబెట్టడం తలుచుకుంటే ఆమెకు తనువంతా పులకరించి మనసు మూర్ఛిల్లుతుంది. ఎంత ప్రేమ ? ఎంత జాగ్రత్త ?

కరంటుపోయి పాటలు పాడిన రాత్రి తను నేలమీద పరుచుకున్న పాటలా పవ్వళించినపుడు తెలవారుజామున లేచి చూసేసరికి అతను కూడా పాటకు పల్లవిలా పెనవేసుకుని తన పవిటచాటున మబ్బుల్లో చందమామలా దాక్కున్నాడు. అతనికేం కావాలో తనకు తెలీదు. ఏమిస్తే సరిపోతుంది ? చిన్నప్పుడెప్పుడో విన్న పాత పాట 'పాలకడలి శయన రారా' సన్నగా గుర్తుకొస్తోంది. రాజు కెందుకో వెచ్చటి కన్నీరు ....బుగ్గలమీంచి జారి జారి నల్లపూసల్ని తడుపుతోంది. జుట్టు లోకి చేతులు పోనిచ్చి తల గుండెలకు గట్టిగా అదుముకుంది.

ఉదయం లేస్తూనే 'నాకో కలొచ్చింది తెలుసా రాజూ' అన్నాడు.

'చెప్పండి సీతా' అంది గోముగా.

'ఆంజనేయులవారు నామీద కురికి జుట్టుపట్టుకు లాగి నా ముక్కు కొరికేసార్ట'

'వుహ్హూ— అయితే మెళకునేనన్న మాట'

'లేదు. సరస్వత్తోడు. నాకలా కలొచ్చింది రాజూ'

'వస్తాయ్ వస్తాయ్ కల్లోకి కోతుల్లా కొండముచ్చుల్లా—'

'నిఁః—నీమీదొట్టు'

'ఒట్లకేంలెండి. ఒట్టు తీసి గట్టున పెట్టండి.'

'కోపమా'

'నాకా కలొచ్చింది లెండి'

'చెప్పు చెప్పు'

'చెప్పు కాదులెండి కలే—'

'ఎంచక్కని కలొచ్చి వుంటుంది.'

'అంత చక్కని కలేం కాదులెండి. శ్రీకృష్ణమూర్తి కల్లో కొచ్చాడు'

'వాడా ? మీ మేనత్త కొడుకా ?'

'మేనత్త కొడుక్కాదు లెండి. అత్త కొడుకే—'

'మురళి వాయిస్తున్నాడా ?'

'అయితే చెప్పను'

'ఎందుకంత కోపం ? నీ కల్లో కెవడో వస్తే నాకేం భయం?'

'దేవుళ్ళని వాడూ వీడూ అనకండి, కళ్ళు పోతాయ్'

'సరే ఆ దేవుడొచ్చి—'

'కోరుకోమన్నాడు ?'

'ఏ వడిగావూ ? ఇంక్రిమెంటా ? ప్రమోషనా ?'

'ప్రమోషనే ?'

'నీకా ? నాకా ?'

'ఇద్దరికీ—'

'ఇద్దరికీ ఎల్లాయిస్తాడబ్బా ! ఇస్తే నీకే యిస్తాడు. లేడీస్ ఫస్ట్.'

'చెప్పుకోండి' .

'నాకు క్విజ్ పెట్టకు. తెలుసుగా ఓడిపోతానని_'

'తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించి....' రాజుకిలకిలా నవ్వింది. సీతారామారావు పట్టలేని ఆశ్చర్యంతో

'నాలుగూ వేదాల గొలుసులమరించీ_'

రాజు ముఖం చేత్తో కప్పుకుని అక్కడి నుంచి పారిపోతుండగా అతను చెంగు పట్టుకు లాగాడు. ఆవిడ బొంగరంలా తిరిగింది. అది వస్త్రాపహరణం సీన య్యేదే కాని సరిగ్గా అదే సమయానికి భీమశంకరంగారు లోపలికొచ్చి రిక్షా వాడ్ని బెడ్డింగూ గట్రా దింపమని 'ఒరేయ్ అయిదు రూపాయలకి చిల్లరుందా' అని గావుకేక పెట్టాడు.

పక్కలో నాటుబాంబు పేల్చినంత చప్పుడయేసరికి రసపట్టరమైన సీనులో డైరెక్టర్ కట్ చెప్పగానే హీరో హీరోయిన్లు విడిపోయినట్లు రాజూ సీతారామారావులు చెరొకరూ చెరో వైపుకి సర్దుకున్నారు.

'రండి రండి నాన్నారూ' అని సీతారామారావు చెప్పాపెట్టకుండా ఫిరంగి గుండు పేల్చినట్టు వూడిపడిన తండ్రిని చూసి గాబరాపడి చేతులు కట్టుకు నిలబడిపోయాడు ఉత్సవ విగ్రహంలా.

భీమశంకరంగారు 'చిల్లరుందా అని అడుగుతున్నాను' అన్నారు గట్టిగా.

ఈలోగా రాజు లోపల్నుంచి చిల్లర తెచ్చి మావగారి చేతికిచ్చి ఆయనివ్వబోయిన నోటును 'వుంచండి' అని వచ్చి భర్త వెనక నిలబడి మోచేతిమీద గిల్లింది. అతను వెళ్ళి సామాన్లు లోపలకు తెచ్చిపెట్టి_

'కాఫీ తాగి స్నానం చేస్తారా? స్నానం చేసి కాఫీ తాగుతారా?' అని అడిగాడు.

'కాఫీ తాగి గడ్డం చేసుకుంటాను' అన్నారాయన. ఇంతలో గుమ్మం ముందు పడ్డ పేపరును తెచ్చి తండ్రికిచ్చి క్షవర సామాగ్రి సిద్ధంచేయడంలో నిమగ్నుడయాడు పుత్రరత్నం.

కోడలు వుడుకుడుకు కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది.

'తెనాలి రామలింగడి పిల్లిలాంటి వాడ్నమ్మా నేను. చురుక్కున కాలే కాఫీ తాగతాను. వెనకటి కోసారి....!' అని ఓ హరికథ ఎత్తుకున్నారు ప్రిన్సిపాల్ అఫ్ ట్యుటోరియల్ కాలేజ్ ఇన్ ఆంధ్రా సర్దార్ భీమశంకరం.

సర్దార్ అనే బిరుదు ఆయనకు పూర్వం కుస్తీ పోటీల్లో వచ్చింది. బియ్యే ప్యాసయి ఉద్యోగం లేకుండా ఖాళీగా వున్న రోజుల్లో ఏమీ తోచక వొళ్ళు పెంచుదామని తాలింఖానాలో చేరాడు. అక్కడ ఉస్తాద్ అల్లీఖాన్ శిష్యరికం చేసి కుస్తీపోటీల్లో పాల్గొని వరసగా గెలిచినపుడు సర్దార్ భీమశంకరం అని అంతా అభిమానంగా పిల్చారు. ఆ



తర్వాత ఓ పెద్దమనిషి బియ్యే ప్యాసయి నీకీ కుస్తీపోటీ లేవిటి, ఓ ట్యుటోరియల్ కాలేజీ పెట్టుకో పిల్ల నిస్తానని సలహా యిచ్చాడు. తరవాత భీమశంకరం ట్యుటోరియల్ కాలేజీ స్థాపించి 'పెళ్ళి చేసుకుని' అన్నట్లు చల్లగా హాయిగా గడిపేశాడు. అయితే సర్దార్ భీమశంకరం గారికి చిల్లర సరదా లుండటంవలన ఆయనకు సరదాల భీమశంకరంగారని కూడా పేరొచ్చింది. రోజూ డబ్బెట్టి పేకాడాల్సిందే. సూర్యుడు యిలా గ్రుంకేసరికి సోడాకాయి పేలాల్సిందే,

మందుసీసా కార్కు తేవాలి, గ్లాసు నిండాలి. మాంచి సుష్టుగా భోంచేసి నిద్ర రోతారు. ఇప్పుడు చల్లారిన కాఫీ తాగుతూ గడ్డంచేసుకుంటూ 'ఆంధ్రమంత్రివర్గం విస్తరణ, రైల్వే మంత్రి రాజీనామా, అధ్యక్ష పరిపాలన గురించిన మీమాంస, బోటు ప్రమాదా'ల గురించి విట్లు విను ర్తూన్నప్పటికీ ఆయన ఎటువంటి పరిస్థితి లోనూ షేవింగ్ మానరు. గత నలభై ఏళ్ళు ప్రతి రోజూ ఉదయం ఆయన విధిగా ఆయన గడ్డం చేసితీరాల్సిందే. పాత ఫొటో లో ప్రకారం పూర్వం ఆయనకు కృష్ణశాస్త్రిగారి కున్నంత గిర జాల జుట్టుండేది ప్లస్ బుర్రమీసాలు. తండ్రి పోయాక వాట్ని తీసేసారు. ఆ తర్వాత తల్లి గతించేనాటికి జుట్టు కాస్త వూడిపోయి తలంతా రాగిసిబ్బిలా తయా రయింది. ఒకప్పుడు చాలా చిన్నప్పుడు సర్వీచెట్టులా వుండే మనిషి చింత మానులా అయాడు. ఒక్కడే కొడుకు. భార్య పోయాక అదుపులేక చీకటిపడితే దేవదాసే—

తండ్రి తన అలవాట్లకు బానిస. ఎక్కడికీ కదలడు. అలాటిది ఎందుకు వచ్చాడాఅని సీతారామారావుకి అనుమానం వచ్చింది. అతనికి తండ్రంటే చాలా భయం. పేకాడ్డం కూడా చేతకాని కొడుకుని చూస్తే అతనికి చిరాకు. పరమ అర్భకుడని జాలి. అందుకే గడ్డం చేసు కుంటూ—

'వీడు తిన్నగా వుంటున్నాడా అమ్మా'

సీతారామారావు కళ్ళతో రాజుని బతి మాలుతున్నాడు.

'కాస్త నయం'

'ఏరా' అని తీక్షణంగా చూసి 'మీ అమ్మ నిన్నిలా పెంచింది. ఫుట్ బాల్ ఆడ మంటే కాళ్ళు విరుగుతాయని, వాలీబాల్ ఆడితే చేతులు నొప్పులెడతాయనీ, బ్యాట్ మింటన్ ఆడితే ఆయాసం వస్తుందనీ ఎప్పుడూ వెధవ చదువు, వీడొత్తి పుస్త కాల పురుగు. మగాడన్నవాడు కరేజి యస్‌గా వుండాలి. లైఫ్‌ని ఛాలెంజిగా తీసుకోవాలి. ఉత్తమ చదువులవల్ల ఏవీ లాభంలేదు. తెలుస్తోందా ?' అని వురిమి నట్లు చూశారు.

భోజనాలయాక కాస్సేపు పేకాడదాం అని పార్టనర్లెవరూ లేకపోయేసరికి కొడుకునీ కోడల్నీ కూర్చోపెన్నారు. కట్ జోకర్ ఆట. సీతారామారావన్నీ తప్పు లాడేశాడు. భీమశంకరంగారు కొడుకుని చడామడా తిట్టి 'దాన్ని చూసి' చిన్నపిల్ల దాన్ని చూసి నేర్చుకోరా' అని ముక్కల్ని నేలకేసి కొట్టి, మళ్ళీ ఎత్తు కుని విసుక్కుంటూ ఆడి యిద్దరూ కవుంట్లిచ్చేశారు. రాజుకి మూడువందలు దాకా వచ్చింది. ఆమెకు చాలా సంతో షంగా వుంది. సీతారామారావు ముఖం ముడుచుకున్నాడు. తండ్రి తన మనసులో ఏదో పెట్టుకుని ఈ పేకాట పేరెట్టి తిడుతున్నా డనుకున్నాడు. కాని రాజే




శ్వరిని ఎందుకు పొగుడుతున్నాడో మాత్రం అర్థంకాలేదు. ఆమెకన్నీ ఛీర్స్! అన్నీ మెడల్స్! ఆఫీసరుద్యోగం చేస్తున్న కొడుకని కూడా కొంచెం గౌరవంలేదు' అనుకున్నాడు. మధ్యాహ్నం రాజు వేడివేడి పెసరట్లువేసి ఫలహారం పెట్టింది. పెసరట్లు అడిగి అడిగి వేయించుకుని తిన్నాడు తండ్రి. పెసరట్టుకు వంద చొప్పున అయిదు పెసరట్లకూ కోడలికి అయిదు వందలిచ్చి దాచుకోమన్నాడు. మొహమాట పడి వద్దనబోతే తిట్టినంత హడావిడి చేశాడు. తన తండ్రి మనసుకు ఎక్కడో ఏదో గాయం తగిలింది. అది ఏమిటో సీతారామారావుకి అర్థంకాలేదు. ఆయన ఏమన్నా ఏంచేసినా అడ్డుచెప్పవద్దని రాజు సంజ్ఞలు చేసింది.

ఎవరో ఓల్డు ఫ్రెండ్‌ని కలుస్తానని టక్ చేసుకుని సూటేసుకుని భీమశంకరం గారు యిద్దరికేసి కాస్సేపు తీక్షణంగా కాస్సేపు ఆపేక్షగా చూసి దగ్గరకు వచ్చి కొడుకు వీపుమీద తట్టి కోడలి తల నిమిరి సడెన్గా కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. రాజు బిత్తరపోయింది. తండ్రినిచూసి సీతారామారావు ఏడ్చేశాడు.

భీమశంకరంగారు 'డోంట్ వెయిట్ ఫర్ మి' అని ఆటోని పిలిచి వచ్చినంత హడావిడిగా వెళ్ళిపోయాడు. రాజేశ్వరీ సీతారామారావూ రాత్రంతా ముసలాయన కోసం ఎదురుచూస్తూనే వున్నారు. ఆయన లగేజి కేసి ఆపేక్షగా చూస్తూ ఏమయ్యారోనని విలవిల్లాడారు.

ఆ మర్నాడు ఉదయం కూడా రాలేదు. మధ్యాహ్నం దాకా చూశారు. పెద్దాయన

ఎందుకలా కళ్ళనీళ్ళు పెట్టుకుని వెళ్ళి పోయాడో అర్థంకాలేదు. మర్యాద లోపమూ౯సదుపాయాలు జరగవని రాలేదా అని భయపడ్డారు. ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడకుండా బిక్కమొహాలేసుకుని వున్నారు. అప్పుడో పెద్దమనిషి సన్నగా పొడుగ్గా జండా కొయ్యలా వున్నాయన కార్లో వచ్చి తన పేరు జగన్నాధవనీ, భీమశంకరం బెస్ట్ ఫ్రెండ్‌నని చెప్పి—'మీ నాన్నను రాత్రి విశాఖపట్నం పంపించేశాం' అని చల్లగా చెప్పాడు.

'ఏవిటేవిటన్నా'రిద్దరూ

'ఏమీ లేదు. మీరే కారణం ?'

హడలిపోయా రిద్దరూ ఏవిటా అపరాధవని. జగన్నాధంగారు ఖరీదైన పొడుగు సిగరెట్ ముట్టించి— మీ నాన్న విశాఖపట్నంలో ఎవరితోనో పందెం వేశాట్ట— ముందు మనవడు కలిగితే నాకు వెయ్యివ్వాలి నువ్వు, నీకు కలిగితే నేనిస్తానని. మీ పెళ్ళి పందిట్లో కాసిన పందెం ఓడిపోయాడ్ట. ఆ రాత్రి ఎక్కువగా తాగేసి మనవడు పుట్టలేదని బెంగెట్టేసుకుని రైలెక్కాడ్ట. ఆ ఓడిపోయిన కోపంలో ఏవేవో ఆటవస్తువులూ, చంటిపిల్లలకి పనికొచ్చేవి తెగ కొని పేక్ చేయించి తెచ్చాడ్ట. వాట్ని చూసైనా మీకు బుద్ధి వస్తుందేమోనని. యు అర్నాట్ అప్ టు హిజ్ ఎక్స్‌పెక్టేషన్. అందుకని మళ్ళీ నిన్నల్లా ఎక్కువ మందు పుచ్చుకుని, 'తాగి కోడలు ముఖం చూడలేను. తాగక కొడుకు ముఖం చూడలేను' అని రైలెక్కేశాడు. దటీజ్ ది స్టోరీ. విష్ యూ బెస్టాఫ్ లక్' అని ఆయన కారెక్కి వెళ్ళిపోయాడు.

సీతారామారావూ రాజూ ఒకరి ముఖం లోకి ఒకరు చూసుకున్నారు. ఇద్దరూ ఒకేసారి ఆ పేకేజీలు విప్పారు. అది పిల్లల ప్రపంచం. పిల్లల్ని పెంచడానికి కావలసిన వస్తువులన్నీ వున్నాయి. పిచ్చిగా కొనేశాడు. తాత కావడంలో యింత మోజుందా ?

సీతారామారావు రాజేశ్వరి భుజంమీద చేతులేసి 'రాజూ డాడీ చాలా ఓవర్ రియాక్ట్ అయాడు కదూ మనవడికోసం.'

రాజేశ్వరి మొట్టమొదటిసారి కళ్ళనీళ్ళు పెట్టుకుంది. అది విషాదమో ఆనందమో తెలియని స్థితి—

'టెలిగ్రాం యిద్దావండీ యిద్దరి పేర్లతో'

'ఏమని'

'బేబీ శంకరం వస్తున్నాడు బహుపరాక్—'

'కాదు బేబీ పార్వతి వస్తోంది హుషార్'

———

# సబ్బు



పులికంటి కృష్ణారెడ్డి

పంపునీటి స్నానమంటే పడిచస్తాడు రమణ!

రమణకు యిల్లు ఉంది. రమణకే గాదు- ఆ ఊళ్ళో అందరికీ యిండ్లు ఉన్నాయి. అయితే రమణయిల్లు మాత్రం ఆ ఊరంత! రమణ యింటితో పోలిస్తే ఆ ఊరంతా గోరంత !;-

ఆ యింట్లో తినడానికి- కూర్చుని కమ్మగా రేడియో వినడానికి- స్నానానికి పానానికి- నిద్రకు

1980 చక్రపాణి ప్రథమ అవార్డు పొందిన కథ

భద్రతకు వేరువేరుగా ఒకదానికంటె మరొకటి అందంగా- గదు లున్నాయి. అందులో స్నానాలగది అమరికలే వేరు. ఆ గదిలో నిర్భయంగా- ముచ్చటపడితే నగ్నంగా- తొట్టిస్నానంతో తనివితీర్చు కోవచ్చు. వానజల్లులాంటి పన్నీటిజల్లు పైన పడుతూంటే- ఆనందంతో పంకర్లు తిరిగిపోవచ్చు. ధారాపాతమైన కొళాయి నీటిక్రింద జలకాలాడవచ్చు!

అయితేవాడా పంపునీటి స్నానమంటే పడిచస్తాడు రమణ!

ఊరిముందర బావి ఉంది. అది నడ బావి. నడబావిలో పాతాళగంగ ఉంది. రెండు విద్యుత్ మోటార్లు ఒకదానితో ఒకటి పోటీపడి మూల్గుతూ మూలుగుతూ పాతాళగంగను పంపుద్వారా పైకి తెస్తాయి.

ఆ నీళ్ళంటే మహాయిష్టం రమణకు!

బావికి యిద్దరిని ఊరు ఉంది. అద్దరిని వాడ ఉంది. ఊరిలోను వాడలోను మనుష్యులే ఉన్నారు. మనుష్యులంతా ఒక్కటేనని మహాత్ముని అడుగుజాడల్లో నడిచిన మహాత్ములు గొంతెత్తి ఘోషిస్తూనే ఉన్నారు. అలాంటి మహాత్ముల్లో మహాత్ముడు ఆ గ్రామపంచాయతీ ప్రెసిడెంటు పెద్దిరెడ్డి. అప్పుడప్పుడు ఆ గ్రామపంచాయతీ కార్యాలయం ముందు ఆ మహాత్ముడు మీటింగులాంటిది జరిపి 'జనులేఁవిటి?... హరిజనులేఁవిటి?.... మనఁవంతా ఒకటి! జై బోలో మహాత్మాగాంధికి!-' అని గొంతు చించుకొంటూ ఉంటాడు. అప్పుడు అందరూ ఆకాశం బ్రాలిపడేటట్లు చప్పట్లు కొడతారు.

అయితే మాటలు మాటలే!- చేతలు చేతలే!

మాటకు చేతకు పొందు కుదరని రోజులివి!!-

అందుకే- ఊరిలోనివాళ్ళు జనులని, వాడలోనివాళ్ళు హరిజనులని వ్యవహరింపబడుతూనే ఉన్నారు.

జనులు నీళ్ళు త్రాగుతారు. హరిజనులు నీళ్ళు త్రాగుతారు. జనులు హరిజనులు కలిసి నడబావినీళ్ళే త్రాగుతారు. నడబావి పంపునీళ్ళు ఉరవళ్ళు పరవళ్ళు మీద పారుతూంటే పైనీళ్ళు జనులు త్రాగితే క్రిందినీళ్ళు హరిజనులు త్రాగుతారు. మాసిన గుడ్డల్ని పిండుకొంటుంటారు. కాయకష్టంతో చెమటోడ్చిన శరీరాలను కడుక్కొంటుంటారు.

పారేనీటికి అంటులేదని రాజీపడతాయి యిరుపక్షాలు!

ప్రతిరోజు ఆ ఊరి పడమటి దిక్కున ఒకానొక కొండకొన కొమ్మున నిలబడతాడు సూర్యుడు. పంపునీటి కాలువవైపు ఆశగా చూస్తూఉంటాడు. పడుచుదనం గడుసుదనంతో పరాచికా లాడుకొంటూ స్నానాలుచేస్తూ ఉంటుంది. తడిగుడ్డల్లోని సొగసుతోనేమో?- సూర్యుడు తన్మయుడై నిలబడిపోతాడు. అతని మొగం

అరుణరాగ రంజితమై ఉంటుంది. ఆనందం వెల్లివిరిసి పడమటి దిశనంతా ప్రభావితంచేస్తూ ఉంటుంది. వాడికి 'కర్మసాక్షి' అని ఎవరో నామకరణం చేశారు. ఎందుకలా చేశారో తెలియదు కానీ– నిజంగా వాడు కర్మసాక్షి అయి వుంటే– ఆ కాలువదగ్గరే చూపులు మళ్ళించేవాడు. అక్కడ ముడతలుపడిన దేహాలు.... వీపునంటుకొన్న కడుపులు... నిలబెట్టి కోసినా మందుకు రక్తపుచుక్క లేని శరీరాలు– చెమటను నీళ్ళతో కలుపుకొంటుంటాయి. ఈ దృశ్యమే వాడికంట పడివుంటే– నిజంగా ఆ నీళ్ళతో కన్నీళ్ళను కలిపేవాడేమో ?–

వాడికి ఆమాత్రం ఓపికలేకనేమో ?– గుటుక్కున గూట్లోపడతాడు.

పంపునీటి కాలువదగ్గర పడుచుదనం నిర్భయంగా జలకాలాడుకొంటుంది.

ఆ సమయం ఆడవాళ్ళకని కేటాయించబడింది. అందుకే ఆ సమయంలో ఓ మగపురుగు మెదలమన్నా మెదలదు.

రమణకు ఈ సంగతి తెలియదు.

ప్రెసిడెంటు పెద్దిరెడ్డి కొడుకు రమణ !– పెరిగింది మురిపాల మూటల సందుల్లో !– చదువుకొంటున్నది నాగరకత ఒళ్ళువిరుచుకొంటున్న పట్టణాల్లో– సాధారణంగా వేసవి సెలవులు గడిపేది నీలగిరి కొండల్లాంటి ఎత్తయిన కొండల్లో–

అందుకే– ఆ పల్లెలోని పంపునీటి కాలువ పరిస్థితి– ఆ గ్రామస్థులు అనుసరిస్తున్న పద్ధతి– రమణకు తెలియవు.

అనుకోనట్లుగా ఆ ఏడాది వేసవి సెలవులు గడపడానికి రమణ పల్లెలోనే దిగాడు. ప్రెసిడెంటు పెద్దిరెడ్డిగారి కొడుకు వేసవి సెలవులు గడపడానికి పల్లెకు రావడం– ఆ పల్లెకంతా సంబరం!

ఒకనాటి సాయంకాలం. వాహ్యాళికని బయలుదేరిన రమణ ఊరికి ఉత్తరంగా నిలబడ్డాడు. చుట్టూ కోతకు వచ్చిన పొలాలు. పైరుగాలి కలగాపులగంగా పరిమళాలు నింపుకొని రివ్వున వీస్తూ ఉంది శూన్యంవైపు. రకరకాల ఆకారాలతో మేఘాలు వినిర్మల నీలాకాశాన్ని 'కాన్వాస్'గా వాడుకొంటున్నాయి. ఊర్పిడికాలం. వెచ్చని తలపులతో రైతుల ఏలపాటలు విచ్చలవిడిగ వగలుపడుతున్నాయి. తోకలు పైకెత్తి ఆలమందలు పరుగుమీద యింటిముఖం పట్టాయి. పైకి లేచిన గోధూళి సంజవెలుగులతో కలిసి కుంకుమ వెదచల్లినట్లుంది. ఆనందానుభూతితో రమణ తాడువిప్పిన మేకపిల్లలా గంతులువేస్తున్నాడు.

సహజత్వం ఎప్పటికీ సహజంగానే ఉంటుంది. తెచ్చిపెట్టుకోవడం తెచ్చిపెట్టుకొన్నట్లుగానే ఉంటుంది.

రమణగుండె ఈ సత్యాన్ని యిప్పటికి గుర్తించగలిగింది!

పొద్దు గూట్లోపడింది. కనుచీకటి ఆవరిస్తూ ఉంది. రమణ తిరుగుముఖం

పట్టాడు. క్రొత్త అనుభూతుల్ని నింపు కొన్న మనసు- రమణను గనిమలమీద తైతక్కలాడిస్తూ ఉంది. పరుగులాంటి నడకతో అతడు పడుతూ లేస్తూ నడుస్తు న్నాడు.

ఆనందమే రూపమెత్తినట్లుగా పరవ శించి పరుగుతీస్తున్న రమణ- 'ఠకీ' మని ఆగిపోయాడు.

రమణ కండ్లు యింతింతలైనాయి. వింతగా చూస్తున్నాయి. గుండె దడదడ లాడుతూ ఉంది. తనకు తెలియకనే తనలో ఏదో వేడి ప్రవేశించింది. కాలు ముందుకు పడమన్నా పడలేదు.

ఎవరో ఓ సుందరి!- విరిసీవిరియని కుసుమం!!- పంపునీటి కాలువలో జలకా లాడుకొంటూ ఉంది నగ్నంగా!-

రమణ ప్రయత్నంమీద చూపుల్ని స్వాధీనంలోకి తెచ్చుకోగలిగాడు. ఒకక్క టంటే ఒక్క నిముషం చుట్టుక్ర్కల కలియచూశాడు. ఎవ్వరూ కనిపించలేదు. తేలికగా నిట్టూర్చి తీరికగా ఆ సుందరి వైపు దృష్టి మరల్చాడు.

ఊరకేవస్తే ఊరంతా నాదేనన్నారట!

ఊరిస్తున్న సొగసులు వారించేవాళ్ళు లేకపోయేసరికి- వయస్సులోని కళ్ళు జుర్రుకొంటున్నాయి అందినంతమేరకు!-

ఆ సుందరి- గొంతుక్కూర్చుంది నగ్నంగా!- మోవిని కాస్త పైకెత్తింది అందంగా! కండ్లుమూసుకొని ముంతతో నీళ్ళు ముంచి ముంచి పోసుకొంటూ ఉంది హాయిగా!

చీకటి చిక్కబడుతూ ఉంది.

అక్కడున్నది తానొక్కతేనన్న అభిప్రాయంలో ఆ సుందరి మునిగి ఉన్నది.

అందుకే పంపునీటి కాలువలో నిర్భ యంగా మునుగుతున్నది.

ముంతలో నీళ్ళు ముఖంమీదపడి- విశాల నేత్రాలతో వియ్యమంది- నును బుగ్గలపై జారి- వక్షస్థలితో వగలుపడి- కటిస్థలితో కబుర్లాడి- కాలువలో కలిసి పోతున్నాయి- చిలిపిగా!

'ఆ ముంతలో నీళ్ళుగా మారిపోతే?'

ఉన్నట్లుండి కలిగిన కోరికతో కొంకర్లుతిరిగిపోతున్నాడు రమణ.

'ఆడది ఒంటరిగా- అందులో నగ్నంగా స్నానంచేస్తూంటే చూడడం మహాపాతకం. ఇప్పుడు కాకపోయినా యిక కాసేపటికి ఆ అమ్మాయి కండ్లు తెరుస్తుంది. ఎదురుగా నువ్వుంటావ్! కసిరినా కసరవచ్చు. కాండ్రించి ఉమ్మినా ఉమ్మవచ్చు. లేదా- కదిలీమెదలేకుండా కుంగిపోవచ్చు. వెళ్ళిపో, ఆ పరిస్థితి ఎదురుగాకముందే వెళ్ళిపో!'- గుండెల కింది పొరల్లోనుండి ఏదో సందేశం గొంతులో కొట్లాడుతూ ఉంది.

'పాపమూ లేదు. పుణ్యమూ లేదు. మళ్ళీ మానవజన్మ - ఎవరు చూశారు. అందిన అవకాశాన్ని జారవిడుచుకోవడం

వైరిత్వనం.అనుభవించ గలిగినంతవరకు అనుభవించు.' కోరిక కాళ్ళకు సంకెళ్ళు వేస్తూ ఉంది.

విచిత్రమైన స్థితిలో యిరుక్కొన్నాడు రమణ!

తపస్విని లా కళ్ళుమూసుకొని—ముంతలో నీళ్ళుముంచుకొని— సావకాశంగా మొగాన కుమ్మరించుకుంటూనే ఉందా సుందరి!

నిడుపాటి వెంట్రుకలు నీళ్ళుపడడంతో చెదిరాయి. ఒంటిమీద పాయలు కట్టి పాలరాతిమీద జాలువారుతున్న నీలి నీటి సెలయేళ్ళలా భ్రమింపచేస్తున్నాయి. మోకాళ్ళను ముద్దిడుకుంటున్న చన్దోయి కన్దోయిని కవ్విస్తూ ఉంది.

తంబురకు తలను ఆనించి — భక్తి పారవశ్యంతో కనులు మూసి,రాగాలాపన చేస్తూ మోవిని పైకెత్తి మురళీకృష్ణుని కోసం తపిస్తున్న మీరానా? లేక అనుకోని రీతిగా ప్రాణంపోసుకున్న అజంతా శిల్పమా??

రమణ గుండె మాట్లాడేసరికి గొంతు 'ఓహ్' అనింది!

సుందరి అదిరిపడి కండ్లు తెరిచింది!

తాను కలలో గూడా ఊహించలేని పరిస్థితి. ఉలిక్కిపడింది. సిగ్గు—భయము—అసహ్యము— అన్నీ కలిసినా ఏమీచేయలేని నిస్సహాయస్థితిలో కండ్లుమూసుకొని వుంది. తల మోకాళ్ళ సందున అమాంతంగా తలదాచుకొనింది. రెండుచేతులు మోకాళ్ళను పొదివి పట్టుకొన్నాయి. తాకితే తల్లడిల్లుతూ ఒళ్ళు ముడుచుకొనే అంతర్దామరలా ఆ సుందరి క్షణక్షణానికీ ముడుచుకపోతూ ఉంది.

అయితే కండ్లు తెరిచిన ఆ ఒక్క క్షణంలోనే కనుపాపలు రమణను ఫోటో పట్టేశాయి!

ఓ మగవాడు తనని నగ్నంగా చూస్తున్నాడనుకొనేసరికి ఆ అమ్మాయి గిలగిలలాడిపోతూ ఉంది. అతని కంట పడనంత దూరం పరుగెత్తుకపోవాలని మనసు పరితపిస్తూ ఉంది.

చీరందుకోవాలి. కట్టుకోవాలి. ఆ తరువాతనే కదా పరుగెత్తాలి! ఎలా చేయాలి?— ఎటూ తెల్చుకోలేక కుప్పగా కూర్చున్న ఆ సుందరి కుతకుత ఉడికి పోతూ ఉంది.పంపునీటి కాలువలో నీళ్ళు గోర్వెచ్చనయ్యాయి.

ఇంచుమించు అదే స్థితిలో ఉన్నాడు రమణ!

అతడి నోరు తడబడుతూ ఉంది. ఏదో అడుగుదామన్న తపన. మాటలు దొరకడం లేదు. పెదవులు తడారి పోతున్నాయి. దొరకని మాటల్ని వెదుకుతూ తడారిపోతున్న పెదవుల్ని తడుపుకొంటూ మెలికలు తిరుగుతున్నాడు.

'ఎవ్వరీ అందాలరాశి! ఇంతటి ముగ్ధమోహన సౌందర్యం ఈ పల్లెటూళ్ళో ఎలా ఊడిపడింది- అడిగితే! ఎలా

అడగాలి ?! అయ్యో! యిప్పటికే తాను ఏమనుకుంటూందో ?'

రమణ నిట్టూరుస్తున్నాడు. పంపునీటి కాలువ పరసరాల్లో గాలి వేడెక్కింది. ఆ వేడి సుందరి తడిఒంటికి వెచ్చగా సోకుతూ ఉంది.

'ఛీ! ఏం పాడుమనిషో ? కాస్తయినా యింగితజ్ఞానం ఉండక్కర్లా ?? అలాగే నిలబడి మిడిగుడ్లతో మింగేసేటట్లు చూస్తున్నాడే! నోటి నిండుకు నీళ్ళుపోసు కొని తుపుక్కున ఉమ్మునా మన్నంత కోపం వచ్చిందా సుందరికి. అయినా కనుపాపల్లో పట్టేసిన ఫోటో 'నిజం చెప్పు! నా మొగం చూచి చెప్పు! నువ్వను కొన్నట్లు చేయగలవా ?' అని గుచ్చి గుచ్చి అడుగుతూ ఉంది.

అందానికి వయస్సుకు ఎప్పుడో ఒప్పందం కుదిరినట్లుంది. ఆ సుందరి అనుకొన్నట్లు చేయలేకపోయింది.

చీకటి చిక్కబడింది. ఆకాశంలో చుక్కలు మొలిచాయి.

పంపునీటి కాలువ దగ్గర పాటించ వలసిన నియమితకాలం దాటిపోతూ ఉంది. ఎవరో ఎద్దుల్ని అదిలిస్తూ అటు వస్తున్న శబ్దం చెవినిపడింది. ఉలిక్కి పడ్డాడు రమణ. ఆ దృశ్యం ఎవరికంట నయినా పడితే ? అమ్మో? ఇంకేమైనా ఉందా ? అసలే అవి పల్లెకొంపలు!

ఎద్దుల మెడల్లోని చిరుగంటల నాదాలు దగ్గరవుతున్నాయి. అడుగుమీద అడుగు పడినట్లుగా అకుసుల సవ్వడి ఆ జవ్వని చెవుల్లో పడింది. మెల్లగా కండ్లు తెరచి మోకాళ్ళ సందుల్లో నుండే చూచింది.

రమణ మెల్లగా ముందుకు కదిలి పోతున్నాడు.

చూడకూడ దనుకొంటూనే చూస్తూ ఉండిపోయిందా సుందరి. అతడు కను మరుగయ్యేసరికి ఎగిరిపడి లేచింది. ఆదరాబాదరా చీరందుకొని ఒంటికి చుట్టు కొనింది. లేడిపిల్లలా ఉరికింది_ రమణ మనస్సు మాత్రం పంపునీటి కాలువ దగ్గరే పడిగాపులు కాస్తుందే!

అనాటినుండే పంపునీటి స్నానమంటే పడిచస్తున్నాడు రమణ.

ఇంతకాలంగా రమణ నాలుగ్గోడల మధ్యనే కూర్చున్నాడు. పుస్తకాల దొంతర్లను ముందు పేర్చుకున్నాడు.అదే లోకం అనుకొన్నాడు. అయితే లోకంలో అంతకంటే తీయనైనది_ అనుభూతిని ఆనందాన్ని యివ్వగలిగేది_ మరేదో ఒకటి ఉందని అనుభవానికి వచ్చేసరికి అతడు నాలుగ్గోడల మధ్య యిమడలేక పోయాడు.

ఆ రాత్రి డాబామీద ఆరుబయట మంచం వేయించుకొన్నాడు. మెత్తటి పరుపుపైన తెల్లటి దుప్పటి_ వెల్లికలా పడుకొన్నాడు. మనసును పంపునీటి కాలువ దగ్గర వదిలివచ్చిన సంగతి అతనికి తెలియలేదు. మనసు లేని కట్టె

ఎంత ప్రయత్నించినా పడక పొందలేదు. లేచి కూర్చున్నాడు.

ఎదురుగా వయ్యారాలు పోతూ ఆ నగ్నసుందరి :

తూరుపు కొండల పైన రెండు బారల ఎత్తులో నిలబడి నెలవంక.... తోటలో విరిసిన మల్లెలు సుందర స్థాయిలో మాధుర్యం— పరిమళంతో రమణ పట్టు తప్పి పోతున్నాడు.

మెల్లగా పైకి లేచాడు రమణ. ఆ నగ్నసుందరిని అలానే నిలబెట్టి వెన్నెలతో పోటీపడగల తెల్లటిచీరను కట్టాడు. పట్టి నడిపించుకుని వచ్చి పట్టెమంచంపై ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. కురుల తడి ఆర్చాడు. మెడమీద కొస్త పదులుగా నిడుపాటి జడ అల్లాడు. ఆ నల్లటి జడలో తెల్లటి మల్లెలు తురిమాడు. చందమామతో పోటీపడుతున్న ముఖార విందములో కందిపప్పంత బొట్టు పెట్టాడు. లేచి నిలబడి— కొస్త వెనక్కి జరిగి— వివిధ కోణాల్లో మార్చి మార్చి ఆమె అందాన్ని విలోకించాడు.

ముగ్ధమోహనంగా వెలిగిపోతున్న ఆ సౌందర్యరాశిని వదిలిపెట్టలేక వాటేసుకొన్నాడు.

ఊహ ఎంత తీయనిది !

రెండు చేతుల మధ్య నలిగిపోతున్న దిండువైపు దీనంగా చూశాడు రమణ.

వాస్తవం ఎంత చేదుగా ఉంటుంది?—

ఆ రాత్రి రమణకు కంటిమీద రెప్ప పడలేదు.

అక్కడ వాడలో గుడిసె. గుడిసె ముందు కుక్కిమంచంలో తండ్రి. ప్రక్క నేలమీద చిరిగిన ఈతాకు చాప. చాప మీద అమ్మ. అమ్మ ప్రక్కన సుందరి. చంద్రుడు—చకోరాలు— మల్లెలు మల్లె ఆ— ఆ ప్రాంతానికే నిషిద్ధం.

"ఏంవే? అట్లా నసుగుతుండావ్? నిద్రగాని పట్టేదా?"— ప్రక్కలో నసుగుడు పోడపడలేక అమ్మ అడుగుతూ ఉంది కూతుర్ని.

"అమ్మా! అయ్య అవసరం నీకు లేదు. నీ అవసరం అయ్యకు లేదు. అందుకే ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నారు. కానీ ఎవరవసరం వాళ్ళదమ్మా."

'అవసరం' అవసరాన్ని గుర్తించిన ఎవరైనా ఎవరికైనా చెప్పదగిన సమాధానమేనుంది. అయితే ఈ దేశంలో తల్లికి కూతురు అలా చెప్పకూడదు.

అందుకే ఆ సుందరి నోరు విప్పలేదు. ఆమె కూడా మనిషే కాబట్టి ఊహలు తప్పలేదు.

ఆ సుందరి కనుపాపల్లో పట్టుకొన్న ఫోటోను తీసి ముందు పెట్టుకొంది. నొక్కునొక్కుల జుట్టు ... కొస దేలిన ముక్కు .. నవ్వితే సొట్టలుపడే బుగ్గలు అంత పొడుగూ అంత పొట్టీ కాని మితమయిన ఎత్తు—ఎంతఅందంగా ఉంటాడు?—అతని ముందే కదూ?— తనకు

తెలియకనే తన అంధాన్నంతా అర వేసింది!_ ఆ గడియ అలానే శాశ్వతమై పోతే ?_

'అమ్మో! ఎంతాశే నీకు? ఎర్రంగా బుర్రంగా ఉంటే మాత్రం అంతో యింతో సదువుకోమంటే కూడా_ జాతీ నీతీ మర్చిపోయ్యేదేనా ?_ జాగర్త.... మక్కెలిరగదన్నేస్తాం!" ఒక్కరు గాదు. ఇద్దరు గాదు. ఊరూరుగా తన మీద విరుచుకపడుతున్నారు.

'అమ్మో!'_ అని అరుస్తూ తల్లిని బల్లిలా కరుచుకొనిందా పిల్ల!

"ఏం పాడు కల్లో? ఏం పీడో! బిడ్డ బిత్తరపోతావుంది."

ఆ తల్లి మనసు తల్లడిల్లింది. ఆ పిల్లదాన్ని లేపి కూర్చోబెట్టింది. గుక్కెడు నీళ్ళు గొంతులో పోసింది. మళ్ళీ పడుకోబెట్టి అందీఅందని పాత దుప్పటిని అంతంత మాత్రంగా కప్పింది. పొరకను కాళ్ళదగ్గర పెట్టింది_ పాడు కలలు రాకూడదని!

అయినా ఆ సుందరికి ఆ రాత్రి పడక పొందితే ఒట్టు!

తెల్లవారింది. తెల్లవారింది మొదలు అనుకొంటూనే ఉందా సుందరి. అందరి కంటే ముందుగా కాలువకు వెళ్ళి రావాలని. అనుకొంటూ ఉండగానే పొద్దు కుంకింది. చీకటిపడుతూవుంది. కాలువకు వెళ్ళిన వాళ్ళు ఒకొక్కరుగా తిరిగి వస్తున్నారు. ఆ సుందరి కాలువకు బయలుదేరేసరికి పంపునీటి కాలువ దగ్గర పలుచబడింది. ఆమె అక్కడికి చేరేసరికి నిర్మానుష్యమయింది.

ఈ సంగతి ముందుగానే తెలిసినట్లు రమణకూడా అప్పుడే అక్కడికి వచ్చాడు.

ఆ సుందరి గొంతు కూర్చుంది_ నగ్నంగా మాత్రం కాదు. కూర్చుని ఓ బండమీద బట్టలు ఉతుకుతూ ఉంది. ఉతుకుతూ ఉందన్నమాటే కానీ_ ఊపిరంతా ఎక్కడో ఉంది. పనిమీదలేని కన్నులు తమ పని చేసుకొంటున్నాయి.

రమణ గుడ్డలు విడిచి కాలువగట్టున పెట్టాడు. కాలువలో దిగాడు. పంపు నీళ్ళు పడేచోట ఆడుకొంటున్నాడు. పట్టణంనుండి ప్రత్యేకించి తెచ్చుకొన్న సబ్బు విదేశీ సబ్బు!! కండబట్టిన ఒంటిపై పాకాడి నురుగుగా మారి కాలువలో తేలిపోతూ ఉంది. పరిమళాలు వెదజల్లుతూ ఉంది.

ఆ సుందరి అతడిని చూచీచూడనట్లు చూస్తూనే ఉంది. గుండెల్లో కూడ పలుకొక్కంటున్న కోరికల్ని గొంతులోనే అణచుకొంటూ ఉంది. అతడు గమనించనపుడు ఆ నురగను తీసుకొంటూ ఉంది. వాసన చూస్తూ ఉంది ఆశగా!_ మోచేతులకు పాదాలకు రుద్దుకొంటూ ఉంది అప్యాయంగా.

సబ్బు నురగతో ఆమె పొందుతున్న అనుభూతిని రమణ ఓ కంట గమనిస్తూనే



ఉన్నాడు. అందుకే ఆ కాలువనీటి నంతా సబ్బునురగమయం చేస్తున్నాడు. పంపు నీటితో అతడు పరాచికాలాడు తూంటే సబ్బు నురగతో ఆమె దోబూచు లాడుతూ ఉంది. ఆ పరిసరాలు యౌవన సౌరభంతో ఎగిరెగిరి పడుతున్నాయి.

రమణ స్నానం ముగించాడు. బట్టలు తొడుక్కొన్నాడు. అడుగుమీద అడుగ్గా ఆమెను సమీపిస్తున్నాడు.

ఆ సుందరి అతడి రాకను గమ నించింది. ఎగిరిపడి లేచింది. కాలికొద్దీ పరుగెత్తా లనుకొనింది. కానీ కాళ్ళాడ లేదు. ఎటూ కదల్లేక తలవంచుకొని నిలబడింది.

రమణ అల్లంతదూరంలో ఎదురుగా నిలబడ్డాడు. అంతసేపు చన్నీటిలో స్నానమాడినా అదో రకమైన వేడితో ఒళ్ళు కాలిపోతూ ఉంది. చిన్నగా తెప రాయించి గొంతు సర్దుకొన్నాడు. కొసరి కొసరి మాటల్ని కూడపలుక్కొన్నాడు.

"ఎవరమ్మా నువ్వు ?"

ఉలిక్కిపడింది సుందరి. ప్రెసిడెంట్ పెద్దిరెడ్డి కొడుకు అడుగుతున్నాడు. చెప్పడానికి సిగ్గు. చెప్పకపోవడానికి భయం. గుండెలు గుబగుబమంటున్నాయ్. ఎట్లో శక్తినంతా కూడదీసుకొనింది.

"రాముడి కూతుర్ని !" మాట పెగల లేక పెగిలింది.

"రాముడి కూతురివా ?" వత్తి పలి కాడు రమణ.

"అవును"

శ్రుతిచేసి ఉంచిన తంబుర. అంద మైన తంబుర. ఎవరో లయజ్ఞాన విహీనుడు మీటితే అపశ్రుతి పలికింది.

"పేరు ?"

"వరాలు"

రమణ తల దిమ్మెక్కిపోయింది.

'ఇది పల్లెటూరి సౌందర్యంకాదే !' అని ఆశ్చర్యపడిన రమణ ఆ అమ్మాయి మరీ అడుగంటిన జాతినుండి అని వినే సరికి మరింత ఆశ్చర్యపడ్డాడు.

వరాలు గమనిస్తూనే ఉంది.

ఆ మొంపటిరోజు అతగాడి కాలు కదలమన్నా కదలలేదు. ఆ రోజు కాలు

నిలదొక్కుకొన్నా నిలిచేటట్లుగా లేదు. ఎంతలో ఎంత మార్పు?

రమణ వెనక్కు తిరిగాడు. మెల్లగా ముందుకు సాగాడు.

వరాలు పెదవులు వంపులు తిరిగాయి. ఆ వంపుల సందుల్లో వచ్చీరాని ఓ చిరునవ్వు.

పిండిన బట్టల్ని ఓ బుట్టలో వేసుకొనింది వరాలు. బుట్టను తీసి చంకన వేసుకొనింది. వరాలు కూడా బయలు దేరింది. ఆ పూటకు వాళ్ళిద్దరు విడిపోయారు— రమణ ఊరివైపు—వరాలు వాడ వైపు!—

ఆ ముందటినాటి అనుభూతిల్ని పడపకివతల కావలిబెట్టి—తాను మాత్రం ఇంట్లో అడుగుపెట్టి— కంచంలో చేయి పెట్టినట్లు పెట్టి— గుట్టుగా డాబాపై కెక్కాడు రమణ. అదే పట్టెమంచము అదే మెత్తటి పరుపు.... అవే వెన్నెల వెలుగులు.... అవే మల్లెల మత్తులు— అయినా మనసు నిండా చీకటి! ఆగిన రైలెక్కడానికి అతురపడుతున్న ప్రయాణీకుల్లా తలను చుట్టి ఆలోచనలు. పడక పొందక లేచి కూర్చున్నాడు.

ఎదురుగా వరాలు!

గుద్దలు తుక్కొంటున్నట్లు ఉతుక్కొంటూ ఆదోగకంగా చూస్తూ ఉంది.

"ఎందుకమ్మా అలా చూస్తున్నావ్?"

"మీ రెందుకట్లా ఆలోచిస్తా ఉంటారు?"

"ఆలోచించడంలేదు. ఆవేదన పడుతున్నాను."

"ఎందుకో?"

"దేవు డెందుకిలా చేశాడా?— అని!"

"మనచేతగానితనాన్ని దేవుడి మీద రుద్దడం తప్పు కదూ?"

"మరి దీన్నేమనాలి?"

"ఏమనాలంటారు? దేవుడు బురదలో తామరల్ని పూయించడం లేదా? ముళ్ళ సందుల్లో గులాబీలను తొడిగించడం లేదా?— అవి పూజకు ఉపయోగింపబడడం లేదా?— మనుష్యుల మధ్య కులాల అడ్డుగోడల్ని దేవుడు కట్టలేదు. ఒకనాటి అవసరంతో వాటిని మనమే కట్టుకొన్నాం. అవసరం లేదనుకున్నప్పుడు పడగొట్టాలి! ఏం?— అనుకొంటే మీరాపని చేయలేరా?"— వరాలు నిలదీసి అడుగుతున్నట్లుంది.

"అవును. కొట్టాలి! దుమ్ముదుమ్ముగా పడగొట్టాలి!" ఆవేశంతో అంటున్నాడు.

"ఏంది సినయ్యా? ఏందో కొట్టాల గిట్టాలంటుండావే! ఎవుర్నబ్బా?"

ఉలిక్కిపడి ఈ లోకంలో పడ్డాడు రమణ.

ఎదురుగా పుల్లయ్యతాత. పాలగ్లాసు పట్టుకొని నిలబడి ఉన్నాడు.

"అన్నం కూడా సరిగ్గా తిన్లేదని అమ్మ అల్లాడిపోతావుంది. మణుసుండక తెచ్చినా! ఈ పాలట్లా గొంతులో

పోసుకో నాయినా!" బ్రతిమాలాడు పుల్లయ్య.

"అక్కడపెట్టిపో తాతా!"– పుల్ల విరిచినట్లనేసరికి పుల్లయ్యతాత గ్లాసు నక్కడపెట్టి వెళ్ళిపోయాడు.

రమణ పాలు త్రాగలేదు సరికదా – ఆ రాత్రి నిద్ర కూడ పోలేదు.

పొద్దు పుట్టింది. పుట్టిన పొద్దు కుంకింది. ఆ రోజు మాత్రమే కాదు. వరుసగా పది రోజులు– పొద్దు పుట్టింది. పుట్టిన పొద్దు కుంకింది.

ఈ పదిరోజులు సందకాడ సద్దు మణిగిన వేళ పంపునీటి కాలువదగ్గర పిళ్ళిద్దరి సందడే!– ఇద్దరి గుండెల్లో పెద్ద పెట్టున అలజడే!!–

పదకొండో రోజు కూడా తెల్లవారింది.

రమణ ఓ నిర్ణయానికి వచ్చేశాడు.

తన నిర్ణయంతో తండ్రి స్వయార్జితం అల్లుళ్ళపరం కావడం ఖాయమని తెలుసు.

అయినా అతడు విద్యార్థిగా వర్ణాంతర వివాహాలపై యిచ్చిన ఉపన్యాసాలు.... ఎందరో మహాత్ములు చేసిన త్యాగాలు అతన్ని ముందుకు నెట్టుతున్నాయి. తాను చదువుకొంటున్న కళాశాలలో ఓ హరిజన కుర్రవాడు, ఓ రెడ్డ అమ్మాయి కళ్లెదుటే పెళ్లిచేసుకొన్నారు. కాలేజీ కాలేజీగా అతడి నభినందించింది. ప్రభుత్వం పారితోషికమిచ్చి ప్రోత్సహించింది. చదువు పూర్తయితే ఉద్యోగావకాశాలా? సరేసరి!–

తన నిర్ణయాన్ని నిమిరి వదిలాడు రమణ.

పురులు విప్పి నాట్యమాడుతూ ఉంది నిర్ణయం గుండెల్లో!

ఆ రోజుకూడా పొద్దు కుంకింది. సద్దు మణిగింది.

పంపునీటి కాలువ యిద్దరి సందడితో సంబరాలుపోతూ ఉంది.

తన నిర్ణయాన్ని వరాలుచెవిని పడ వేద్దామని రమణతహతహపడుతున్నాడు. పంపునీటి కాలువ సబ్బు నురగతో మిసమిస లాడుతూ ఉంది.

అంతలోనే కూడపలుకొన్నట్టుగా ఊళ్లోనుండి కొంతమంది వాడలోనుండి కొంత మంది యువకులు అక్కడ ఊడిపడ్డారు.

రమణ వాళ్ళను చూచి ఉలిక్కిపడ్డాడు. రమణను చూస్తూన్నవాళ్ళు అందరూ ఒకరిమొగమొకరు చూచుకొంటున్నారు. వరాలు తన పని తన దన్నట్లుగా ఉంది.

జిల్లాస్థాయిలో కబాడీ పోటీలు మరో పదిరోజుల్లో నిర్వహింపబడపోతున్నాయి. ఊరిలోని వాడలోని యువజన సంఘ సభ్యులు ఆ పోటీలో పాల్గొనడానికి తయారవుతున్నారు. ఆడిన తరువాత స్నానమాడడానికి వచ్చారు. ఆడవాళ్ళ కోసం కేటాయించిన కాలం దాటి పోయింది కదా?–అని!

ఓ నిముషం కాలువ గట్టున నిలబడింది యువతరం.

ఏదో ముచ్చటపడి రమణ వేళకాని వేళ పంపునీటి స్నానానికి వస్తే పగటి పూట పని తీరక గుడ్డలు పిండుకోవడానికి వరాలు వచ్చి ఉంటుందని యువతరం చూపులతోనే సర్ది చెప్పుకొనింది. ఆ పై కేరింతలు కొడుతూ కాలువలో పడింది. పై నీళ్ళలో ఊళ్ళోవాళ్ళు పడితే కింది నీళ్ళల్లో వాడలోవాళ్ళు పడ్డారు. పంపు నీటి కాలవదగ్గర కోలాహలానికి కొదువ లేకపోయింది.

ఊళ్ళో యువకులు రమణతో కలశారు. సువాసనల్ని వెదజల్లుతున్న స బ్బు ను తెగ మెచ్చుకుంటున్నారు. ర మ ణ చేతుల్లోనుండి ఆ సబ్బును లాక్కొన్నారు. నిముషాలమీద చేతులు మారిపోతుందా సబ్బు. హుషారుగా పై నీళ్ళల్లో స్నానాలు సాగుతుంటే సబ్బు నురగ తెట్టెలుగట్టి జోరుగా తేలిపోతూ ఉంది.

దర్జాగా చూస్తూ నిలబడ్డాడు రమణ.

క్రింది నీళ్ళల్లో స్నానం చేస్తున్నదీ కుర్రవాళ్ళే!

ఆ కుర్రవాళ్ళు సబ్బునురగను రెండు చేతులతో జవురుకొంటున్నారు. తలకు ఒంటికి మార్చి మార్చి రుద్దుకొంటున్నారు. కొందరు దోసిటబట్టి ఊపిరి ఎగపీల్చి నంతవరకె గపీల్చి ఆ వాసనతో పరవశిస్తున్నారు. మెలికలు తిరిగిపోతున్నారు. సబ్బు రుద్దుకొంటున్న వాళ్ళవైపు అదే పనిగా చూస్తున్నారు. ఆచూపుల్లో ఆశ ఉంది. అభ్యర్థన ఉంది.అయితే గమనించే వాళ్ళెవరు?

అలవాటు మేరకు ఆ సబ్బు నురగను దోసిటబట్టింది వరాలు. వంచిన తల ఎత్తకుండానే ఒక కంట గమనిస్తూనే ఉంది– అక్కడ జరుగుతున్న జల క్రీడల్ని!

క్రింది నీళ్ళను చూచి పై నీళ్ళు వగలుపడుతూ వళ్ళు విరుచుకొంటున్నాయి. ఒళ్ళు విరుచుకొంటూ పగలబడి నవ్వుతూన్నాయి– నురుగులు కక్కుతూ!

దోసిటబట్టిన సబ్బునురగను విసిరి నీళ్ళల్లో కొట్టింది వరాలు!

వాడలోని యువకులు తమ ఆశల్ని ఆ నీళ్ళల్లోనే కలిపారు. కలిసికట్టుగా కాలువ పక్కన పుట్టమీద పడ్డారు. తలా పిడికెడు మట్టినందుకున్నారు. పై నీళ్ళల్లో పరిమళాలు పోయే సబ్బు!– క్రింది నీళ్ళల్లో పనికిరాని పుట్టమట్టి!! –

యువకులు స్నానాలు ముగించారు!

ఊళ్ళోని యువకులు పరిమళాలు పోయే సబ్బుతో!– వాడలోని యువకులు ప్రకృతి ప్రసాదించిన పుట్టమట్టితో!– ఆ తరువాత వాళ్ళు విడిపోయారు. ఊళ్ళోనివాళ్ళు ఊరివైపు, వాడలోనివాళ్ళు వాడవైపు.




ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్న రమణ గొంతు సర్దుకొన్నాడు.

"వరాలూ నిన్ను నేను పెళ్ళాడుతాను"

ఆమాట చెవిన పడడంతో ఒక్కసారి తల పైకెత్తింది వరాలు. ఒక్క చూపు విసిరింది వరాలు. నరనరాలను తాకిందా చూపు.

"ఎందుకలా చూస్తున్నావ్ ?" సందేహంగా అడిగాడు రమణ.

"చూడల్సినట్లు చేశారు కాబట్టి చూస్తున్నా !"

"నేనేం చేశాను ?"

"ఎవరు చేసింది వాళ్ళకు తెలిస్తే ఏ బెడదా ఉండేది కాదు."

ఇదో! అడ్డమాటలు మాని అడిగిందానికి బదులు చెప్పు."

అసహనం అడుగుపెడుతూ ఉంది రమణ మాటల్లో. తెగేదాకా లాగకూడదనుకొంది వరాలు. సూటిగా అడగడానికే తలపడింది.

"అక్కడ పోతుందేవాళ్ళెవరు?"

"ఊళ్ళోవాళ్ళు."

"ఇదో యిటుపోతూండే వాళ్ళెవరు?"

"వాడలోవాళ్ళు"

"వాళ్ళూ వీళ్ళూ అందరూ మనుషులే గదా ?"

"అవును."

"అయితే వాళ్ళకిచ్చిన సబ్బు వీళ్ళ కెందు కివ్వలేకపోయారు ?"

"వాళ్ళడగ లేదు కాబట్టి !"

"అడుక్కోవడమంటే చుట్టె త్తు కోవడం బాబూ ! కాయకష్టం జేసి బతికే జన్మాలు మష్టికిష్టపడవు."

"అంటే ?"

"అంటేనా బాబూ ! మణుసులంతా ఒకటే అయితే గూడా కొందరికి లాక్కొనే సొతంత్రం వుంటే— మరి కొందరికి అడుక్కొనే అర్హత గూడా ఉండదు బాబూ."

"ఆఁ !"

"అవును బాబూ ! వాడలోని కుర్రాళ్ళ తపన గమనించారా మీరు ?— ఎంగిలి మెతుకులకోసం ఎగబడే కుక్కల్లా మీ ఒంటిమీద నుండి జారిపడిన సబ్బునురగ కోసం ఎలా ఎగబడ్డారో వాళ్ళు. అసలు మీరెక్కడ చూడగలుగుతార్లే ?— ఈ వారం పదిరోజులనుండి తమరుచూస్తూనే వున్నారు. ఆ సబ్బునురగతో నే నెంత సంబరపడిపోయానో ? అయినా ఒక్క నాడైనా 'ఇదో ! యిందమ్మ సబ్బు ! ఆ నురగతోనే ఎందుకట్లా సతమతమై పోతావ్ ?' అని మనసారా ఒక్కమాటన లేకపోయారు. ఈ మాత్రం గుండెలేని మనిషి పెండ్లిచేసుకొంటాడా బాబూ పెండ్లి !"

వరాలు వశం తప్పింది.

రమణ తల దిమ్మెక్కిపోయింది.

ఓ సబ్బునురగ తెట్టె !— గడ్డిపోచ అడ్డుపడితే అంతవరకు ఆగి ఉండింది. అప్పుడు ముందుకు సాగింది. నీటిపైన తేలిపోతూ ఉంది. అలా అలలమీద తేలిపోతూ పోతూ కొద్దికొద్దిగా కరు గుతూ పూర్తిగా నీళ్ళల్లో కలిసిపోతూ ఉంది.

"అసలు మీ మనసుల్లో మురికి తర తరాలుగా పేరకపోయింది. ఆ మురికిని కడగాలంటే ఈ సబ్బులు పనికిరావు. మనసుల్ని కడిగే సబ్బులు తయారు కావాల. దీనికింకా చాలా కాలం పడు తుంది బాబూ ! చాలాకాలం పడుతుంది !"

ఒక్క క్షణం ఆగింది వరాలు.

మరొక్క క్షణం వాళ్ళిద్దరి మధ్య మౌనం.

"అంతవరకు ఎదురుచూచే ఓపికుం టుందా బాబూ ?"

ఎత్తిపొడిచింది వరాలు.

రమణ తల వాలింది ?

ఒక్క ఊపులో తడిబట్టల బుట్టను చంకన వేసుకొని వరాలు వాడ వైపు సాగింది !!

— ——



# నాకు నచ్చిన నా కథ

దాదాపు 20 సంవత్సరాల క్రిందట।

అప్పుడు నాకు గ్లామర్, పేరు, ప్రతిష్ట అంటే ఏమిటో తెలియవు। నవలలు వ్రాయటం అస్సలు చాతకాదు। సరదాగా, ఎప్పుడో బుద్ధిపుట్టినప్పుడు, ఒక కథ వ్రాస్తూ వుండేదాన్ని। అది వ్రాసిన వెంటనే ఆంధ్రపత్రిక వారపత్రికకు పంపుతూ వుండేదాన్ని. ఇంకే పత్రిక అడ్రస్ నాకు తెలియదు. తెలుసుకోవాలనే కుతూహలమూ వుండేది కాదు. నేను పంపిన వెంటనే నా కథ ప్రచురితం అయేది. 'ఐ లవ్ యూ', 'నాకీ అదృష్టం చాలు', 'పెళ్లి ప్రయాణం', 'అమూల్య'. ఇవన్నీ అప్పుడు వ్రాసిన కథలే।

'అమూల్య' కథ పడినప్పుడు, ఆంధ్రపత్రిక యాజమాన్యంవారు నాకు రెండు ఉత్తరాలు పంపించారు. ఆ వ్రాసినవారి పేర్లు నాకు గుర్తులేవు. కానీ, ఆ రోజున నేను పొందిన ఆనందం మాత్రం యిప్పటికీ గుర్తుంది. నా కథ బాగుంది

అంటూ వచ్చిన ఆ ఉత్తరాలు చూడగానే, నేను కీర్తి కిరీటం ధరించిన మహారాణిలా గర్వపడ్డాను. హిమాలయాన్ని ఒంటరిగా జయించిన విజేతలా యీ లోకాన్ని చూసాను.

రచనా వ్యాసంగంలో ప్రతి పది సంవత్సరాలకీ కొత్త తరం వస్తుందీ అంటారు. ఈ కొత్త తరం ఒరవడిలో, కొన్ని నవలలు, కథలు, కాలం నీడ పడి, రూపులేకుండా - గుర్తింపులేకుండా మాసిపోతాయి. ఈ కథలు రెండు దశాబ్దాలు దాటినా ఇంకా పాఠకులకి, పబ్లిషర్స్‌కి అభిమాన కథలుగా వుండటం కేవలం నా అదృష్టం అనుకుంటాను.

ఈ రోజున —

ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే, జీవితంలో నేను ఎంతో ఎదిగాను అన్పిస్తుంది. ఈ రచనా వ్యాసంగమే నన్ను యింత ఎత్తుకి పెంచింది. నాకు ఈనాడు కారు, ఫోను, సెక్రటరీ, పేరు, ప్రతిష్ట, గ్లామరు, సాహిత్య ఎకాడమి బహుమతులు, నవలలు సినిమాగా వచ్చిన, శతదినోత్సవ సంరంభాల వేడుకలు, ఎన్నెన్నో నేను వూహించనివి, ఆశపడనివి, కలలు కననివి ఈ రచనా వ్యాసంగం నాకు ప్రసాదించింది. ఇది కేవలం పూర్వజన్మ పుణ్యమేమో అనిపిస్తుంది. నే నెక్కువ చదువుకోలేదు. అయినా మనుష్యుల్ని, జీవితాల్ని సులభంగా చదివే టెక్నిక్ నాకు అలవడింది. ఈ రోజున రచన అనేది నాకు ఒక సరదా కాదు. ప్రాణం పణంగా పెట్టి పనిచేయాల్సిన ప్రొఫెషన్. నా జీవితంలో మూడువంతులు పైగా అల్లుకుపోయింది. చుట్టాల్ని, స్నేహితుల్ని, చివరికి నా భర్తని, నా కూతురుని కూడా, తన తర్వాతనే నిలబడాలి అంటుంది.

ఇదంతా బాగానే వుంది.

ఒక్కసారి, ఈనాడు, ఇన్ని సంవత్సరాలలో, నేను వ్రాసిన కథల్లో నాకు నచ్చిన కథేమిటి అని పరిశీలించుకుంటే, 20 సంవత్సరాల క్రితం అనుభవం లేని, లేతవయసులో వ్రాసిన ఈ 'అమూల్య' కథే నాకు నచ్చుతోంది. ఎందుకంటే, నిష్పక్షపాతంగా చెప్పాలంటే, ఈ కథ వ్రాయటంలో ఒక అందమైన భావశైలి ఉంది. విషయం చెప్పటంలో ముగ్ధత్వం ఉంది. భాషలో నాజూకుతనం వుంది. రచనని నడిపే భావోద్వేగంలో నిజాయితీ వుంది. ఇప్పుడు నేను వ్రాసే కథల్లో - నవలల్లో యివి వున్నాయా? జీవితంలో ఎదగగలిగిన నేను, రచనా వ్యాసంగంలో కూడా అంతగా ఎదగగలిగానా? ఆలోచనలో పడ్డాను నేను.

— *యద్దనపూడి సులోచనారాణి*

# అమూల్య

పెద్ద హాలు. హాలునిండా ఆడవాళ్ళు. హాలుకి మధ్యగా రంగురంగు దీపాలతో పూలగుత్తి అమర్చబడ్డ తోరణం. ఆ తోరణం నుంచి ప్రసరిస్తున్న రంగు రంగుల కాంతులు హాలుని ఇంద్రధనస్సులో ఉన్నట్లు చూపుతున్నాయి. హాలు నిండా వరసల ప్రకారం అమర్చివేసిన కుర్చీలు, వాటికి దూరంగా కుడివైపు గోడ వారగా కొన్ని బెంచీలు కలిపివేసి వాటిమీద తివాసీలు పరిచి తాత్కాలికంగా ఏర్పరచిన చిన స్టేజీ. స్టేజీమీద ప్రపంచం అంతా మునిగిపోయినట్లు మొహం ముడుచుకుని కూర్చున్న ఓ పసిమొహం. స్టేజీమీద హాలులో హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్న ఆడవాళ్ళలో ఆ చిన్నపాపని యెవరూ పట్టించుకున్నట్లు లేరు. చాలామంది వరుసగా వేసిన కుర్చీలని వదిలేసి చిన్న చిన్న గుంపులుగా చేరి యేవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దరు, ముగ్గురు ఆంగ్లో ఇండియన్స్ కాబోలు, భుజాలులేని గౌన్లతో ఓ పక్కగా కుర్చీలో కూర్చుని వచ్చే పోయే వారినీ హాలునీ స్టేజీమీదున్న పాపనీ కలయచూస్తున్నారు. కొంతమంది పలహా రాలు వాటికి కాబోలు ఎడంపైపుగా వున్న గది గుమ్మంలోంచి లోపలకు వెళ్ళి తిరిగి వస్తున్నారు. ఆ తిరిగివస్తున్నవారికి గుమ్మందగ్గర రక్షకభటుల్లా నిటారుగా నిలబడ్డ ఇద్దరు పొడుగాటి సన్నటి అమ్మాయిలు కిళ్ళీలు, ఏవో పేపరు పొట్లాలు అందిస్తున్నారు. అంతా ఆడవాళ్ళే! ఒక్క మగపురుగు లేదు. కొంత మంది చిన్నపిల్లల్ని తప్పిస్తే మొత్తానికి హైదరాబాదులో అన్ని రకాల జాతు లకు, కోవలకు చెందిన ఆడవాళ్ళందరూ దాదాపుగా ఇక్కడ కన్పిస్తూనే ఉన్నారు. యింతమంది ఆడవాళ్ళని ఒకచోట తన జీవితంలో ప్రప్రథమంగా చూస్తున్న వాసంతి ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసుకొని చూస్తోంది. ఒక్క తలలే చూస్తే ఎన్నిరకాలో - తట్టంత చుట్టలు చుట్టి వాటిమీద బుట్టెడు పూలు పెట్టినవాళ్ళు కొంతమంది అయితే, కొంతమంది అసలు జడే వేసుకోనట్లు భుజాల సగభాగందాకా వదిలేసి అక్కడ్నుంచి రెండల్లులు అల్లినట్లున్నారు. ఇంకా కొంతమంది పీచుల్లావున్న రెండు జడలు వేసుకున్నారు.

కొంతమంది చక్కగా పొడుగాటి జడలు వేసుకొని వాటిపైన నాగరం, చంద్రవంకలాంటివి పెట్టుకుని చివరలు కుప్పెలు వేసుకున్నారు. ఇంకా కొంత మంది నడినెత్తిమీదికి రిబ్బన్ పువ్వులా వచ్చేటట్లు అదేదో అజంతా బొమ్మల్లా ముడేసుకున్నారు. జుట్టుని ఎన్ని రకాల అలంకరించుకోవచ్చో వాసంతికి తెలిసి

పోయింది. ఒక్క జుట్టే కాదు. బట్టలు, బొట్టు, గాజులు యెంత నాజూకుగా, యెంత సహజంగా అలంకరించుకోవచ్చో వాసంతికి మొదటిసారిగా అర్థమైంది. జుట్టు, కట్టు, బొట్టు - ఈ మూడింటికోసం ఆడవాళ్ళు ఎన్నిరకాలు కావాలను కుంటారో, ఎంత తాపత్రయపడతారో అన్పిస్తుంది. వీళ్ళని చూస్తుంటే ఎంతైనా పుట్టినరోజు ఇంత హడావుడా, చిన్న పెళ్ళిచేసినంత. పుట్టినరోజే ఇంత వైభవంగా చేస్తుంటే ఇహ పెళ్ళికి యెంత హడావుడి పడతారో! బందరు దగ్గిర ఓ పక్కా పల్లెటూరులో పుట్టిన వాసంతికి ఇదంతా కొంచెం విచిత్రంగానే ఉంది. స్టేజీమీదవున్న పాపకి అందరూ యేవో బహుమతులు తీసుకెళ్ళి ఇస్తున్నారు. ఆ పాపకి పక్కగా, వంటినిండా ధగధగ మెరిసే రాళ్ళనెక్లెస్‌తో, ఎట్టెడు వెడల్పుగల జరీఅంచు పట్టుచీరెతో గట్టిగా బిగించినట్లున్న ఓ స్థూలపాటి వయసుమళ్ళిన సువాసిని బహుమతులు తెస్తున్నవాళ్ళను వాడిచూపులు మాస్తూ నఖశిఖ పర్యంతం పరిశీలిస్తోంది. ఆవిడ ప్రక్కగా నిలబడ్డ ఓ ఖద్దరు చీర ఆవిడ తెచ్చినవాళ్ళు ఇచ్చిన బహుమతులన్నీ జాగ్రత్తగా ఓ ప్రక్కగా పెడుతోంది. ఆలస్యంగా వచ్చి హాలులో వున్న ఆడవాళ్ళని చూచి అలాగే గుమ్మందగ్గిర నిలబడిపోయిన వాసంతి చేతిలోవున్న వెండిసోప్‌బాక్స్ ఒకసారి తడిమి చూచుకుంది. ఎలా ఈ మహాసముద్రంలో ప్రవేశించి డాక్టరుగారి భార్య సుకన్యాదేవి యెక్కడుందో వెతికి పట్టుకోవటం? అసలిలా నలుగురిలోకి రావటం అంటేనే వాసంతికి భయం. ఏదో వ్యక్తిత్వం పోగొట్టుకున్నట్లు తనకేం లేనట్లు జాలిగా, దీనంగా అన్పిస్తుంది. అందులోనూ యిలా వంటరిగా ప్రక్కన శేఖరం లేకుండా రావటం వాసంతికి ఇదే మొదటిసారి. అతను పక్కనే ఉంటే ఫర్వాలేదు. తనవి అతనివి అన్ని జవాబులూ తనే చెప్పుకుంటాడు తనుమటుకు అన్నిటికీ సమాధానంగా చిన్నగా నవ్వుతూ ఉంటుంది. అందుకే అసలు ఇక్కడికి గూడా వెళ్ళనంటే 'కాదు, కూడదు వెళ్ళి తీరాలి' అన్నాడు. రెండురోజుల క్రితం క్యాంపువెళుతూ జీపులో కూర్చుని బయలుదేరబోతూ కూడా మరోసారి డాక్టరింటికి పుట్టినరోజుకి తప్పకుండా వెళ్ళిరమ్మని హెచ్చరించాడు. అక్కడికీ తను ఆలస్యంగానే వచ్చింది-ఇప్పటికి చాలా హడావుడి తగ్గిపోయి ఉంటుంది. సుకన్యాదేవి వెంటనే కన్పిస్తుందేమోనని, అయినా అసలు ఇంతమంది వస్తారని తనకేం తెలుసు? లోపలికి వెళ్ళాలంటే ఏదో భయం వేస్తోంది. ఎలా- ఏవో ఆలోచనలతో పరధ్యానంగా నిలబడ్డ వాసంతి "అదేమిటి అలా గుమ్మందగ్గర నిలబడిపోయావేం? లోపలికి రా, రా! ఎంత

సేపయింది వచ్చి? శేఖరం క్యాంపునుంచి రాలేదూ?" అంటూ సుకన్యాదేవి భుజంపట్టి పలకరించటంతో ఉలిక్కిపడింది. ఆ వెంటనే తన్ని తను తమాయించుకుంటూ "అబ్బే లేదండీ! ఇప్పుడే వచ్చాను. మీకోసమే చూస్తున్నాను," అంది. చప్పున కళ్ళు చేతిలోవున్న సోప్‌బాక్స్‌మీద వాల్చుకుంటూ 'ఛీ! ఛీ! ఇలా గుమ్మందగ్గర నిలబడి ఉండకూడదు. కాస్తంత ధైర్యంచేసుకుని లోపలికి వెళ్ళి కూర్చుంటే బాగుండేది' అనుకుంటూ "మంచిదానివే! నయం. నే వెంటనే చూశాను కాబట్టి సరిపోయింది. అసలు చూడకనే పోదునే మా అక్కయ్య కూతురు వచ్చి 'గుమ్మందగ్గర పాలరాతిబొమ్మలా నిలబడ్డ ఆ అమ్మాయి ఎవరు పిన్నీ!' అంటే తిరిగి చూశాను" సుకన్యాదేవి నవ్వుతూ వాసంతిని చేయిపట్టి తీసుకొచ్చి ముందు వసారాలో ఉన్న ఓ కుర్చీలో కూర్చోబెట్టింది. అవిడింక ఏదో చెప్తూండగా "వెళుతున్నానండీ" అంటూ ఎవరో రావటంవల్ల వాసంతిని "కూర్చో వస్తానని" వెళ్ళిపోయింది.

క్షణంలో వచ్చిన వ్యక్తిత్వం మళ్ళీ పోయినట్లనిపించింది వాసంతికి. ఎవరూ మాట్లాడేవాళ్ళు లేరు. పైపెచ్చు దూరంగా కూర్చున్న యిద్దరు ముగ్గురు నైలాన్ చీర అమ్మాయిలు ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వాసంతిని తిరిగి తిరిగి చూచి వాళ్ళలో వాళ్ళు ఏమిటో చెప్పుకుంటున్నారు. వాళ్ళు చెప్పుకునేదేమిటో వాసంతికి వినిపించటంలేదు. ఒకవేళ తనిలా కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తుందని, వెర్రిమొహంలా ఉంది. తెలుస్తూనే ఉందని అనుకుంటున్నారేమో' వాసంతి కళ్ళు వాల్చుకుని చీరవంక చూసుకుంది. తెల్లటి పాలనురుగులాటి చీరె. ఈ చీరంటే శేఖరానికి చాలా యిష్టం. శేఖరం గుర్తుకొచ్చేసరికి వాసంతికి మొహంలో భయం, బెరుకుదనం పోయి ఉల్లాసం వచ్చింది. క్యాంపులో ఈ సమయానికి ఏంచేస్తున్నాడో? ఆఫీసులో అతను చాలా గంభీరంగా వుంటాడట! అందరూ భయపడతారని, మళ్ళీ యెవర్నీ ఏమీ అనడని చెప్తాడు రాజు.

ఎక్కడి తను! ఎక్కడ శేఖరం! అదృష్టం అంటే ఇదే కాబోలు. "మీ అయనంటే సామాన్యం కాదమ్మాయోయ్! పెళ్ళికాని ఆడపిల్లల గుండెల్లో మెరుపు. పెళ్ళయిన ఆడపిల్లల గుండెల్లో నిట్టూర్పు." శేఖరంతో తనపెళ్ళి స్థిరపడింతర్వాత తనని పెళ్ళికూతుర్ని చేసినప్పుడు కొత్తబట్టలతో ఆశీర్వాదం కోసం నమస్కరించడానికి వెళ్ళినప్పుడు అన్న మామయ్య మాటలు తనెలా మర్చిపోతుంది? అప్పుడే అక్కడే నిలబడ్డ అక్కయ్య "ఇహ అందరి గుండెల్లోనూ నిట్టూర్పే మామయ్యా! ఒక వాసంతి మొహంలోనే మెరుపు

అతను" అన్నది. ఆ రోజు అవేవో తమాషా మాటలనుకుంది. కానీ యెంత నిజం. కానీ చిత్రం. అన్ని విధాలా వున్న అతను తనలో ఏం చూశాడో! చూసేందుకు ఏముంది? అదృష్టం దయతలచి తన ప్రక్కన నిలబడింది. అయితే-యిదే మాటను తను ఓసారి అంటే అతను "లేదు వాసంతీ! నీలో నేను చాలా చూశాను. ఏం చూశావో చెప్పమని అడగకు. ఒకప్పుడు నాలో ఉండి ప్రస్తుతం పోగొట్టుకున్నదంతా నీలో చూశాను" అన్నాడు. తన కారోజు, ఆ క్షణం చాలా బాగా గుర్తుంది. ఆరోజు ఆదివారం. రాజేంద్రనగర్‌లో కిద్వాయి గార్డెన్ కాటేజ్ రిజర్వ్‌చేయించుకున్నారు. ఎప్పుడోగాని శేఖరానికి అంత తీరిక దొరకదు. ఆ రాత్రి యెంత బాగుంది. కాటేజ్ ప్రక్కనున్న పచ్చగడ్డి మంచుతో తడిసి కొద్దిగా చల్లగా ఉంది. తెల్లటి వెన్నెల స్వచ్ఛమైన మనస్సులా ....చుట్టుప్రక్కల శబ్దమే లేదు. కొంచెం దూరంలో వున్న చెవులపిల్లుల గడ్డి కొరికే పరపర చప్పుడు తప్ప. కాటేజి మధ్యగా శబ్దంచేస్తూ దొర్లే నీళ్ళు. వెన్నెట్లో పచ్చగడ్డిమీద శేఖరం జేబురుమాలు వేసుకుని కూర్చున్న తను, తన ఒళ్ళో శేఖరం తల, యెన్ని యుగాల అనుభవం కలిగింది తనకి. అలా యెన్నికోట్ల సంవత్సరాలు బ్రతికితేమటుకు విసుగొస్తుందా? కాలం నిల్చిపోతే బాగుండు ననిపిస్తుంది. ఎలా నిలుస్తుంది కాలం? తనకు చాతనయితే సూర్యుణ్ణి చంద్రుణ్ణి ఏ లోయల మధ్యకైనా విసిరేది. అవును, వాటినుంచేగా యీ రాత్రిం బవళ్ళు. అది చెయ్యలేని తను శేఖరం చేతిగడియారం తీసి దూరంగా దాచేసింది. అతన్ని గురించి తను యింతగా ఆలోచిస్తున్న యీ క్షణంలో అతనేం చేస్తుంటాడు? ఎందుకో మరి? తను ఉన్నప్పుడు ఓ విధంగా లేనప్పుడు ఇంకోవిధంగా వుంటాడు: బహుశా గంభీరంగా వుండటం అలవాటయి పోవటమే కారణం కావచ్చు. రేపు సాయంత్రంగాని రాడు క్యాంప్ నుంచి. రేపు సాయంత్రం యెప్పటికి అను? మళ్ళీ గడియారంమీద కోపం. తన ఈ ఆలోచన శేఖరంకి తమాషా. చెప్పించుకుని చెప్పించుకుని నవ్వుతాడు. అతనికి తెలియదుగా... అతనికోసం ఓ మంచి వార్త ఉందని. పాపం! అన్నం సరిగ్గా సహించకపోతే వాంతులు చేసుకుంటూంటే ఎంత ఖంగారుపడ్డాడో? అసలు ప్రతి విషయం, ప్రతి మాటా అతను విలువ చేకూరుస్తాడా లేక తను ఊహించుకుంటుందా? మొన్నమటుకు మొన్న క్యాంప్‌కి వెళ్ళబోతూంటే తనని దగ్గరికి తీసుకుని తొందరగా వచ్చేస్తానని భయపడొద్దని చెప్తూ, "నేను వచ్చేలోగా నువ్వు కొంచెం సన్నపడాలి" అన్నాడు. అది నిజమే! అంత అన్నం సహించక

సేపయింది వచ్చి? శేఖరం క్యాంపునుంచి రాలేదూ?" అంటూ సుకన్యాదేవి భుజంపట్టి పలకరించటంతో ఉలిక్కిపడింది. ఆ వెంటనే తన్ని తను తమాయించుకుంటూ "అబ్బే లేదండీ! ఇప్పుడే వచ్చాను. మీకోసమే చూస్తున్నాను," అంది. చప్పున కళ్ళు చేతిలోవున్న సోప్‌బాక్స్‌మీద వాల్చుకుంటూ 'ఛీ! ఛీ! ఇలా గుమ్మందగ్గర నిలబడి ఉండకూడదు. కాస్తంత ధైర్యంచేసుకుని లోపలికి వెళ్ళి కూర్చుంటే బాగుండేది' అనుకుంటూ "మంచిదానివే! నయం. నే వెంటనే చూశాను కాబట్టి సరిపోయింది. అసలు చూడకనే పోదునే మా అక్కయ్య కూతురు వచ్చి 'గుమ్మందగ్గర పాలరాతిబొమ్మలా నిలబడ్డ ఆ అమ్మాయి ఎవరు పిన్నీ!' అంటే తిరిగి చూశాను" సుకన్యాదేవి నవ్వుతూ వాసంతిని చేయిపట్టి తీసుకొచ్చి ముందు వసారాలో ఉన్న ఓ కుర్చీలో కూర్చోబెట్టింది. ఆవిడింక ఏదో చెప్తూండగా "వెళుతున్నానండీ" అంటూ ఎవరో రావటంవల్ల వాసంతిని "కూర్చో వస్తానని" వెళ్ళిపోయింది.

క్షణంలో వచ్చిన వ్యక్తిత్వం మళ్ళీ పోయినట్లనిపించింది వాసంతికి. ఎవరూ మాట్లాడేవాళ్ళు లేరు. పైపెచ్చు దూరంగా కూర్చున్న యిద్దరు ముగ్గురు నైలాన్ చీర అమ్మాయిలు ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వాసంతిని తిరిగి తిరిగి చూచి వాళ్ళలో వాళ్ళు ఏమిటో చెప్పుకుంటున్నారు. వాళ్ళు చెప్పుకునేదేమిటో వాసంతికి విన్పించటంలేదు. ఒకవేళ తనిలా కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తుందని, వెర్రిమొహంలా ఉంది. తెలుస్తూనే ఉందని అనుకుంటున్నారేమో' వాసంతి కళ్ళు వాల్చుకుని చీరవంక చూసుకుంది. తెల్లటి పాలనురుగులాటి చీరె. ఈ చీరంటే శేఖరానికి చాలా యిష్టం. శేఖరం గుర్తుకొచ్చేసరికి వాసంతికి మొహంలో భయం, బెరుకుదనం పోయి ఉల్లాసం వచ్చింది. క్యాంపులో ఈ సమయానికి ఏంచేస్తున్నాడో? ఆఫీసులో అతను చాలా గంభీరంగా వుంటాడట! అందరూ భయపడతారని, మళ్ళీ యెవర్నీ ఏమీ అనడని చెప్తాడు రాజు.

ఎక్కడి తను! ఎక్కడ శేఖరం! అదృష్టం అంటే ఇదే కాబోలు. "మీ అయనంటే సామాన్యం కాదమ్మాయోయ్! పెళ్ళికాని ఆడపిల్లల గుండెల్లో మెరుపు. పెళ్ళయిన ఆడపిల్లల గుండెల్లో నిట్టూర్పు." శేఖరంతో తనపెళ్ళి స్థిరపడింతర్వాత తనని పెళ్ళికూతుర్ని చేసినప్పుడు కొత్తబట్టలతో ఆశీర్వాదం కోసం నమస్కరించడానికి వెళ్ళినప్పుడు అన్న మామయ్య మాటలు తనెలా మర్చిపోతుంది? అప్పుడే అక్కడే నిలబడ్డ అక్కయ్య "ఇహ అందరి గుండెల్లోనూ నిట్టూర్పే మామయ్యా! ఒక వాసంతి మొహంలోనే మెరుపు

అతను" అన్నది. ఆ రోజు అవేవో తమాషా మాటలనుకుంది. కానీ యెంత నిజం. కానీ చిత్రం. అన్ని విధాలా వున్న అతను తనలో ఏం చూశాడో! చూసేందుకు ఏముంది? అదృష్టం దయతలచి తన ప్రక్కన నిలబడింది. అయితే-యిదే మాటను తను ఓసారి అంటే అతను "లేదు వాసంతీ! నీలో నేను చాలా చూశాను. ఏం చూశావో చెప్పమని అడగకు. ఒకప్పుడు నాలో ఉండి ప్రస్తుతం పోగొట్టుకున్నదంతా నీలో చూశాను" అన్నాడు. తన కారోజు, ఆ క్షణం చాలా బాగా గుర్తుంది. ఆరోజు ఆదివారం. రాజేంద్రనగర్‌లో కిద్వాయి గార్డెన్ కాటేజ్ రిజర్వ్‌చేయించుకున్నారు. ఎప్పుడోగాని శేఖరానికి అంత తీరిక దొరకదు. ఆ రాత్రి యెంత బాగుంది. కాటేజ్ ప్రక్కనున్న పచ్చగడ్డి మంచుతో తడిసి కొద్దిగా చల్లగా ఉంది. తెల్లటి వెన్నెల స్వచ్ఛమైన మనస్సులా ....చుట్టుప్రక్కల శబ్దమే లేదు. కొంచెం దూరంలో వున్న చెవులపిల్లుల గడ్డి కొరికే పరపర చప్పుడు తప్ప. కాటేజి మధ్యగా శబ్దంచేస్తూ దొర్లే నీళ్ళు. వెన్నెల్లో పచ్చగడ్డిమీద శేఖరం జేబురుమాలు వేసుకుని కూర్చున్న తను, తన ఒళ్ళో శేఖరం తల, యెన్ని యుగాల అనుభవం కలిగింది తనకి. అలా యెన్నికోట్ల సంవత్సరాలు బ్రతికితేమటుకు విసుగొస్తుందా? కాలం నిల్చిపోతే బాగుండు ననిపిస్తుంది. ఎలా నిలుస్తుంది కాలం? తనకు చాతనయితే సూర్యుణ్ణి చంద్రుణ్ణి ఏ లోయల మధ్యకైనా విసిరేది. అవును, వాటినుంచేగా యీ రాత్రిం బవళ్ళు. అది చెయ్యలేని తను శేఖరం చేతిగడియారం తీసి దూరంగా దాచే సింది. అతన్ని గురించి తను యింతగా ఆలోచిస్తున్న యీ క్షణంలో అతనేం చేస్తుంటాడు? ఎందుకో మరి? తను ఉన్నప్పుడు ఓ విధంగా లేనప్పుడు ఇంకోవిధంగా వుంటాడు; బహుశా గంభీరంగా వుండటం అలవాటయి పోవటమే కారణం కావచ్చు. రేపు సాయంత్రంగాని రాడు క్యాంప్ నుంచి. రేపు సాయంత్రం యెప్పటికి అను? మళ్ళీ గడియారంమీద కోపం. తన ఈ ఆలోచన శేఖరంకి తమాషా. చెప్పించుకుని చెప్పించుకుని నవ్వుతాడు. అతనికి తెలియదుగా... అతనికోసం ఓ మంచి వార్త ఉందని. పాపం! అన్నం సరిగ్గా సహించకపోతే వాంతులు చేసుకుంటూంటే ఎంత ఖంగారుపడ్డాడో? అసలు ప్రతి విషయం, ప్రతి మాటా అతను విలువ చేకూరుస్తాడా లేక తను ఊహించు కుంటుందా? మొన్నమటుకు మొన్న క్యాంప్‌కి వెళ్ళబోతూంటే తనని దగ్గరికి తీసుకుని తొందరగా వచ్చేస్తానని భయపడొద్దని చెప్తూ, "నేను వచ్చేలోగా నువ్వు కొంచెం సన్నపడాలి" అన్నాడు. అది నిజమే! అంత అన్నం సహించక

పోయినా, యేం తినకపోయినా తను బాగానే వుంది. ఒంటి రంగు కూడా ఏదో మెరుపు వచ్చింది. తను లావు అవటం శేఖరానికి ఇష్టంలేదని తనకు తెలియదు. అందుకే అది "ఏం లావయితే! అసలు నేను కొంచెం లావుగా వుంటేనే బాగుంటానని అందరూ అంటారు" అంది. "అబ్బెబ్బే! అదేం కాదమ్మాయి. లావు అయ్యేరోజులు ముందున్నాయి. ఇప్పుడొద్దు. నువ్వు లావయిపోయి, కూర్చున్నచోటునుంచి కదలకపోతే, "మీది మరీ విచిత్రం! అంత లావెందుకు అవుతాను."

"ఎంతయినా వద్దు. నేను క్యాంప్‌నుంచి వచ్చేసరికి చేతులు చాచుకుని పరుగెత్తుకొస్తావు చూడు. బంగారు తీగెలా ఉంటావు. లావయితే బాగుండదు. నువ్వసలు పరుగెత్తలేవు. పరుగెత్తినా నేను చూడలేను." యిద్దరూ నవ్వుకున్నారు. అంత బాగా మాట్లాడి, అంత హుషారుగా మాట్లాడిన నన్ను దగ్గరికి తీసుకోవటంలో ఒళ్ళు వేడిగా ఉందని 'వద్దు నీకు ఒంట్లో బాగాలేదు. నేను క్యాంప్ కాన్సిల్ చేసుకుంటా'నని కూర్చున్నారు. ఆ రోజు అసలు ఉదయం నుంచే వంట్లో బాగాలేదు. అ క్రితంరోజే లేడీ డాక్టర్ సుశీలకి ఫోన్‌చేస్తే ఆవిడ లేదు. యెక్కడికో వెళ్లిందన్నారు. క్యాంప్ వెళ్ళే హడావుడిలోవున్న శేఖరంకూడా పట్టించుకోలేదు. తనూ అంత అనుకోలేదు. ప్రయాణం అయి జీప్‌లో సామానంతా పెట్టించి, బట్టలు వేసుకుని టై కట్టుకుంటూన్న శేఖరం తను లోపలికి వెళ్లి కాఫీతో తిరిగివచ్చేసరికి టై విప్పి టేబిల్‌మీద పారేసి వచ్చి పడక కుర్చీలో పడుకున్నాడు. తనకు తెలుసు—అతను వెళ్ళి తీరాలి చాలా ముఖ్యం అని. డాక్టర్ సుశీల రాగానే పిలిపించుకుంటానని లేకపోతే నేనే వెడతానని యెన్నో చెప్పి వప్పిస్తే కాని అతను లేచి మళ్ళీ టై కట్టుకోలేదు. "లేదు నేను సరిగ్గా చూడనేలేదు. నీ మొహం చాలా పీక్కుపోయింది. తెలుసా?" అతని మొహంలో బాధకి తనకు నవ్వు వచ్చిందిగానీ అదెంత హాయి! మరో అరగంటలో....వెళ్లిన తర్వాత తనకెంత దిగులో! మళ్ళీ అతన్ని కళ్ళతో చూస్తానా అన్పించింది. ఆ మర్నాడు సుశీల వచ్చింది. వస్తూనే ఆవిడ వేసిన మొదటి ప్రశ్నకి తనిచ్చిన జవాబులోనే చెప్పేసింది. ఆ తర్వాత పరీక్షకూడా చేసి నవ్వుతూ "ఆడపిల్లా—మగపిల్లవాడా?" అని అడిగింది. ఎక్కడో ఏదో ఆలోచిస్తున్న తను ఆవిడ ప్రశ్నకి సమాధానాన్ని అంతా గుర్తించకుండానే "ఎవరికి ?" అంది ఎవరన్నా ప్రసవించారో—ప్రసవిస్తారో అనుకుంటూ. యెవరన్నా ప్రసవిస్తారు అన్నప్పుడే, చేతి వ్రేళ్ళలో రెండు చూపించి పట్టుకో

మనటమో లేక ఆడపిల్లా, మగపిల్లవాడు కావాలా అని అడగటమో చేస్తారు. డాక్టర్ సుశీల విరగబడి నవ్వుతున్నప్పుడుగాని తనకి గుర్తురాలేదు ఆవిడ ప్రశ్న, తన జవాబు. ఆవిడ పరీక్ష_అన్నీ. క్షణంసేపు గుండె కొట్టుకొనటం మానేసింది. ఇహ అసలు కొట్టుకోదేమో అన్పించింది. కూర్చున్న కుర్చీకి తన శరీరం అంటుకుపోయినట్లయింది. ఏమిటీ? తనకా? పాపా! ప్రపంచం అకస్మాత్తుగా మారిపోదేం? వస్తువులన్నీ యిలాగే ఉంటాయేం? కిటికీ తలుపులన్నా కదలవేం. గాలయినా గట్టిగా వీచదేం? ఆకాశంలో మేఘాలయినా పరుగెత్తవేం? గుమ్మం అవతల వరండా దిగువగా పచ్చటి చెట్లమీదపడి మెరుస్తున్న సూర్యకాంతి పకపకా నవ్వదేం? ఏం జరగదేం? యిదేమిటి ఇలా ఆలోచిస్తుందేం తను? "నిజంగానా?" జీరపోయిన గొంతుతో డాక్టరు సుశీల వంక చూస్తూ అంది తను. "మీరు బలే తమాషా చేస్తారండీ! కళ్ళల్లో అన్ని భావాలు కదుల్తాయేమిటి? నిజంగానే చెప్తున్నాను. వారు క్యాంపు నుంచి రాగానే మొదట నాకు బహూమతి యిప్పించాలి. కాన్పూ అదీ నేనే చూస్తాను." నల్లగా పొడుగ్గా వున్న సుశీల తెల్లటి పళ్లన్నీ తళుక్కుమనేట్లు నవ్వి అంది. ఆవిడ వైపే తదేకంగా చూస్తున్న వాసంతికి ఆవిడ చేతిలో ఓ పసికందుని తెల్లటి తువాల్తో తుడుస్తూ "మీ పోలికండీ. ముక్కు_మటుకు తండ్రిది పుణికి పుచ్చుకున్నాడు. పాప చాలా ఆరోగ్యంగా వుంది. చూశారా! మీరు నాకు మంచి బహూమతి ఇవ్వాలి" అంటున్నట్లు తను ఏదో మంచంమీద పడుకుని, చెవుల్లో దూదితో నీరసంగా పడుకుని ఆసక్తిగా భయంగా ఆ పసిపాప వైపు చూస్తున్నట్లు అన్పించింది. తనసలు ఎప్పుడూ అంతే_ఉన్న విషయానికి, జరుగుతూన్న క్షణానికి పదింతలు ముందుకు దూసుకుపోయి ఆలోచిస్తుంది. ఆ క్షణంలో ఇప్పుడు జరుగుతున్న దాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించదు. జరిగిపోయిన వాటిని గురించయినా ఆలోచిస్తుంది. వర్తమానాన్ని గురించిన ప్రసక్తే ఉండదు. అది గతంగా మారేవరకు ఏమిటో ఒక్కొక్కళ్ళ స్వభావం. సీతయితే_"జరిగిపోయింది, జరగబోయేది నాకు అక్కర్లేదు. జరుగుతున్నవే నాకు కావాలి. జరిగిందాంతో మనకు ప్రసక్తిలేదు. అది తిరిగిరాదు. ఎంత గొప్ప అనుభవం అయినా సరే_జరగబోతుందంటావా? అయోమయం, అర్థంకాదు. మనతోపాటు ముందుకు పరుగెత్తే పెద్దగోడ భవిష్యత్తు, యెప్పటికప్పుడు దాని వెనక ఏం వుందీ మనకి తెలియనే తెలియదు. అది తెలుసుకోవాలనే ప్రయత్నంలోనే మనం పరుగెత్తుతుంటాం. చివరకు తెలుసుకోకుండా

పోతుంటాం" అంటుంది. దానిది మరీ వేదాంతం. బ్రతుకంటే క్షణంలో సగంట. ఆ క్షణంలో సగంలోనే చాతనయితే ఇంద్రధనుస్సులో రంగులన్నీ చూసినట్టు అన్నీ అనుభవించగలగటం. దాని మొహం. మరీ అంత చిన్న వయసులో అంత వేదాంతం ఉండకూడదు బాబూ! అలాటి వాళ్ళకి యిల్లూ, సంసారాలు కూడా పట్టవు. సీత అదే అంటుంది. "భర్తగాని, పిల్లలుగాని ఇవన్నీ ఓ బాధ్యత కింద మనం చెయ్యవలసిన పనుల క్రింద తీసుకోవాలి" అంటుంది. తనకి శేఖరం ఎప్పుడూ లోకంగా కనిపిస్తాడు గానీ బాధ్యతగా అన్పించడు. తనకి పిల్లలు కావాలి, భర్త కావాలి, అన్నీ కావాలి. రేపు తనకి కూడా ఓ పాప పుడితే ఇలాగే పుట్టినరోజు చేసుకోదూ? తనప్పుడు ఎలా ఉంటుంది? శేఖరం చెప్పినట్లు లావయి, నిండుగా జడమానేసి మెడమీదకు చుట్టతో ఉంటుంది కాబోలు. అమ్మో! యిలా సన్నగా ఉంటేనే బాగుంటుంది. చిన్నతనం మనసుంచి వెళ్ళిపోతుంటే ఎంత బాధేస్తుంది-అందుకే కాబోలు మనకు తెలియకుండానే మన పెద్దవాళ్ళం అయిపోతూనే ఉంటాం.

చాలాసేపట్నుంచీ తదేకంగా ఆలోచిస్తున్న వాసంతి యెవరో వచ్చి పలకరించటంతో ఈ లోకంలో పడింది. ఆ వచ్చిన అమ్మాయి సుకన్యాదేవి అక్క-కూతురు కాబోలు, "పిన్ని మిమ్మల్ని లోపలికి పిలుస్తోంది," అంటూ వచ్చింది. యిదేమిటి? చాలాసేపయింది. వాసంతి ఖంగారుగా లేచి నిలబడింది. హాలులో చాలా భాగం ఖాళీ అయిపోయింది. గోడవారగా కూర్చున్న ఆంగ్లో ఇండియన్స్ వెళ్ళిపోయారు. హాలులో చాలకొద్దిమంది మిగిలారు. స్టేజీగూడా ఖాళీఅయింది. వాసంతి దిక్కులు చూడటం మానేసి తనని పిలవటానికి వచ్చిన అమ్మాయితో "యెక్కడికి రావాలి?" అంది. "లోపలికి, అక్కడ ఫలహారంచేసి మళ్లీ వచ్చి కూర్చుందురుగాని" దూరంగా కూర్చుని అంతకుముందు వాసంతిని చూసి నవ్వుతూ కబుర్లు చెప్పుకున్న అమ్మాయిలవంక మెడతిప్పి చూసి నవ్వుతూ అంది. ఆ అమ్మాయి వాళ్లని చూచేసరికి వాసంతికి మళ్ళా దిగులు ముంచుకు వచ్చింది. వాళ్లింకా అలాగే చూస్తూ ఉన్నారు. "రండి" అని పిలుస్తున్న ఆ అమ్మాయితో ఎలాగో లోపలకు వెళ్ళటోయింది. వాసంతి గుమ్మానికి కొంచెం ఇవతల ఉండగానే ఆ ముగ్గురు అమ్మాయిలు వాసంతివైపుకు వచ్చారు. "పరిచయం చెయ్యాలా-ఇదుగో వీళ్ళు నా స్నేహితురాళ్లండీ. ఈమె వాసంతి అని శేఖరంగారి భార్య-వారు మా బావగారు. మంచి ఫ్రెండ్స్!" అంది సుకన్యాదేవి పిన్ని కూతురు. వాళ్ల ముగ్గురికీ నమస్కారాలు చేసింది వాసంతి.

అందులో మధ్య అమ్మాయి అంది "మిమ్మల్ని చూసింతర్వాత మీతో తప్పకుండా పరిచయం చేసుకోవాలనిపించిందండీ! మీ కళ్ళు చాలా బాగున్నాయి. ఇందాకటి నుంచీ మీవంకే చూస్తున్నాను."

వాసంతి కళ్ళు క్రిందకి వాలిపోయాయి. అంత ధైర్యంగా నిర్మొహమాటంగా మొహంమీద చెప్పేస్తున్న అమ్మాయివంక కళ్ళెత్తి చూడటం గూడా భయమనిపించింది.

"ఈ అమ్మాయి కథలు రాస్తుందిలే అందుకు—" అంది మరో అమ్మాయి. "అది అనవసర ప్రసంగం" మొదటమ్మాయి కసిరింది. పేరడిగింది. వాసంతి జవాబు చెప్పింది. ఆ అమ్మాయిపేరు వాసంతికి పరిచయమే. కథలుకూడా బాగానే ఉంటాయి. కానీ ఆ అమ్మాయి వయసు తక్కువగా వుందే-అంత మంచి కథలు రాయడం యెలా వస్తుందీ అనుకుంటున్న వాసంతికి "పదండి, లోపల పిన్ని వెయిట్ చేస్తుంది" అంది సుకన్యాదేవి అక్కకూతురు. మరోసారి వాళ్ళ ముగ్గురికీ నమస్కారంచేసి వాసంతి ఇవతలకు వచ్చింది. అప్పటికే సుకన్యాదేవి బయటకు వచ్చేసింది. "మీరు లోపలకు వెళ్ళండి. చూడు గిరిజా! వాసంతిని లోపలకు తీసుకువెళ్ళు. ఇక్కడ అహల్యాదేవి వెళ్తున్నానంటున్నారు పంపిస్తాను. లోపలికి వెళ్ళు వాసంతీ! సిగ్గుపడకు." మాటలు చెప్తూనే ఆవిడ హడావుడిగా వెళ్ళిపోయారు. గిరిజ లోపలికి వెళుతుండగా వాసంతి చటుక్కున చేయిపట్టి ఆపి "మీ అక్కయ్య కూతురెక్కడ?" అంది చేతిలో వుండిపోయిన సోప్‌బాక్స్ గుర్తుకురావటంతో. "ఎవరూ-జయంతా? అక్కడ ఆ గదిలో వుందే" అంది గిరిజ. ఆగిపోతూ, వాసంతి తలతిప్పి చూసింది. గిరిజ చూపించిన గదిలో జయంతి, ఆవిడ ప్రక్కన ఆ లావుపాటి ఆవిడ, ఖద్దరుచీర ఆవిడ ఉన్నారు. "నువ్వొక్క పనిచేసిపెట్టు నేను వెళ్తూవుంటాను. నువ్విది మీ జయంతి కిచ్చేసిరా?"

"అదేమిటి-మీ రివ్వండీ" గిరిజ అనుమానంగా చూస్తూ అంది.

"కాదు వారిపేరు చెప్పి నువ్విచ్చేసిరా?" ప్రతిమాలుతున్నట్లు అంది వాసంతి. క్షణంసేపు మొహంలోకి చూసిన గిరిజ సోప్‌బాక్సు తీసుకొని వెళ్ళింది. "ఎంత త్వరగా ముగించుకుని బయటపడితే అంత బాగుండు-ఏదీ ఇక్కడ ఇందాక రక్షసిభటుల్లా నిలబడ్డ అమ్మాయిలు లేరే? పోయారే" అనుకుంటూ తలవంచుకుని లోపలికి వస్తున్న వాసంతికి అలాగే తలవంచుకుని గబగబా లోపల్నుంచి వస్తున్న మరో వ్యక్తి తపీమని తలకొట్టింది. ఇద్దరూ ఒక్కసారి అబ్బా అనుకొని దెబ్బ తగిలిన

చోటు పట్టుకుని తలెత్తి చూశారు. "సారీ, చూడలేదు" అంది అవతల వ్యక్తి. వాసంతి ఎత్తేవుంది. కానీ నాలుగైదు సంవత్సరాలు పెద్దదిలా వుంది. పొడుక్కి తగ్గ లావుతో, మనిషి హుందాగా వుంది. చాలా అందంగా శరీరసౌష్ఠవానికి చక్కగా అతికినట్లున్న చీరె, జాకెట్-కానీ జాకెట్ చేతులు భుజాల దిగువగా పొట్టిగా చాలా బిగుతుగా ఉన్నాయి. చెంపలకి చీరెరంగుతో కలిసే ద్రాక్షగుత్తుల్లా ఉన్న ప్లాస్టిక్‌వి ఉన్నాయి. పెదవులకి రంగుంది. కానీ రంగు వేసుకున్నట్లు లేదు. చాలా సహజంగా ఉంది.

"సారీ దెబ్బతగిలిందా?" అంది ఆవిడ నవ్వుతూ.

"లేదు ఫర్వాలేదు" వాసంతిగూడా నవ్వింది.

"వెరీ వెరీ సారీ!" వాసంతిని తప్పించుకొని వెళ్లిపోయింది ఆవిడ. ఆవిడని ఇంకా సాంతం చూడటం పూర్తిగాని వాసంతి తలతిప్పి ఆవిడ వచ్చినవైపే చూస్తుండిపోయింది. వెనక నడినెత్తిమీదికి జుట్టు మెలితిప్పి చుట్టిన చుట్ట వెనక జాకెట్‌కి వీపుమీద డైమండ్ ఆకారంలో బట్టలేదు. ఆ బట్టలేనంతమేర బిగుపుగా అందంగా శరీరం కన్పిస్తోంది. మెడలో గొలుసుండే భాగంనుంచి ఆ కత్తిరించిన ఆకారం మీదుగా పట్టుకుచ్చులు చిన్నచిన్నవి నడుందాకా వేళ్ళాడుతున్నాయి. నడకకూడా బాగానే వుంది. వెళుతూ వెడుతూ ఆవిడ ఒకసారి వెనక్కి తిరిగిచూసి ఇంకా అలాగే నిలబడిపోయి తనవంక చూస్తున్న వాసంతినిచూసి మళ్ళీ నవ్వి వెళ్లిపోయింది. ఆవిడ చూడగానే వాసంతి చప్పున మొహం తిప్పుకుంది. ఇంతలో గిరిజ వచ్చింది. "ఆవిడెవరు?" దూరంగా వెళ్లిపోయి సుకన్యాదేవితో మాట్లాడుతున్న ఆవిడని చెయిచాచి వేలుపెట్టి చూపిస్తూ అంది. "యెవరూ? ఆవిడా, మా అక్కయ్య ఫ్రెండ్, బొంబాయిలో ఉంటారు. ఆవిడ భర్త అమెరికా వెళ్ళి వచ్చారు. ఆమెకూడా వెళ్లివచ్చింది" లోపలకు దారితీస్తూ అంది గిరిజ.

ఫలహారం అదీ ముగించుకుని గిరిజతోపాటు యివతలకు వచ్చింది వాసంతి. హాలు పూర్తిగా ఖాళీ అయిపోయింది. పెద్ద వర్షం గబగబా పడి ఒక్కసారి తెరిపివచ్చినట్లుగా ఉంది. హాలులో దీపాలగుత్తి క్రిందుగా నిలబడి ఆవిడ, సుకన్యాదేవి ఇంకా ఏదో మాట్లాడుకుంటూనే వున్నారు. "ఆగండి, మీకు కిళ్ళీ తీసుకొస్తాను" అంటూ గిరిజ మధ్యలో వెనక్కి వెళ్ళిపోయింది, "ఇక్కడకు రా వాసంతీ" దూరంగా నిలబడి సుకన్యాదేవి పిలవడంతో గిరిజకోసం చూస్తున్నట్లు నిలబడిన వాసంతి కదిలి ముందుకు వెళ్ళింది. "ఈవిడ నా స్నేహితురాలు

అమూల్య." ఈవిడ పేరు అమూల్యా? మనిషిలానే పేరుగూడా చక్కగా అమూల్యంగానే ఉంది అనుకొంది. వాసంతి చేతులు జోడించి నమస్కరిస్తూ "నీ పేరేమిటి వాసంతా?" అంది ఆవిడ బాగాదగ్గరగా వచ్చి. ఆవిడ చూపుల్లో ఇందాకటి మార్దవం, లాలిత్యం రెండూ లేవు. ఏవో చురకలు వేసినట్లు, అవి తగిలిన చోటల్లా గుచ్చుకుంటున్నట్టూ ఉన్నాయి. ఆవిడలో ఆ మార్పు యెందుకు వచ్చిందో అర్థంగాని వాసంతి అచేతనంగా అలాగే నిలబడిపోయింది. పైనవున్న దీపాల గుత్తిలోంచి వస్తున్న రంగురంగుల కాంతులు ఆవిడ మొహంమీద నీలంగా, సుకన్యాదేవి మొహంమీద ఎర్రగా, తన మొహంమీద తెల్లగా నడుస్తున్నాయి.

"శేఖరం నీకు పెళ్ళికిముందే తెలుసా?" హఠాత్తుగా ఆవిడ చెయిచాచి వాసంతి గడ్డాన్ని మునివేళ్ళతో పట్టుకుని ఎత్తుతూ అంది. ఆ ఎత్తడం ప్రేమగా కాక అదేదో ఆసక్తిగా ఉంది. అసలు సుకన్యాదేవి ఆవిడకి తనను పరిచయం చేసిందిగాని, తనకు ఆవిడను పరిచయం లేదు. కానీ తన పేరు ఆవిడకి తెలిసింది. పోనీ, అది ఆవిడకి ఈవిడ చెప్పివుండచ్చు కానీ శేఖరం సంగతి అడుగుతుం దేమిటి? గడ్డాన్ని ఆవిడచేతిలోంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ ఆవిడ చూపులతో కలిసిన తన చూపుల్ని క్రిందికి తిప్పుకుంది వాసంతి. "కాంచెం సిగ్గులా ఉందే! లేకపోతే కొత్తా!" ఆవిడ గడ్డం వదలకుండానే అంది. పై నుంచి వస్తున్న రంగురంగుల కాంతులు, యెదురుగుండా యీవిడ వింత ప్రవర్తన, నిశ్శబ్దంగావున్న హాలు, చాలాసేపట్నుంచి కూర్చుని కూర్చుని అలసిపోయినట్లుగా ఆదోమాదిరిగావున్న వాసంతికి అదేదో కలలో యెక్కడో వంటరిగా కూర్చుని ఆలోచిస్తున్న ఓ దృశ్యంలా అన్పిస్తోంది. ఆవిడ ప్రశ్న కేదో సమాధానం చెప్దామని అనుకుంటూండగానే హఠాత్తుగా వెనకనుంచి "వసూ!" అదే పిలుపు విన్పించటంతో ముగ్గురూ ఉలిక్కిపడి వెనక్కి తిరిగారు. "అరె మీరా? యెప్పుడొచ్చారు? రేపుగదూ రావాల్సింది" గిరుక్కున వెనక్కి తిరిగిన వాసంతి శేఖరాన్ని చూడటంతోనే ఒక్క పరుగులో దగ్గరకు వచ్చింది. "మీరు రేపు సాయంత్రంగానీ రారనుకున్నాను. యెలా వచ్చారు?" సంతోషంతో వికసించిన మొహంతో వాసంతి భర్తచెయ్యి తనచేతిలోకి తీసుకోబోయింది. కానీ శేఖరం వాసంతిని గమనించలేదు. అతని చూపులు దూరంగా నిలబడ్డ వస్తువు మీద రెప్పవాల్చకుండా చూస్తున్నాయి. తనచేయి పట్టుకోబోతూ అడ్డుగా వచ్చిన వాసంతిని ప్రక్కకు లాగాడు. ఆశించని యీ ప్రవర్తనతో తెల్లబోయిన

వాసంతి, శేఖరం చూస్తున్నవైపు చూసింది. దూరంగా రంగురంగు దీపాల గుత్తిక్రింద నిలబడ్డ అమూల్య తల కొంచెంగా ప్రక్కకు ఒరగపెట్టి అదో రకమైన చిరునవ్వులో ఠీవిగా నవ్వుతూ శేఖరంవైపు చూస్తోంది. శేఖరంగూడా చూస్తున్నాడు. కానీ బాధగా, అసహ్యంగా, కోపంగా ఉన్నాయి ఆ చూపులు. వాసంతికి అవి పరిచయంలేవు. ఒకటికి రెండుసార్లు ఆవిడవంక, శేఖరంవంక, కొయ్యబొమ్మలా నిలబడిపోయిన సుకన్యాదేవి వంక తలతిప్పి చూసింది వాసంతి.

"పద పోదాం!" హఠాత్తుగా భార్య భుజంచుట్టూ చేయివేసి తిప్పేస్తూ అన్నాడు శేఖరం.

"అదేమిటి! రండి లోపలికి వెళ్లురుగాని" చలనం తెచ్చుకున్న సుకన్యాదేవి ముందుకువస్తూ గబగబా అంది.

"అక్కర్లేదు. ముందు మీరు నాకు చెప్పినట్లయితే వాసంతిని ఇక్కడికి రానిచ్చేవాడినికాదు" కఠినంగా జవాబిచ్చిన శేఖరం మరుక్షణంలో వాసంతిచేయి పట్టి ముందుకు గుంజుకుపోయాడు. "ఎవరావిడ? ఎందుకిలా చేస్తారు!" శేఖరం లాక్కొస్తూంటే వచ్చేస్తున్న వాసంతి వెనక్కు తిరిగిచూస్తూ అంది. ఆవిడ యింకా అలాగే నిలబడి ఉంది. కాని యీసారి మొహంలో ఠీవిగావున్న ఆ చిరునవ్వు లేదు.

ఐదు నిమిషాల్లో చేరవలసిన దోవ పరలి చుట్టూ అరగంటకి కాని యింటికి తీసుకురాలేదు శేఖరం. దోవలో మళ్ళీ తనే అడిగింది వాసంతి. "ఎవరావిడ? మీకు తెలుసా?" అని. కానీ శేఖరం జవాబు చెప్పలేదు. పెదవులు బిగించి రోడ్డుని తదేకంగా చూస్తున్నాడు. మరోసారి యేదో అడగబోయింది వాసంతి. "నన్ను మాట్లాడించకు. ఆవిడ నాకు తెలుసు. అంతే!" కోపంగా పెళ్ళయిన తర్వాత మొట్టమొదటిసారిగా గట్టిగా కసురుతూ అన్నాడు శేఖరం. వాసంతి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. మధ్య తనేంచేసిందనీ? అసలు యిలా మధ్యలో క్యాంపునుంచి రావటం ఏమిటి? పోనీ వచ్చాడు. కానీ వచ్చారన్న సంతోషంలేకుండా ఇదేమిటి? కళ్ల నుంచి ఉబికి బుగ్గలమీదకు జారుతున్న నీళ్ళని తుడుచుకోవటానికి ప్రయత్నించలేదు. తుడుచుకుంటే అతనికి ఏడుస్తున్నట్లు తెలుస్తుంది. అతను రాగానే తను ఎన్ని చెప్పాలనుకొంటోంది! అన్నీ పోయినాయి. నిటారుగా కూర్చుండిపోయింది వాసంతి.

ఇంటికి వస్తూనే అలవాటు ప్రకారం కారుని గేరేజ్‌లో పెట్టకుండానే వరండా

మెట్లముందు వదిలేసి శేఖరం లోపలికొచ్చి గదిలో, కుర్చీలో కూలబడ్డాడు మాటా పలుకూ లేకుండా. తనకు సంబంధించనట్లున్న శేఖరాన్ని అలా మొదటిసారిగా చూస్తున్న వాసంతికి అతని దగ్గరకు వెళ్ళే సాహసం లేక హాలులో కిటికీదగ్గర అలాగే నిలబడిపోయింది. ఎవరసలావిడ ? శేఖరం యెందుకిలా అయ్యాడు? వాసంతికి తలపగలగొట్టుకున్నా అర్థంకావటంలేదు.

గదిలోకి వచ్చేసిన శేఖరం లైటువేసి బూట్లుకూడా విప్పుకోకుండా పడక్కుర్చీలో వాలిపోయాడు. హఠాత్తుగా అతనిలో శక్తి అయిపోయిన ట్లయింది. "మళ్ళీ అమూల్య ఎందుకు కన్పించినట్లు? నాలుగు సంవత్సరాల క్రితం రెండు సంవత్సరాల దాంపత్య జీవితంలో నరకం చూపించి తనని కాదని, అసమర్థుడని తీసిపారేసి మరొకరితో కలకత్తా వెళ్ళిపోయిన అమూల్య మళ్ళీ ఎందుకొచ్చింది తన జీవితంలోకి? అమూల్యతో జీవితం, కలకత్తానుంచి రాసిన ఆఖరి ఉత్తరం అన్నీ కలిపి తనని మనశ్శాంతికి దూరంచేసి పిచ్చివాడిలా చేసి దేశాలవెంట తరిమినాయి. యెలాగో కోలుకున్నాడు. పగిలిన హృదయపు ముక్కలు ఏరియిచ్చింది వాసంతి. వాటిని వాసంతి అమాయకపు హృదయం సాయంతో అత్యవసరం పెట్టుకున్నాడు. మళ్ళీ వచ్చింది అమూల్య. అమూల్యని ఎదిరించే సాహసం తనకెప్పటికీ రాదా ? యిప్పుడు మరోసారి పిచ్చివాణ్ణి చెయ్యడానికే పనిగట్టుకు వచ్చిందా అమూల్య ? వాసంతి. పిచ్చి వాసంతి. ఇదంతా చూసి యేమనుకుంటుందో? తన మొదటి భార్య బ్రతికిఉందని వాసంతికి తెలియదు. శేఖరం కుర్చీలో లేచి కూర్చుని "వసూ!" అని పిల్చాడు. పిచ్చిపిల్ల! అసలే కాస్తంత వాటిని గంపంతగా వూహించుకుని కళ్లు పెద్ద పెద్దవి చేసుకుని చూస్తుంటుంది. ఒకవేళ అమూల్య భర్త ఇక్కడకు ఉద్యోగరీత్యా వస్తే తను యీ ఉద్యోగాన్ని, యీ ఊరిని వదిలేసి వాసంతిని తీసుకుని ఏ పల్లెటూరికైనా పారిపోతాడు. "ఇక్కడికి రా, లైటు వెయ్యి!" నెమ్మదిగా వస్తున్న అడుగుల చప్పుడు విని మళ్ళీ వెనక్కువాలి పడుకున్నాడు శేఖరం. వాసంతి లైటువేసి యింకా చేతిని అలా స్విచ్ మీదనే ఉంచి శేఖరాన్ని గమనిస్తోంది.

"అలా నిలబడ్డావేం! దగ్గరకు రా!" చేయిచాపి ఇస్తూ అన్నాడు.

"మీరలా ఎందుకున్నారు ?" అవిడ ఎవరు అనే ప్రశ్న మళ్ళీ నాలిక చివరిదాకా వచ్చి ఆగిపోయింది.

"ఎలా ఉన్నానూ? నాకు ఒంట్లో బాగాలేదు. అందుకే తిరిగి వచ్చేశాను. నిజం. భోంచేద్దాం పద!" లేచి సరిగ్గా కూర్చుని వంగి కాలిబూటు విప్పుకుంటూ అన్నాడు.

ఆ రాత్రి అతను నిద్రపోలేదు. వాసంతికూడా నిద్రపోలేదు చాలా రాత్రయింతర్వాత మంచంమీద నిద్రలేకుండా అటూయిటూ దొర్లుతున్న అతన్ని చాలాసేపట్నుంచీ గమనిస్తున్న వాసంతి లేచి కూర్చుని "వున్న విషయం ఏమిటో పైకి చెప్తే కొంతయినా మనశ్శాంతి లభిస్తుంది. ఏ విషయం అయినా భార్యతో చెప్పటానికి జంకెందుకు చెప్పండి? మీ ఆనందంలోనే కాదు. మీ బాధలో గూడా నాకు భాగం ఇవ్వాలి." శేఖరం వాసంతి మాటలకు జవాబివ్వ లేదు. కానీ బోర్లగా పడుకొని దిండులో తలదూర్చుకొని బాధగా అటూ యిటూ కదులుతున్నాడు.

"పోనీండి మీరింత చెప్పటాని కిష్టంలేకపోతే చెప్పొద్దు. మీరు నిజంగా వంట్లో బాగాలేకనే తిరిగివచ్చినట్లయితే నిద్రపోవటానికి ప్రయత్నించండి" శేఖరం జుట్టులో వేళ్లుపోనిస్తూ ఆప్యాయంగా అంది.

ఆడవాళ్లని అనుభవాలు చిత్రంగా ఎదిగిపోయేటట్లు చేస్తాయి. యెందుకో రెండుగంటల క్రితం తనకీ–ఇప్పటికీ చాలా తేడా కనిపిస్తోంది వాసంతికి. ఏదో పెద్దరికం వచ్చేసింది. హఠాత్తుగా ఉన్నట్లు వాసంతి చేయితీసుకుని గట్టిగా పట్టుకొని "నువ్వు నాకీ ప్రశ్నకు జవాబు చెప్పు. నేను ఈ ఉద్యోగం, ఈ డబ్బు లేకుండా ఎక్కడికి రమ్మంటే అక్కడకు వస్తావా!" అతనేం మాట్లాడుతున్నాడో వాసంతికి అర్థంగావటంలేదు. శేఖరం తిరిగి సరిగా పడుకున్న భార్య చెయ్యి కళ్లకి అన్చుకుంటూ "చెప్పు వసూ! ఏది మనిద్దర్నీ విడదియ్యలేదని చెప్పు. నువ్వు నన్ను పెళ్ళిచేసుకున్నానని, యెప్పుడూ నా ప్రక్క వదలనని చెప్పు! నా మనశ్శాంతి దూరంకాదని చెప్పు. చెప్పవూ?" కళ్ళుమూసుకొని అంటున్న అతను హఠాత్తుగా కళ్ళు తెరచి రెండుచేతులూ చాచి దగ్గరకు లాక్కుంటూ "చెప్పు! చెప్పు. ఎలాటి పరిస్థితులలోనూ నిన్ను వదిలిపెట్టి వెళ్ళనని చెప్పు. అబద్ధం అయినా సరే ఇట్పిటికిలా చెప్పు. మనసారా చెప్పవూ?" తన భుజాలు విరిగిపోతాయేమో నన్నంత గట్టిగా పట్టుకొని పిచ్చిగా చూస్తున్న భర్తకళ్ళల్లోకి లోతుగా, పరీక్షగా చూసింది వాసంతి. అతని కళ్లు దేన్నో ఒకసారి పోగొట్టుకుని మరోసారి పోగొట్టుకుంటానేమోనని భయంతో ఉన్నాయి. "ఆవిడెవరో ముందు చెప్పండి?" శేఖరం చప్పున వాసంతిని వదిలేసి మొహం ప్రక్కకు తిప్పుకున్నాడు.

"పోనీ, నన్నేం చెయ్యమంటారో చెప్పండి?" మరోసారి కళ్లల్లో తిరగబోతున్న నీళ్ళని బలవంతాన ఆపుకోడానికి ప్రయత్నిస్తూ అంది.

"ఆవిడ అమూల్య!" ఎలాగో అన్నాడు శేఖరం

"అవును, అది ఆవిడ పేరు అయితే-ఆవిడేమయినా మీ మొదటి భార్యకు బంధువా?"

"కాదు అమూల్యే-నీకు తెలియదు. నా మొదటి భార్య బ్రతికివుందని, నన్ను వదిలేసి పారిపోయిందని." వాసంతికి నోటమాటరాలేదు - "ఏమిటది, ఏమిటది" మనసులో యెవరో దిగులుగా యేడవబోతున్నారు. "ఆవిడ చచ్చిపోలేదూ?" శేఖరం మొహంలోకి చూస్తూ అంది. వాసంతికి హఠాత్తుగా నీరసం వచ్చేసింది. "కాదు, యేం చెప్పాలో తెలియక మీ మామయ్యవాళ్ళకి చచ్చిపోయిందని చెప్పాను. అబద్ధం ఆడాను. అందులో నా తప్పులేదు. వాసంతీ! వింటానంటే ఓపికవుందంటే నీకు ఓ కథ చెప్తాను" దగ్గరగా లాక్కొని గుండెలకి నొక్కుకుంటూ అన్నాడు శేఖరం.

"చెప్పండి!" నీరసంగా అంది వాసంతి. 'అమ్మాయి వాసంతీ-అయింది నీ పని. ఇహ నీ యిష్టం' వాసంతి మనసులో గట్టిగా అరుస్తున్నా రెవరో. "అబద్ధం-అబద్ధ-ఏం కాదు. ఇదో కల. కాసేపటిలో కరిగిపోతుంది. అప్పుడు తను లేచి కూర్చుని శేఖరానికి ఇదంతా వర్ణించి చెబుతుంది. ఇంకో ళ్ళు పోట్లాడుకున్నారు" శేఖరం చెప్పడం మొదలుపెట్టాడు.

అమూల్యని అతను యెప్పుడు యెక్కడ చూసాడో సరిగ్గా జ్ఞాపకంలేదు. అప్పటికింకా ఆంధ్రప్రదేశ్ రాలేదు. శేఖరంతండ్రి మద్రాసులో హైకోర్టువకీలుగా పనిచేస్తూండేవాడు. అవి అతను చదువుకునే రోజులు. అమూల్య ఏ కాలేజీలోనూ చదువుకోవటంలేదు. ఇంటరు మూడుసార్లు తప్పి ఇంట్లోనే కూర్చుంది. అమూల్య తండ్రి ఎలక్ట్రిక్ పార్ట్సు అవీ అమ్మే వ్యాపారం చేస్తుండేవాడు. కారు, పెద్ద బంగళా, నౌకర్లు, చాలా అట్టహాసంగానే ఉండేవాడు. వస్తుతః ఉత్సాహవంతుడు. పదిమందిని కలుపుకొని యేపని అయినా యిట్టే నెరవేర్చే బుద్ధికుశలతగల శేఖరం కాలేజీలోనే గాక ఇవతల సాంఘికంగా కూడా మంచిపేరు తెచ్చుకున్నాడు. అమూల్య ఏదో పెళ్లిలో దూరంనుంచి చూసింది శేఖరంని. ఆ తర్వాత అనుకోకుండా వెంట వెంట ఒకసారి పుట్టినరోజు పార్టీకి, మరోసారి ఏదో పార్టీకి అలా కలుసుకున్నారు. ఆఖరికి బాగా పరిచయం ఏర్పడింది. అనుకుని చెప్పుకోవాల్సింది మహాబలిపురం ఎక్స్కర్షన్, దానితర్వాత శేఖరం కోరికమీద పక్షితీర్థం చూడటానికి వంటరిగానే శేఖరంతో వచ్చింది అమూల్య. ఆ పైన సినిమాలకి, బీచ్‌కి తరచుగా కలిసివెళ్లేవాళ్లు. అమూల్యకి

తనంటె యిష్టం. తనకి అమూల్యంటే యిష్టం. ఇష్టం కాదా మరి! ఎంత ఇష్టంలేకపోతే యింత ద్వేషం పుడుతుంది? పెళ్లి చేసుకోమని అడిగాడు-ఒప్పుకుంది-చాలా సహజంగా జరిగిపోయింది. అంతా చాలా అద్భుతమైన జంట, ఇలాంటివి చాలా అరుదు అని మెచ్చుకున్నారు. తండ్రికి అంత యిష్టంలేక పోయినా గట్టిగా కాదనలేదు. అసలే ఆయన గుండెజబ్బుతో బాధపడుతున్నాడు. యెక్కువ రోజులు బ్రతకబోవటంలేదని విస్పష్టంగా తెలుసుకున్న ఆయన యీ కాస్తలో కొడుకుని బాధపెట్టటం ఇష్టంలేక సరేనన్నాడు. ఆర్నెల్లు బాగానే గడిచిపోయినాయి. పెళ్లికాకముందు తనకు కన్పించిన అమూల్యలో తను చూసినవి చాలా తాత్కాలికమైనవని శేఖరానికి అర్థంకాసాగింది. కొంతమంది అంతే. నలుగురిలో ఉన్నప్పుడు ఓ రకంగా, ఒంటరిగా ఉన్నప్పుడు ఓ రకంగా ఉంటారు. డబ్బుమీద అమూల్యకి గల విపరీతమయిన కాంక్షకీ కొన్ని కొన్ని విలువైన విషయాలని అతినిర్లక్ష్యంగా తోసిపారేసే మనస్తత్వానికీ శేఖరానికి చిరాకు రాసాగింది. దానికితోడు తండ్రికి అనారోగ్యం. ఒకే ఒక్కడైన శేఖరం మీద పంచప్రాణాలు పెట్టుకునివున్న ఆయన కొడుకుని క్షణం అవతలకీ, ఇవతలకీ కదలనిచ్చేవాడు కాదు. అది అర్థంచేసుకోలేని అమూల్య శేఖరం తనని కావాలని నిర్లక్ష్యం చేస్తున్నాడని బాధపడి ఇష్టంవచ్చినట్లు మాట్లాడేది. లెక్కలేనట్లు ప్రవర్తించేది. ఎంతో ఉన్నతంగా-ఆదర్శవంతంగా ఉంటుంది అనుకున్న అమూల్య ఇలా మారటం చూసి శేఖరానికేం చెయ్యాలో తోచలేదు. అక్కడికీ ఓపికపట్టి అమూల్యకి అసలు విషయం అర్థంఅయ్యేలా చెయ్యటానికి ప్రయత్నించేవాడు. దాన్ని చాతకానితనంగా తీసుకున్న అమూల్య వాళ్లతో వీళ్లతో "శేఖరం పైకి కన్పించేటటువంటి వ్యక్తి కాదని, అతనిలో రెండురకాలున్నాయని, అతన్ని పెళ్ళిచేసుకోవటంలో తను చాలా బుద్ధితక్కువ పనిచేసి ఫలితం అనుభవిస్తున్నా"నని అనేది. అది ఒక్క శేఖరంతోనే కాదు. స్నేహితులతో, అన్నగార్లతో, తండ్రితో అందరితో చెప్పేది. అపైన వాళ్ళూ వీళ్ళూ రావటం, శేఖరానికి ఏదో చెప్పబోవటం, దానితో గొడవలు జరగటం పదిలేసి పుట్టింటికి వెళ్తానని అమూల్య బెదిరించటం, ఈ లోపల తండ్రిపోవటం-శేఖరానికి మతిచెడినంత పనయింది. ఓ పక్క తండ్రి పోయాడనే దిగులు- మరోప్రక్క దాంపత్య జీవితం భగ్నమైందన్న దిగులు అందరికంటే అతీతంగా ఆదర్శంగా ఉండాలన్న ప్రయత్నం పోయి అందరికంటే అసహ్యంగా అయిపోయింది అనే ఆవేదన - శేఖరం ఆరోగ్యం పాడయిపోయింది. ఈ మధ్యలో మామగారు, బావమరుదులు

ఉద్యోగంకోసం ప్రయత్నంచెయ్యమనే వేధింపు శేఖరం ప్రతిదానికీ చిరాకుపడ సాగాడు. ఒకరోజు ఏదో డబ్బు విషయంలో పెద్దగొడవ జరిగి అమూల్య తండ్రిదగ్గరికి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ పోతూ మెళ్ళో మంగళసూత్రాన్ని తీసి "నువ్వింత చాతకానివాడివని తెలిస్తే చచ్చినా పెళ్ళిచేసుకునేదాన్ని కాను!" అంటూ మొహాన విసిరికొట్టింది. ఆ వెళ్ళిపోవటం ఆఖరని, అప్పటికే అమూల్య మరొకరితో సంబంధం పెట్టుకొని అతడ్ని పెళ్ళిచేసుకోవటానికి సిద్ధంగా ఉందనీ శేఖరానికి తెలియదు. ప్రతిసారిలా అతను అమూల్యను తీసుకురావటానికి మామగారి దగ్గరికి వెళ్ళలేదు. గాయపడ్డ అతని హృదయం కోలుకోవటానికి టైం కావాలంది. శేఖరం తనను తను తమాయించుకుని, నిగ్రహం తెచ్చుకుని ఆమెని యెలా దారికి తీసుకురావాలో నిర్ణయించుకుని మామగారి దగ్గరికి వెళ్ళేసరికి అప్పటికే నాలుగురోజుల క్రితమే ఆమె ప్రసాదుతో కలకత్తా వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకునే ప్రయత్నంలో ఉన్నారని అతను కొద్దిరోజులలో అమెరికా వెడుతున్నాడని, ఆమెగూడా వెళుతుందని అనవసరంగా ఆమెకోసం వెర్రిప్రయత్నాలు చెయ్యొద్దని, మంచిగా డైవోర్సు చెయ్యటం ఉభయకుటుంబాల పరువుప్రతిష్ఠలకి మంచిదని ఆయన గట్టిగా అర గంటసేపు లెక్చరిచ్చాడు. కొయ్యబారిపోయిన శేఖరం ఇంటికి తిరిగివచ్చాడు. యెలా చేసుకుంటుంది ప్రసాదుని? తనకి ప్రసాదు తెలుసు. తనలో లేనివి ప్రసాదులో ఏం వున్నాయని అతన్ని చేసుకుంటుంది?

తననికాదని అసలు యెలాచేసుకుంటుందో? కోపంతో, అవమానంతో, నరనరం కాలిపోతున్న శేఖరం ఆమెమీద ప్రతీకారం తీర్చుకోవటానికి ప్రసాదు పెళ్ళి విఫలంకావడానికి ప్రయత్నాలు చెయ్యసాగాడు. దాదాపు ఒక నెల పోయిం తర్వాత అనుకోకుండా ఆమె దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. అందులో, తన మానాన తనని పోనివ్వమని – ఒకవేళ తిరిగివచ్చినా తనతో శేఖరం సుఖపడ లేడనీ – కనీసం ఇలా మంచిగా విడిపోనయినా విడిపోతే మళ్ళీ ఎప్పుడన్నా కలుసుకున్నప్పుడు స్నేహితులుగా పలకరించుకోవచ్చని రాసింది. దానికి శేఖరం జవాబు రాయలేదు. జవాబు రాయలేదని ఆమె ఊరుకోలేదు. వెంట వెంట అతనికి ఉత్తరాలు రాయటం మొదలుపెట్టింది. వాటిల్లో జీవితంపట్ల తనకున్న అభిలాష, కోర్కెలు, అన్నీ వివరిస్తూ రాసేది. ఉత్తరాలు చాలా సహజంగా, న్యాయంగా, ప్లెయిన్‌గా ఉండేవి. వాటిల్లో వేటినీ శేఖరం కాదనలేకపోయేవాడు. ఆఖరి ఉత్తరంలో రాసింది ఆమె: "నీలో నేను మొదట చూసినవి ఇప్పటికీ

ఉన్నాయి. వాటిని నేను ఎక్కడున్నా యే సమయంలోగూడా గౌరవించి అభిమానిస్తాను. కాని నాకు ముఖ్యంగా కావాల్సినవి నీలో లేవు. అవి వున్నా యని నన్ను మోసపుచ్చుకోలేను. ఒకవేళ అలా మోసపుచ్చుకుందామని అను కుంటే జరిగే ఫలితం నాకు తెలుసు. అందుకే నే నిటువైపు వెళ్ళటంలేదు. నాలో లేనివి నీకు కూడా తెలుసు. నాకు కావాల్సిన విధంగా మారమని నిన్నెలా అడగనో-అలాగే నీకు కావాల్సిన విధంగా నేనూ మారలేను. ఇలాగయితే ప్రపంచంలో ఎన్ని వివాహాలు జయప్రదం అవుతాయి అని నువ్వడిగితే నేను జవాబు చెప్పలేను. మనలో నూటికి తొంభై జీవితాలు త్యాగమనే చక్రంలో ఆకుల్లా తిరిగిపోతున్నాయి. చాలామందికి అసలు జీవితం అంటే యేమిటి? దాన్నెలా అనుభవించాలి అన్న ప్రశ్నలేకుండా బ్రతుకుతున్నారు. అలాంటి వాళ్ళకి చెయ్యెత్తి నమస్కరించవచ్చు. వాళ్ళకే బాధలూ ఉండవు. నేనలాటి వాన్ని కాను. నాకు ప్రత్యేకంగా కావాల్సినవి కొన్ని ఉన్నాయి. అవి పోతే పోయినాయి. కానీ వాటికోసం నేను ప్రయత్నం చెయ్యకుండా ఉండలేను. ప్రసాదుని నేను చేసుకున్నానంటే అతనేదో మహా పొడిచేశాడని-ధీరుడని-అందరికి అతీతుడని గాదు. ఒక విధంగాఅతను నీకంటె చాలా తక్కువే. కానీ నీలా అతను జీవితాన్ని నా యిష్టం వచ్చినట్లు అనుభవించడానికి అడ్డురాడు. నేనంటే పిచ్చి యిష్టం. అంతవరకే తెలుసు అతనికి. అదెంత హాయి. నీలా అతడు తన ప్రేమతో బంధించాలనిగాని-ఆ ప్రవాహంలో ముంచాలని కాని చూడడు. శుక్రవారం మేం యిద్దరం న్యూయార్క్ బయలుదేరుతున్నాం. నాకు తెలియని లోకాలకు యెగరటానికి ప్రసాదు నాకు రెక్కలు యిస్తున్నాడు. అంతే! అక్కడనుంచి తిరిగివస్తానని నమ్మకంలేదు. జీవితంలో మన పరిచయానికి గతమేగాని భవిష్యత్ లేకపోవచ్చు. నన్ను క్షమించు. నాకు తెలుసు నువ్వు కోరుతున్న విధంగా నే నుండలేకపోయానని. అందుకు నేను దిగులుపడడం లేదు. సెలవు" చాలా వివరంగా రాసిన ఆ ఉత్తరాన్ని చాలాకాలం దగ్గర పెట్టుకున్నాడు శేఖరం. ఆమె అమెరికా వెళ్ళిపోయింది. తనకు ఉద్యోగం దొరికింది. ఆంధ్రప్రదేశ్ రాకముందే హైద్రాబాదు వచ్చేశాడు. తన సంస్కృతి తన స్వజనానికి సంబంధంలేని నగరం. అనవసరంగా సానుభూతి చూపేవాళ్ళు కాని జీవితంలో ఓడిపోయానని వెక్కిరించేవాళ్ళుకాని, అమూల్యమందు చాత కాని వాడనైనానని గుర్తుచేసేవాళ్ళుగాని లేరు. మనసు, మనసుతోపాటు జీవిత విధానాన్ని గూడా మార్చుకుని హైద్రాబాద్‌లో సెటిల్‌అయ్యాడు శేఖరం.

ఇప్పుడెవ్వరికీ అతనికి పెళ్ళయినట్లు తెలియదు. మళ్ళీ పెళ్ళిచేసుకోమని సలహా యిస్తున్న మిత్రుల్ని తిరస్కరించేవాడు. ఇన్ని విధాలా ఉన్న అతనికి ఆడవాళ్ళంటే విముఖత్వం యెందుకో యెవ్వరికీ అర్థంఅయేదికాదు. మళ్ళీ ఆడవాళ్ళతో అతని ప్రవర్తన చాలా మృదువుగా ఆకర్షణీయంగా ఉండేది. మళ్ళీ పెళ్ళిచేసుకోగలనని శేఖరం కల్లోకూడా అనుకోలేదు.

తర్వాత చాలాకాలానికి వోసారి ఓ స్నేహితుడు పెళ్ళిచూపులకు తోడు రమ్మనమని బందరు దగ్గర ఓ పల్లెటూరికి తీసికెళ్ళాడు. ఆ పెళ్ళికూతురే వాసంతి. చాలా శ్రోత్రియ కుటుంబంలో పుట్టిన వాసంతికి పుట్టిన ఊరు తప్ప ప్రపంచం తెలియదు. పుట్టుకతో వచ్చిన విజ్ఞానం తప్ప పుస్తకాల ప్రభావం లేదు. అడవిమల్లెలా వున్న వాసంతి అమాయకపు మొహంతో పసిపిల్ల మనస్తత్వాన్ని ప్రతిబింబింపచేసే పెద్ద పెద్ద కళ్ళతో తలయెత్తలేని సిగ్గుతో శేఖరాన్ని మొదటిచూపులోనే ఆకర్షించింది. "పేరేమిటని" అడుగుతున్న శేఖరమే పెళ్ళికొడుకనుకున్న వాసంతి కళ్ళల్లో మెరుపులు కురిపిస్తూ "వాసంతి" అంది. ఆ అమ్మాయి యేం చదువుకోలేదని, పైనుంచి వాళ్ళు తన హోదాకి తగినవారు కాదని ఆ సంబంధాన్ని తోసిపారేశాడు శేఖరంమిత్రుడు. తర్వాత తనే స్వయంగా యీ సంగతి తెలియపరుస్తూ తనకున్నవి తెలియపరుస్తూ మీకేమీ అభ్యంతరం లేకపోతే మీ అమ్మాయిని నేను చేసుకుంటానని ఉత్తరం రాశాడు.

తిరుగుటపాలో ఉత్తరానికి పిల్లతండ్రి పరుగెత్తుకొచ్చాడు. తన మొదటి వివాహాన్ని గురించి స్థూలంగా వివరిస్తూ ఆ అమ్మాయి పోయిందనీ, మళ్ళీ తనకు పెళ్ళి చేసుకోవాలనిపించలేదనీ యింత కాలానికి వాసంతి తన మనసులో ఆ కోర్కెను కదిపిందనీ చెప్పాడు. స్థితిగతులు తెలుసుకున్న ఆయన మొహం విప్పారింది. పెళ్ళిచూపులకు రావటం కేవలం అమ్మాయి అదృష్టం అని పదే పదే చెప్పి కళ్ళలో నీళ్ళు తిరిగినంత సంతోషం పొంది, ఆయన తిరుగుమొహం పట్టాడు. మరుసటి నెలలో వాసంతితో శేఖరం వివాహం జరిగిపోయింది.

వాసంతి రాకతో శేఖరం జీవితమే మారిపోయింది. చాలాకాలంనుంచీ ఆధారంలేక అడ్డదిడ్డంగా పాకుతున్న మనసుకి పెద్ద ఆధారం దొరికినట్లయింది. కానీ యిదంతా వాసంతికి తెలియదు. సంభాషణలో మూడొంతులు వాసంతివే ఉంటాయి. ఒకవంతులో సగం శేఖరం నవ్వుతూ ఉంటాడు. జీవిత తటాకంలో ప్రశాంతత పొందిన నీరు తేటగా తేరుకోసాగింది. పాత అనుభవాలు అడుక్కి వెళ్ళిపోయాయి. పూర్తిగా ధైర్యం కలిగింది. హమ్మయ్య అనుకుంటున్న సమ

యంలో మళ్ళీ రాయి విసరబడింది. అమూల్య వచ్చింది. ఈసారి నీళ్ళు మలినం అయితే తేర్చటం తనకి సాధ్యంగాదు. అందుకే శేఖరం భయపడుతున్నాడు. అతన్ని మరీ మరీ బాధిస్తున్న విషయం తనమీద అమూల్య ప్రభావం పూర్తిగా పోయిందనుకున్నాడు. కాని అదేంలేదు. తాత్కాలికంగా పక్కకు ఒరిగి ఒదిగి వుంది. సమయం చిక్కగానే మళ్ళీ ఉరుకుతోంది మీదకి. అదీ బాధిస్తున్న విషయం.

చాలాసేపట్నుంచీ యేవేవో చెప్తున్నాడు శేఖరం. అతని గుండెలమీద అలాగే పడుకొని వింటోంది వాసంతి. చెవిదగ్గర టకటకమని గడియారంలా కొట్టుకుంటున్న అతని గుండె ఒకోసారి బాధగా, ఒకోసారి కోపంగా ఇంకోసారి అతిబాధగా రకరకాలుగా మారుతున్న కంఠస్వరం గదిలో బెడ్‌లాంప్ నుంచి లేతనీలంగా వస్తున్న కాంతి అదోరకంగా వుండి గదిలో వస్తువుల్ని తమాషాగా చేసి చూపుతోంది. అవన్నీ కలిపి వాసంతికి ఇదంతా అబద్ధం, మాయ- శేఖరానికి వెనక ఇంత బాధ ఉండటం ఏమిటి? పచ్చి అబద్ధం అనిపించింది. నిజంగానే కథలా వుంది.

"నిజం వాసూ! నా కిప్పుడు తేలికనిపిస్తోంది. నిజంగా నేనింత బాధపడ వలసిందిగాని, భయపడవలసిందిగాని లేదేమో కదూ? ఏమిటి నిద్రపోతున్నావా? ఒక్కమాటగూడా మాట్లాడలేదు ఇంతసేపట్నుంచీ.... చెప్పు" భుజాలు పట్టి లేవదీస్తూ అన్నాడు శేఖరం.

"లేదు, లేదు. మీరు చెపుతున్న కథ వింటున్నాను" నీరసంగా మళ్ళీ అతని గుండెలమీదకి తలవాలుస్తూ అంది వాసంతి. శేఖరం మాట్లాడలేదు. తను తొందరపడ్డాడేమో? వాసంతికి అర్థం అవుతుందా? చెప్పకుండా వుంటే బాగుండేదేమో? అతని చేతులు వాసంతి జుట్టును- బుగ్గల్ని ఆప్యాయంగా నిమురుతూ ఉండిపోయాయి. మనసు హఠాత్తుగా, వేగంగా ఆలోచించసాగింది. లేదు, లేదు. తనమీద అమూల్య ప్రభావానికి బలమే లేదు. వాసంతి తన ప్రక్కనుంది. వాసంతితో జీవితం ముడిపడిపోయివుంది. అమూల్య ఒకటి!

అమూల్య వచ్చి యెదురుగా కూర్చున్నా తను చలించడు. అవును, నిజం. అమూల్యకి తనంటే ఏమిటో యింకా బాగా తెలియాలి. వాసంతితో కలిసి ప్రస్తుతం తను అనుభవిస్తున్న జీవితాన్ని చూసి ఈర్ష్యపడాలి. తనని గురించి ఆలోచించేందుకు ఒక్క సెకనుకూడా ఖాళీలేకుండా వాసంతి ఆక్రమించు కుందని తెలియాలి. తను అనవసరంగా ఖంగారుపడుతున్నాడు. ఇది మంచికే

వచ్చింది. ఒకవేళ యెప్పటికీ అమూల్య యిక్కడే వుండిపోవటం తటస్థిస్తే తనీ వూరునుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోతాడు. ట్రాన్స్‌ఫర్ కుదరదు, చెయ్యము అంటే నా వాసంతిని తీసుకుని ఇంకెక్కడికైనా వెళ్ళిపోతాను. అంతేకాని, అమూల్యని గడప తొక్కనివ్వను. ఆలోచిస్తున్న ంతను పరధ్యానంగా వున్న వాసంతిని మరింత గుండెలదగ్గరికి లాక్కున్నాడు.

"నే నొకటి అడగనా?" చాలా సేపటికి మొదటిసారిగా మాట్లాడుతూ ంరసంగా అంది వాసంతి.

"ఏమిటది చెప్పు? ఇహనుంచి నీకు తెలియని విషయమంటూ లేదు."

"ఆమె తిరిగిరావటం మీకేమన్నా అన్పిస్తోందా?"

"అంటే...?" అర్థంకానట్లు వాసంతి కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

"అంటే యేంలేదు. నన్ను పెళ్ళిచేసుకోవటంలో త్వరపడ్డా రనిపిస్తోంద మీకు? చెప్పండి. నేను వేరుగా, పరాయిగా అన్పించటం లేదుగదూ! ఇన్నాళ్ళ మనజీవితం ఏంకాకుండా పోదుగా మీకు?"

"ఏమిటి నువ్వనేది?"

"మీరు పడేబాధ చూస్తూంటే ఆమె మీద అభిమానం వున్నట్లే వుంది. ఆవిడంటే లెక్కలేనట్టే వుంటే మీరసలు బాధపడనేపడరు."

"నీ మొహం, అదేంకాదు. ప్రపంచంలో నాకున్నది ఒక్కరే- అది వాసంతి! ఆ వాసంతికీ, నాకూ మధ్య అడ్డుగా ఏదీరాదు. వాసంతి తనంత తాను నన్నొ క్కర్లేదంటే తప్ప. నువ్వు చాలా అలిసిపోయావు. ఇహ పడుకో. నీ కసలిది చెప్పి ఉండకూడదు. నేనొక మూర్ఖుణ్ని. చూడు, నీ మొహంలో ఇందాకటి చిరు నవ్వు లేదు. కళ్ళుకూడా అనుమానంగా భయంగా వున్నాయి. నువ్వు నన్ను నమ్మలేకపోతే నేనేం చెయ్యలేను వాసంతీ! ఆవిడ నాకేంకాదు. ప్రపంచంలో వున్న లక్షమందిలో ఆవిడ ఒకత్తి. నువ్వు అనవసరమైన ఆలోచనతో మనసు పాడుచేసుకోనని నాకు మాట యివ్వాలి. నీ ఆరోగ్యం అసలే సరిగ్గా లేదు. ఈ రెండురోజుల్లో చాలా తీసినట్లు కన్పిస్తున్నావు. డాక్టర్ సుశీల వచ్చిందా? ఏమంది?" వాసంతి చేతుల్ని తన బుగ్గలకి, కళ్ళకి అన్చుకుంటూ అడిగాడు శేఖరం. ఆఖరిమాటకి వాసంతి మొహంలోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. "ఎలా చెప్పటం అతనికి? ఇప్పుడా... యిలాగా. ఊహూ, యిప్పుడు కాదు" అనుకుంటూ "రేపు మీరు ఫోన్‌చేసి అడగండి!" అంది.

"అదేం! నీకు చెప్పలేవూ?"

"చెప్పలేదు." అంది వాసంతి నిర్లిప్తంగా.

తెల్లవారుఝామయింది. చల్లగాలి కిటికీలోంచి దూసుకొస్తోంది. బాగా అలసిపోయిన యిద్దరూ నిద్రకు ప్రయత్నం చేయసాగారు.

మర్నాడు వాసంతి లేచేసరికి బాగా బారెడు పొద్దెక్కింది. తెల్లగా బాగా మెరుస్తున్న యెండ కిటికీ చువ్వల్ని దూసుకొచ్చి లోపల డ్రాయరు, కుర్చీ, పుస్తకాలు వాటిమీద పడ్తోంది. మంచంమీద బద్ధకంగా బరువుగా కళ్ళు తెరిచిన వాసంతికి అంతా కలలో యేదో పెద్దగొడవ జరిగి తను స్పృహతప్పిపోయినట్లు అన్పించింది. క్షణంసేపు రాత్రి జరిగింది. శేఖరం చెప్పింది అంతా వట్టి కలేననిపించింది. ప్రక్కకు తిరిగి చూసింది. కానీ శేఖరం లేడు. వళ్ళంతా బరువుగా బాధగా వుంది. జ్వరం తగిలిందని థర్మామీటర్ చూపింది.

వాసంతి లేచి యివతలకు వచ్చేసరికి శేఖరం హాల్లో కూర్చుని కాఫీ తాగుతూ, పేపరు చూసుకుంటున్నాడు. మామూలు ప్రకారం అతని స్నానం అయిపోయింది. వాసంతి మెల్లగావచ్చి శేఖరం కుర్చీప్రక్కన నిలబడింది. "మెలకువ వచ్చిందా? కళ్ళు చాలా యెర్రగా ఉన్నాయి. ఇంకొంచెంసేపు పడుకోకపోయావా? నిద్ర చాల్లేదులా ఉందికదూ?" నవ్వుతూ చెయ్యి తీసుకుని ఏదో చెప్పబోతున్నాడు శేఖరం. హఠాత్తుగా వాసంతి వంగి మోకాళ్ళమీద కూర్చుని అతని చేతుల్లో మోహందాచుకుని యేడుస్తూ "రాత్రి చెప్పిందంతా అబద్ధం కదూ! అబద్ధం అని చెప్పండి నాకు! నాకేదో భయం వేస్తోంది" అంది.

శేఖరం క్షణంసేపు మాట్లాడలేదు. తర్వాత చాలా తగ్గుస్థాయిలో చాలా నిశ్చలంగా, నెమ్మదిగా "అవును అంతా అబద్ధమే- నీకు కల్పించి చెప్పానులే. రాజావాళ్ళు వస్తారు. వెళ్ళి మొహం కడుక్కొనిరా- ఇదేమిటీ వేడిగా ఉందేం వళ్ళు. జ్వరం వచ్చిందా!" హఠాత్తుగా, ఆదుర్దాగా చేయిపట్టి లేవదీస్తూ అన్నాడు.

వాసంతికి జ్వరం బాగానే వచ్చింది. డాక్టర్ సుశీలకి ఫోన్‌చేశాడు. ఆవిడ డ్యూటీమీద ఉంది-సాయంత్రం కాని రాలేనని యెవరితోనో చెప్పించింది. ఆ రోజు శేఖరం ఆఫీసు మానేశాడు. వాసంతి ప్రక్కనే కూర్చుని చాలా మామూలుగా అవీయివీచెప్తూ తమాషాలుచెప్పి నవ్విస్తూ కూర్చున్నాడు. వాసంతిని విడిచి కనీసం ముందు హాల్లోకి కూడా వెళ్ళలేదు. ఇష్టం లేకపోయినా శేఖరం కోసం చారూ అన్నం తింది వాసంతి.

బాగా పన్నెండయింది. తన మంచం ప్రక్కన వాలుకుర్చీలో కూర్చొని యేదో పుస్తకం తిరగవేస్తున్న శేఖరాన్ని వున్నట్లుండి అడిగింది- "ఆవిడ

సుకన్యాదేవికి తప్ప ఇక్కడ యింకెవ్వరికీ తెలియదా ?" అని. "తెలియదు. నువ్వింక ఆ ప్రసంగం యెత్తొద్దు" గంభీరంగా అన్నాడు శేఖరం, పుస్తకం తిరగవేస్తూ.

వాసంతి ఆపైన మాట్లాడలేదు. శీతాకాలపు మధ్యాహ్నం పన్నెండుగంటలు దాట్తూండగానే ఎండ తిరిగిపోతోంది. సన్నగా వీస్తున్న గాలికి గుమ్మానికున్న కర్టెన్ కదులుతోంది. గదిలో గోడలమీద పాకిన వాజర్‌ప్లాంట్ ఆకుల్ని కిటికీలోంచి వచ్చి పిచ్చుక ఒకటి పొడిచి తుంపాలని ప్రయత్నం చేస్తోంది. మధ్యాహ్నం చాలా దిగులుగా ఏదో పోగొట్టుకున్న దానిలా వుంది. మోచేయి దిండుమీద ఆన్చిపడుకుని చేతిలో పుస్తకాన్ని తిరిగేస్తోంది వాసంతి. ఏదో చప్పున అయిపోయి జరగవలసిందేదో జరిగిపోతే బాగుండుననిపిస్తోంది. నాటకంలో సీను సీనుకి మధ్య ఇంటర్వ్యాల్‌లా వుంది. ఇంతలో ఫోన్ మోగింది. "సుశీలా"అంటూ శేఖరం లేచి వెళ్ళి రిసీవర్ తీశాడు. అంతవరకూ పుస్తకం తిరిగేస్తున్న వాసంతి కళ్లెత్తి అతని మొహంలో మారబోయే భావాలకోసం పరీక్షగా చూస్తోంది. సుశీల చెప్పబోయేదేమిటో వాసంతికి తెలుసు. కానీ యిప్పుడీ సమయంలో—ఇలా—సుశీల చెప్పకుండా వుంటే బాగుండు. అసలు యింకెవరయినా అయితే బాగుండు ననిపిస్తోంది.

"హలో !" అన్నాడు శేఖరం రిసీవర్ తీసుకుని.

".... ...." అవతలనుంచి ఏ స్వరం విన్పించిందో ఏమని విన్పించిందో తెలియదు. కానీ హఠాత్తుగా శేఖరం మొహంలో గబగబా రంగులు మారాయి. కంఠస్వరం కూడా మారింది. ఫోన్ వైర్‌ని చేత్తో సాప్‌చేస్తూ చాలా గంభీరంగా మాట్లాడటం మొదలుపెట్టాడు. "ఇందులో క్షమాపణ యేమీ లేదండీ ! రాత్రి నా ప్రవర్తనకి నేనే చెప్పుకోవాలి. ఏదయినా ముందుగా కొంచెం ఏ మాత్రం తెలిసినా అలాటి సంఘటన జరిగేది కాదు. అందులో మీకు తెలియని రహస్యం ఏంలేదు."

".... ... " మళ్ళా అవతలనుంచి ఏదో విన్పించింది.

"అబ్బెబ్బె ! మీ మీద కోపం యెందుకు ! యేమిటీ ? మాట్లాడాలంటోందా? క్షమించండి ! మా యిద్దరికీ గతమే తప్ప భవిష్యత్తు లేదన్నానని చెప్పండి. యెప్పుడు ఎలాంటి పరిస్థితుల్లోనూ మా మధ్య మాట్లాడవలసిన మాటలేం లేవు. ముందు నా ప్రశ్నకు జవాబు చెప్పండి. ప్రసాద్ కిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయిందా !.... ఓహో ! అలాగా, నేను ఒక వేళ ట్రాన్స్‌ఫర్ అయిందేమో

అనుకుంటున్నాను. ఇందులో మీ దగ్గర దాచవలసిందేమీలేదు. ఒకవేళ వాళ్ళు ఉద్యోగరీత్యా ఇక్కడికి వచ్చేటట్లయితే నేను రేపే ట్రాన్స్ఫర్ చేయించుకుని వెళ్ళిపోదాం అనుకుంటున్నాను. మేం ఇద్దరం ఒక ఊళ్ళో వుంటూ తెలియకుండా ఉండటం అసంభవం."

"... ... ..."

"ప్రస్తుతం వాసంతికి తెలియని విషయం అంటూ ఏమీ లేదండీ! నిన్న రాత్రి వరకూ తెలియదు. కానీ మీ ఇంటిదగ్గర్నుంచి వచ్చాంతర్వాత అంతా చెప్పేశాను! ఇప్పుడు నాకు చాలా తేలికగా వుంది." నిట్టూర్పు విడుస్తూ అన్నాడు శేఖరం. మంచంమీద కూర్చున్న వాసంతి రెప్పవాల్చటం గూడా మర్చిపోయి తదేకంగా భర్తని గమనిస్తోంది.

"లేదండీ! మీరు గట్టిగా చెప్పండి 'మాకు కలుసుకోవాల్సిందిగాని మాట్లాడు కోవాల్సిందిగాని ఏమీలేదని.' నేను ఉంటాను.... అవును: ఆఫీసుకు వెళ్ళలేదు. వాసంతికి ఒంట్లో బాగాలేదు" ఫోన్ చప్పుడుచేస్తూ పెట్టేశాడు శేఖరం. అంత వరకూ శేఖరం వంక పరీక్షగా చూస్తూన్న వాసంతి చప్పున తల తిప్పుకుని కిటికీలోంచి బైటకు చూస్తున్నదానిలా కూర్చుండిపోయింది.

తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్న శేఖరం చాలాసేపటివరకూ ఏం మాట్లాడ లేదు. పుస్తకం తిరగేస్తూ ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు! వాసంతిగూడా ఏం మాట్లాడలేదు! నాలుగు దాటిపోయింది. రాజు కాఫీ తెచ్చియిస్తుండగా శేఖరం అన్నాడు: "ఇదుగో చూడు రాజూ! దబ్బున ఏదయినా టిఫిన్ చెయ్యి. లేకపోతే బజారుకుపోయి ఏవైనా పళ్ళు తీసుకురా! కాఫీచేసి ఫ్లాస్క్‌లో పోసి వుంచు-మేం అలా డ్రైవ్‌కి పోతున్నాం, తిరిగి వచ్చేసరికి కొంత ఆలస్యం అవుతుందేమో?" రాజు సరేనని తలూపి వెళ్ళిపోయాడు వాసంతివైపు చూడ కుండానే. కాఫీ తాగుతూ "నువ్వు త్వరగా తయారుకావాలి వసూ! ఇలా ఇంట్లో కూర్చోటం నాకు బాగాలేదు. అలా హిమాయత్ సాగర్ పోదాం- రాజుని క్యారియర్‌తో భోజనంకూడా పెట్టమంటాను కారులో. ఈ రాత్రికి తిరిగి రావద్దు. నువ్వు కొంచెం మొహంకడుక్కుని బట్టలేసుకో—" శేఖరం మాటలు సాంతం పూర్తికాకమునుపే టెలిఫోన్ మోగింది. కాఫీ తాగుతున్న శేఖరం ప్రశ్నార్థ కంగా ఫోన్‌వైపు చూశాడు. కాఫీ తాగటం మానేసిన వాసంతి శేఖరం మొహంలోకి చూడసాగింది.

కాఫీ తాగడం పూర్తిచేసి నిదానంగా లేచివెళ్ళి రిసీవర్ తీసుకున్నాడు "హల్లో" అంటూ

వాసంతి చేతిలోకప్పు అలాగే పట్టుకుని భర్తమొహంలోకి మళ్ళీ రెప్పవాల్చ కుండా చూడసాగింది.

"ఎవరు?" కొంచెం కటువుగానే అడిగాడు శేఖరం.

"............"

"ఓ! డాక్టర్ సుశీలా! నమస్తే నమస్తే! అయింవా డ్యూటీ?" శేఖరం మొహం ప్రసన్నమయింది. అంతవరకూ చూస్తున్న వాసంతి చప్పున దృష్టి అంతా కాఫీమీదకు మరల్చుకుని జాగ్రత్తగా తాగుతున్నట్లు తాగసాగింది 'ఇప్పుడా—ఇప్పుడా' వాసంతి గుండెలు కొట్టుకుంటున్నాయి.

"ఏమిటీ బహుమతా? బహుమతేమిటీ? అహ(! వాసంతి నాకేం చెప్పలేదే" వెనక్కి తిరిగి వాసంతివైపు చూస్తూ అన్నాడు. అప్పటికే కాఫీ తాగడం పూర్తి చేసిన వాసంతి కప్పు వంగి క్రిందనున్న స్టూలుమీద పెట్టేసి పుస్తకంలో తల దూర్చి బొమ్మలు చూడసాగింది.

"అడగమంటారా, ఆగండి అయితే" మౌత్‌పీస్‌ని అరచేత్తో మూసి "సుశీల తనకి బహుమతి కావాలంటోందేమిటి? వసూ! దేనికి?" అన్నాడు.

"యేమో నాకు తెలియదు. ఆవిడనే అడగండి" రక్తం అంతా ఒక్కసారి మొహంలోకి వచ్చేసినట్లు యెర్రబడిన మొహాన్ని మరింత దించేసుకుంది వాసంతి.

"మిమ్మల్ని అడగమంటోంది" మళ్ళీ ఫోన్‌లో మాట్లాడుతూ అన్నాడు శేఖరం.

"ఆ(! ఏమిటీ? సరిగా వినపడటంలేదు. ఊ(! యేమిటి మీరనేది? నిజం సుశీల చెపుతోంది నిజమేనా వసూ!" వెనక్కి తిరిగి అడిగాడు శేఖరం. పుస్తకం లోకి మొహం దించేసుకుంది జవాబుగా వాసంతి.

"థాంక్స్ సుశీలా! మీకు స్పెషల్ పార్టీ ఇస్తానని ప్రామిస్ చేస్తున్నాను నేను ఉంటాను" ఫోన్ పెట్టేశాడు అతను.

ఫోన్ పెట్టేసిన శేఖరం వెంటనే పరుగెత్తుకుని దగ్గరకు వచ్చెయ్యలేదు క్షణంసేపు అలాగే నిలబడిపోయి భార్యను చూసి ఆ తర్వాత నెమ్మదిగా వచ్చి మంచంమీద ప్రక్కగా కూర్చున్నాడు.

"నిజమా వసూ! నాకు ఇంతవరకూ చెప్పలేదేం?" తన భుజంచుట్టూ చెయ్యి వేసి అడుగుతున్న శేఖరం మాటలు వింటూనే వాసంతి చప్పున పుస్తకం వదిలి అతని వళ్ళో తలదాచుకుంటూ "రాగానే చెప్పాలనుకున్నాను కానీ టైం దొరక లేదు. అందులో యీ గొడవలో అసలెలా చెప్పాలో తెలియలేదు."

"నాకోసం నువ్వింత మంచివార్త దాచుకుని ఉంటే నేను నిన్నెంతో బాధించాను కదూ! క్షమించు వాసంతీ?" యేదో అనబోతున్న శేఖరాన్ని చేత్తో వారిస్తూ "ముందు నాకిది చెప్పండి మీ కెలా అనిపిస్తుంది? సంతోషంగా లేదూ?"

"దానికి జవాబు కావాలంటే నువ్వు తలెత్తి కళ్ళుతెరిచి నా మొహంలోకి చూడాలి" అదోరకంగా మారిపోయిన కంఠస్వరంతో అంటున్న భర్తకేసి తల తిప్ప కళ్ళుతెరిచి చూడబోతున్న వాసంతి చెంపలమీద అప్పటికే నిండిపోయి జారిన కన్నీటి బిందువులు పడ్డాయి. వాటిని కొనగోటితో తుడుస్తూ శేఖరం "ఇంతకంటే మంచివార్త యింకేముంటుంది నాకు? మనలో చాలా సంసారాలు నూటికి దాదాపు తొంభై పిల్లల మూలంగానే నిలుస్తున్నాయి అంటే అతిశయోక్తి కాదు సుమా! మన సంసారం అలాటిది కాకపోయినా..." వంగి వాసంతి నుదురుమీద ముద్దుపెట్టుకుంటూ అన్నాడు.

బాగా సాయంత్రం అయిపోయింది. శేఖరం, వాసంతి తయారయినారు. గేరేజ్‌లోనుంచి కారుని బయటకు తీసి వరండా ముందుకు తేవటానికి వెళ్ళాడు శేఖరం. హాల్లో అతనికోసం చూస్తూ నిలబడిన వాసంతికి ఫ్లాస్క్, పళ్ళ-భోజనం క్యారియర్ కారులో పెట్టి తిరిగివస్తున్న రాజు "సుకన్యాదేవి నౌకరువచ్చి ఇచ్చి వెళ్ళాడంటూ ఒక కవరు యిచ్చి వెళ్ళాడు. కవరు అంటించి వుంది. పైన శేఖరంపేరు ఉంది. ఇంతలో వాకిట్లోంచి శేఖరం పిలుపు విన్పించింది. వచ్చి కారులో ప్రక్కన కూర్చుంటూ రాజు ఇచ్చిన కవరు ఇచ్చింది- "ఏమిటిది?" కారు స్టార్టుచేయబోతున్న శేఖరం ఆగి కవరు చించాడు. అందులో ఉత్తర" ఉంది. చదువుకున్న శేఖరం పూర్తిచేసి చదవమన్నట్లుగా వాసంతి చేతికిచ్చాడు. "ఎవరు రాసింది?" ఉత్తరం తీసుకుని చూచింది వాసంతి. అది అమూల్య స్వయంగా రాసిన ఉత్తరం. అందులో ఇలా వుంది—

"శేఖరం!

నిన్ను వదిలిపెట్టి వెడుతున్నప్పుడు నేను చాలా అదృష్టవంతురాలినని, నిన్ను గెల్చానని అనుకున్నాను. కానీ నేను వెళ్తోంది అదృష్టపు శిఖరాలు అందుకోవటానికి కాదని—అఘాతపు లోయల్లో నామరూపాలు లేకుండా జారిపోవటానికని నాకేం తెలుసు. నువ్వు ఎప్పుడూ అదృష్టవంతుడివే. మొదట నన్ను పెళ్ళిచేసుకున్నప్పుడు లోకం నిన్ను అదృష్టవంతుడవని అంది. నేను విడిచి వెళ్ళిపోయినప్పుడూ అంది. యిప్పుడూ అంటోంది. ఈ కొద్ది సంవత్సరాల్లో నేను మానసికంగా మారాను. కొన్ని ఊహల తాలూకూ విలువలుగూడా అర్థమయినాయి.

అనుభవం చాలా పాఠాలు నేర్పింది. నిన్ను విడిచి పెట్టినప్పుడు వెళ్ళిన అమూల్యను కాను నేను." అందుకే యిప్పుడు హఠాత్తుగా వెళుతున్నాను. నువ్వు హైద్రాబాదులో ఉన్నావని తెలిస్తే నేనీ ఛాయలకికూడా వచ్చేదాన్ని కాదు. తెలియక పాత జీవితాన్ని జ్ఞప్తిచేసుకొని కాసేపు ఖులాసాగా గడుపుదామని సుకన్యాదేవి యింటికి వెళ్ళాను. సరిగ్గా అప్పుడే పుట్టినరోజు జరగటం, మీరు రావటం నా దురదృష్టం. రాత్రి చాలా బాధపడ్డాను. ముఖ్యంగా వాసంతి మొహం నన్ను నిద్రపోనివ్వలేదు. నాకు ప్రస్తుతం లేనివి—నేను అజ్ఞానంలో కాలదన్నుకున్నవి యిప్పుడు వాసంతికి ఉన్నాయి. ఒక్కసారి నీతో మాట్లాడాలని ప్రయత్నించి సుకన్యాదేవి చేత ఫోన్ చేయించాను. గతం తప్ప భవిష్యత్తు లేదన్న నా మాటని నాకు తిప్పి చెప్పావు. నీకేం భయమక్కరలేదు. నువ్వే ట్రాన్స్‌ఫర్‌కి ప్రయత్నం చెయ్యొద్దు. నేనే ఈరోజు సాయంత్రం వెళ్ళిపోతున్నాను. మళ్ళీ యెప్పటికీ కనబడనని వాగ్దానం చేస్తూ—

అమూల్య."

అమూల్య ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదివింది వాసంతి. అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అవి అమూల్య వెళ్ళిపోతోంది కదా అనే అనుభూతితో కాదు-యేదో పెద్ద ప్రమాదం జరగబోయి ఆగిపోయిందనే సంతృప్తితో, సంతోషంతో. ఎప్పటిలా తనూ శేఖరం మిగిలిపోయారు కదా అనే ధైర్యంతో. చేత్తో ఉత్తరాన్ని మడిచేసి బయటకు చూసింది వాసంతి. కారు హిమయత్ సాగరువైపు రివ్వున దూసుకుపోతోంది. ప్రక్కనుంచి బంజారహిల్స్ వెనక్కి భయంతో తప్పుకుంటున్నాయి.

రోడ్డుని తదేకంగా చూస్తూ ఫాస్టుగా డ్రైవ్‌చేస్తున్న శేఖరం ఒకచేత్తో డ్రైవ్ చేస్తూ రెండో చెయ్యి జాపి వాసంతిని దగ్గరకు తీసుకున్నాడు. అతని కళ్ళల్లో కూడా నీళ్ళు తిరుగుతున్నాయని, అవి నిగ్రహించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడని వాసంతికి తెలియదు. ప్రక్కకు తిరిగి భర్త భుజంమీద తలదాచుకుంటూ "నిన్న యీ టైమ్‌కి, ఈరోజు యీ టైమ్‌కి ఎంత అనుభవం పొందాను నేను. ఒక్క ఇరవై నాలుగ్గంటలలో యెంత మారానో!" అంది.

"ఒక్కసారి అంతే వసూ! ఇరవై నాలుగు గంటలే అక్కర్లేదు. యిరవై నాలుగు సెకన్లు చాలు మారటానికి" నెమ్మదిగా అన్నాడు శేఖరం.

---

వచ్చే సంచికలో

# నాకు నచ్చిన నా కథ

**తాళ్లూరు నాగేశ్వరరావు**

---



# సాహసుడు

సోమా చంద్రావళి

వాసు పెళ్ళి పందిట్లోనుండి బయటకు వచ్చేశాడు. పెళ్ళి చూడాలనే వుద్దేశ్యంతో రాలేదతను. సుజాత శ్రీమతి కాకమునుపే, కుమారిగా ఓసారి చూద్దామనే కోరికతో వచ్చాడు. పెళ్ళికొడుకు తాళిబొట్టు కడుతుండగా బయటికి కదిలాడు.

తల వంచుకుని కూర్చున్న సుజాత ముఖంలో ఏ భావమూ కనిపించలేదు, వాసుకి. ఆనందమూ లేదు. విషాదమూ లేదు. నిర్వికారంగా కూర్చుంది; జరిగేది తనకేమీ పట్టనట్లు.

సుజాతను పెళ్ళిచేసుకోవాలని, ఆనందకరమైన జీవితం గడపాలని ఎన్ని కలలు కన్నాడు తను! సినిమాలో విలన్ లాగా తమ ప్రేమకు అడ్డుపడనూ లేదు, ఆ పిల్లను చేసుకుంటే నీకు ఆస్తిలో చిల్లిగవ్వరాదూ అని తన తండ్రి గర్జిం

చనూ లేదు. - అసలు తమకు ఆ స్తోమతూ వుంటే కద, రావడానికి. అటు సుజాత తల్లిదండ్రులకీ ఎటువంటి అభ్యంతరమూ లేదు.

వాసుకి హఠాత్తుగా తను చదువుకునే రోజుల్లోకి వెళ్ళిపోవాలనిపించింది. ఎంత బాగా వుండేవి ఆ రోజులు! భవిష్యత్తు ఇంత భయంకరంగా, నిరాశాపూరితంగా వుంటుందని అప్పుడు తను ఎరగడు! బి. కామ్. మూడేళ్ళూ సుజాతతో మాట్లాడుతూ, తిరుగుతూనే గడిపేశాడు. ఇద్దరి కులాలూ ఒకటే! ఎక్కడో బీరకాయ పీచు చుట్టరికం వుండటంతో ఇరుపక్షాలూ అభ్యంతరం పెట్టలేదు. వాసుకంటే మంచి భర్తను తేగలనా అనుకున్నాడు, సాధారణ మధ్యతరగతి కుటుంబీకుడయిన సుజాత వాళ్ళ నాన్న! వీడికి వుద్యోగం వస్తే ఏదో కొంత కట్నం ఈయక పోరులే అనుకున్నారు వాసు తల్లిదండ్రులు!

ఒకటా, రెండా నాలుగు సంవత్సరాలు గడిచాయి. రోజురోజుకీ నిస్పృహ పెరిగిపోయింది వాసులో. ఉద్యోగం ఏదీ రాకపోవటంతో, టెంపరరీ ఉద్యోగాలు కొన్నాళ్ళు చేశాడు కానీ లాభంలేక పోయింది. సుజాత చెల్లెలు ఎదుగుతూ వచ్చేసరికి, సుజాత తలిదండ్రులు భయపడ్డారు. సుజాత పెళ్ళికి త్వరపడ్డారు. ఈ స్థితిలో వాసుని పోషించడమే ఎక్కువనీ, వాసుకి ఉద్యోగం రానిదే పెళ్ళి చేయననీ ఖచ్చితంగా చెప్పాడు వాసు తండ్రి. ఉద్యోగం లేనివాడికి పిల్లనివ్వడానికి జంకారు సుజాత తండ్రి! కూతుర్నీ, అల్లుడినీ పోషించే స్థితిలో అయనా లేడు.

ఫలితంగా సుజాత పెళ్ళి ఓ పశువుల డాక్టరుతో నిశ్చయమయింది.

డబ్బులేనివాడి ప్రేమ ఎందుకు కొరగాదన్న సత్యం తెలిసివచ్చింది వాసుకు.

పశువుల డాక్టరు!

వాసు నిర్వికారంగా నవ్వుకున్నాడు. తను చదువుకునే రోజుల్లో పశువుల డాక్టరంటే ఎంత చులకన చేసేవారు. అదీ ఓ చదువేనా అనుకునేవాళ్ళు!

ఇప్పుడు చదివేదీ, ఉద్యోగం ఏదీ అన్న ప్రసక్తి రావడం లేదు. ఎంత సంపాదిస్తున్నాడు? పెళ్ళాన్ని పోషించగలడా అన్న ప్రశ్న మాత్రం వస్తోంది.

తనెలాగూ ఈ వలయం లాంటి సామాజిక వ్యవస్థనుండి బయటపడలేడు. కనీసం సుజాతయినా సుఖంగా వుండనీ....మనస్ఫూర్తిగా అనుకున్నాడు వాసు.

* * *

వాసు కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయింది. వసారాలో వున్న అతని తల్లి అక్కసుగా అడిగింది.

"సుజాత పెళ్ళికి వెళ్ళావుటరా నువ్వు?"

పరధ్యానంగా ఉన్న వాసు 'ఊఁ' కొట్టాడు అన్యమనస్కంగా.

"సిగ్గులేదట్రా నీకు? నీకిస్తామన్న పిల్లకి పెళ్ళవుతుంటే ఎలా వెళ్ళబుద్ధ యిందిరా"

ఉలిక్కిపడ్డాడు వాసు, తల్లి గొంతు గట్టిగా వినపడేసరికి.

"లేదమ్మా! లేదు. పెళ్ళికి వెళ్ళ లేదు!" అన్యమనస్కంగా గదిలోకి వచ్చి మంచంమీద వాలిపోయాడు.

వాసు వదిన వచ్చి భోజనానికిరమ్మని పిలిచింది. ఆమెతో పాటు ఆమె పిల్లలు ముగ్గురూ, రెండో అక్క పిల్లలిద్దరూ వచ్చారు. "బిలబిలమంటూ వీళ్ళెప్పుడు వచ్చారు?" అక్క పిల్లల్ని చూస్తూ అన్నాడు వాసు.

"అక్కయ్య వచ్చిందా?"

"అవును! మూడోకాన్పుకి వచ్చింది. ఈ సారి ఆపరేషన్ చేయించుకుంటుంది కాబోలు!"

ఆవిడ సగమే మాట్లాడినా మిగిలిన సగం అర్థమయింది వాసుకి. ఖర్చు భరించవలసింది మేమేగా. అందరికేం పట్టిందీ అన్న బాధ వుంది ఆవిడ కంఠంలో.

నిజమే! అన్నయ్య ఎల్డీసీ! తండ్రికి పెన్షన్ తప్ప మరేం లేదు. ఎవరు మాత్రం సాలెగూడు లాంటి ఈ ఆర్థిక వ్యవస్థ నుండి తప్పించుకోగలరు?

ఆకలి లేదని చెప్పి వదినని పంపించి వేశాడు వాసు. ఆవిడ అట్టే బ్రతిమి లాడలేదు. ఎంతోసేపు తర్వాత నిద్ర పట్టిన వాసుకి తను పెద్ద వలయంలో చిక్కుకుపోయినట్లు కల వచ్చింది.

* * *

మూడు నెలలు తిరగకుండా వాసు పెళ్ళి జరిగిపోయింది. సుజాతకు పెళ్ళి జరగటంతో, ఉక్రోషంతో మండిపోయిన వాసు తల్లి, వాసు పెళ్ళి జరిపేవరకూ నిద్రపోలేదు. వాసు నిస్పృహాయంగా తల వూపటం తప్ప ఏమీ చేయలేకపోయాడు.

తను ఇప్పుడు అశక్తుడు! నోరు మెదపటానికే వీలులేదు. వాళ్ళ చేతిలో కీలుబొమ్మ! వాళ్ళు ఎలా చెబితే అలా వినవలసిందే!

వాసు వివాహం చేసుకున్న పిల్ల అనంతలక్ష్మి తలిదండ్రులకు ఒక్కతే కూతురు. వాళ్ళు పదివేలు కట్నం యిచ్చింది చాలక ఆస్తంతా కూతురుదే అని ప్రకటించారు. అంతకంటే మంచి సంబంధం వాళ్ళకు రాలేదని కాదు! ఉద్యోగం లేని వాసును ఇల్లరికం ఉంచు కోవాలని వారి ఎత్తుగడ!

వాసు కట్నం పదివేలూ ఏమయిపో యిందో వాసుకు తెలియదు. తండ్రి అప్పులే తీర్చుకున్నాడో, ఇంటిల్లిపాదీ బట్టలే కుట్టించుకున్నారో, పెళ్ళికూతురికి నగలే పెట్టారో, పెళ్ళి ఖర్చులకే చాల లేదో అతను ఎరుగడు! అతనికి మిగిలిం

ఎవరికి యిచ్చారో నాకు తెలీదు. ఇచ్చిన వాళ్ళను అడిగి తెలుసుకోండి! మాటి మాటికీ పదివేల సంగతి ఎత్తితేమాత్రం మర్యాద దక్కదు" కోపంగా అన్నాడు.

"కట్నం సంగతి వదిలేయ్! నువ్వు యిల్లరికం వుంటానంటేనే కదా, నీకు నా కూతుర్నిచ్చి పెళ్ళిచేసింది! ఇప్పుడిలా అర్థంతరంగా వెళ్ళిపోతానంటే ఎట్లా?" నిలదీశాడు భూషయ్య.

"ఇల్లరికం వుండమని మీరు నన్ను పెళ్ళికి ముందు ఎప్పుడడిగారు?" వాసుకి సహనం పోతోంది.

"నిన్నడగకపోతే మాత్రం! మీ నాయనకి చెప్పలేదా?"

"వెళ్ళి ఆయన్నే అడగండి! నాకు తెలియదు."

నిర్లక్ష్యంగా అనేసి వాసు లోపలికి వెళ్ళిపోయాడు. వాసు అత్తగారు ఎదురయింది.

"మా పిల్లని వదిలేసి మేమెలా వుండేది, నాయనా?" అని దీర్ఘంతీసింది.

"వుండలేకపోతే మీరూ వచ్చి మీ కూతిరి దగ్గరే వుండండి!"

"ఇది మరీ బాగుంది. మా ఆస్తులూ, యిల్లూ వదిలేసి అల్లుడిదగ్గర బతికేఖర్మ మాకేం పట్టిందీ?" అవిడ గొణిగింది సన్నగా.

వాసుకు ఒళ్ళు మండిపోయింది. విసురుగా ఏదో అనబోయి, తమాయించుకుని భార్య దగ్గరకు వెళ్ళాడు.

"నాకు వుద్యోగం వచ్చింది. వెళ్ళా లనుకుంటాను. నా వెంట వస్తావా?"

"నేవస్తే మా అమ్మా, నాన్న ఎట్లా?" అమాయకంగా అడిగింది అనంత.

మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు వాసు. వెంటనే వూరికెళ్ళి వుద్యోగంలో జాయిన్ అయిపోయాడు.

నెల తరువాత తండ్రి వుత్తరం వ్రాస్తే వెళ్ళాడు వాసు.

"ఏమిట్రా యిదీ?" అన్నాడు తండ్రి, వాసు వెళ్ళగానే.

"ఏం చేశాను?" వాసు ఆశ్చర్య పోయాడు.

"నువ్వు యిప్పుడు ఈ వుద్యోగం చేయకపోతే ఏం?"

వాసుకు కోపం వచ్చింది.

"ఉద్యోగం చేస్తే ఇపుడు వచ్చిన నష్టం ఏమిటి!"

"మీ మామ వచ్చి నా మీద ఎగిరి పడ్డాడు. వాళ్ళకున్న పొలాలూ, ఆస్తులూ చూసుకుంటూ అక్కడే వుండొచ్చు కదా! లేనివాళ్ళయితే యిబ్బందిపడాలి కానీ, నీకేం తక్కువ!"

"ఒకప్పుడు ఈవుద్యోగం రాకపోయి నందుకే ఎంతో యిబ్బందిపడ్డాను. వదాక వదులుకోమంటారేమిటీ? అయినా ఇల్లరికం వెడతానని నేను చెప్పలేదే? వాసు కోపాన్ని అతి ప్రయత్నంమీద అదిమిపెట్టుకున్నాడు.

"చెప్పకపోతే మాత్రం, ఆ మాత్రం గ్రహించుకోలేవా? ఉద్యోగం లేనివాడికి

ఒక్కగానొక్క కూతురిని ఎందుకిస్తున్నారనుకున్నావు! కూతురు కళ్ళెదుట ఎల్లకాలం వుండాలనే వాళ్ళి పెళ్ళి చేశారు!" కోపం వచ్చింది వాసు తండ్రికి.

"కళ్ళెదుటే కూతురు వుండాలనుకుంటే అలాగే వుంచుకోమనండి! ఎవరు వొద్దన్నారు? నాకసలు ఈ పెళ్ళి చేయమని నేనడగలేదు. వద్దు మొర్రో అని ఎంత మొత్తుకున్నా, అసలు వినిపించుకున్నారా?" అక్కసంతా వెళ్ళగక్కాడు వాసు.

కోపం రెట్టింపైంది వాసు తండ్రికి.

"అవున్రా! ఎద్దుల్లా వున్న పిల్లల్ని ఎంతకాలం సాకను? ఇప్పుడు ఈ బోడి వుద్యోగం వచ్చిందని మహా విర్రవీగుతున్నావ్ కానీ, రాకపోతే అక్కడే పడి వుండేవాడివి కదా! నీ మంచి కోరే ఈ పెళ్ళిచేశాను, తెలుసా?"

వాసు వినిపించుకోలేదు. మొండిగా వూరికి వెళ్ళిపోవడానికి ప్రయాణమయాడు. తల్లి బ్రతిమిలాడింది, ఒక్కసారి అత్తవారింటికి వెళ్ళమని.

"మొగుడే కావలిస్తే ఆవిడే వస్తుంది. నీకు తెలీదులేమ్మా!" అన్నాడు నిర్లక్ష్యంగా.

"వెళ్ళనీలేవే! ఆ జీతం చాలక ఇబ్బందిపడినపుడు వాడే కాళ్ళబేరానికి వసాడు." అన్నాడు తండ్రి!

వాసు వెళ్ళిపోయాడు. మరో మూడు నెలలు గడిచాయి. వాసుకి తన జీతంలో గడపటం ఎంతో ఇబ్బందిగా వున్నా బాధపడలేదు. ఒకరి క్రింద బానిసగా తను బ్రతకటం లేదు. అదే అతనికి తృప్తినిస్తోంది.

వాసు ఈ సారి యింటికి వెళ్ళినపుడు తల్లి అతనికి ఓవార్త చెప్పింది. అనంతలక్ష్మికి ఐదో నెల అట!

వాసుకీ వార్త పెద్ద ఆనందాన్ని కలిగించ లేదు. అనంత కడుపున మరో భూషయ్య పుడతాడు కాబోలు ననుకున్నాడు.

ఈ సారి తల్లి బలవంతంమీద అత్తవారింటికి వెళ్ళక తప్పలే దతనికి. వెళ్ళగానే అల్లుడి మర్యాదలు బాగానే జరిగాయి.

భోజనాలయినాక మామగారగారు-

"అయితే వుద్యోగం వదులుకుని వచ్చినట్టేనా?"

వాసు కెందుకో నవ్వొచ్చింది.

ఒకప్పుడు ఈ వుదోగ్యం అనే పదం తన్నెంత బాధించింది? అది ఎప్పుడు వస్తుందా అని కలవరించాడు. ఈ వుద్యోగమే కొన్నాళ్ళు ముందు వచ్చినట్లయితే సుజాత తన భార్య అయేది! అప్పుడు ఉద్యోగంరానందుకు చింతించిన వారంతా ఇప్పుడు తనను ఉద్యోగం వదులుకోమంటున్నారు. విధిలీల అంటే యిదేనేమో!

తిరిగి ప్రశ్నించాడు వాసు మామగారైన భూషయ్య.

"లేదండీ! వుద్యోగం ఎందుకు

వదులుకుంటాను? ఊరికే చూసిపోదామని వచ్చాను!" ఆయన ప్రశ్నకు సాధ్యమయినంత క్లుప్తంగా జవాబు చెప్పాడు వాసు.

మండిపడ్డాడు భూషయ్య.

"మా అమ్మాయిని నీతో పంపమని అడగడానికొచ్చావా? నేను పంపడం దాన్ని కూడులేకుండా చంపడానికా, నీ మూడొందల జీతంలో.... పైగా అది వట్టి మనిషి కూడా కాదు. పోనీ నీ పదివేల కట్నం వుందా అంటే అదీ లేదు. పది వేలు తెచ్చి నా కూతురి పేరిట బ్యాంకులో వెయ్యి! అప్పుడు పంపుతాను నా కూతుర్ని!

వాసు సరాసరి అనంత దగ్గరికి నడిచాడు.

"ఏం అనంతా! నాతో వస్తావా?" సాధ్యమయినంత సౌమ్యంగా అడిగాడు.

"మా నాన్న పంపనంటున్నాడు. ఏం చేయను?"

"ఆయనెవరు మధ్యలో పంపకపోవడానికి! నువ్వు వస్తానంటే తీసుకుపోతాను. ఏం మరి, నాతో వస్తావా చెప్పు!" లాలనగా అడిగాడు.

"మీ మూడు వందల జీతమేం సరిపోతుంది మనకు? మీ కిచ్చిన కట్నం మీవాళ్ళు తినేశారటగా!"

"అదంతా నీ కనవసరం! నాతో వస్తావా, రావా? ముందు ఈ మాట చెప్పు!" వాసు కంఠం కోపంగా మారింది.

"మీరే వుద్యోగం వదులుకుని యిక్కడకు రాగూడదూ?"

వాసు వెంటనే తనని తాను తిట్టుకున్నాడు. ఇక్కడికి రావటం ఎంత బుద్ధితక్కువ? వాసు వెళ్ళిపోతుంటే భూషయ్య గొణగసాగాడు. ఆస్తంతా పుట్టబోయే పిల్లపేరిట వ్రాసేస్తాననీ, ఛస్తే తన కూతుర్ని పంపననీ అనసాగాడు.

వాసు తిరిగి వూరుకి వెళ్ళిపోయాడు, కబురు తల్లికి చెప్పిపోదామని. ఇంట్లో ఎవరూ ఏమీ అడగలేదు.

అన్నం పెడుతూ చెప్పింది వాసుతల్లి.

"సుజాత మూడు నెలలనుండీ యిక్కడే వుంటోందిరా!"

ముద్ద నోట్లో పెట్టుకోబోయినవాడల్లా ఆగిపోయాడు వాసు.

"ఏం" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏమో మరి! మొగుడొదిలేశాడని అంటున్నారు. ఇదివరకే అత నెవర్నో ఉంచుకున్నాట్ట. వాళ్ళమ్మ రోజూ నిన్ను తలచుకుని ఏడుస్తోందిట! తెగించి నీకిచ్చినా బాగుండేదని. మేము చేసినా బాగుండేది. నీ కాపురం కుదుటబడేది!" అంది ఆవిడ నిట్టూర్చి.

వాసుకి మరి ముద్ద మింగుడుపడలేదు. సాయంత్రం గుళ్ళో కలవమని అన్న కూతురిద్వారా సుజాతకు కబురు పంపించాడు.

సాయంకాలం సుజాతకోసం గుళ్ళో

ఎదురుచూడసాగాడు వాసు సుజాత కొంచెం ఆలస్యంగా వచ్చింది. ఓ మూలగా కూర్చున్నాక అడిగాడు వాసు.

"నేను విన్నది నిజమేనా సుజా!"

"ఏమిటి?"

"అదే మీ ఆయన...." పూర్తిచేయ లేదు వాసు.

"నగం నిజం!" అంది సుజాత తలవంచుకుని.

"అంటే...." ప్రశ్నార్థకంగా చూశాడు వాసు.

"పెళ్ళినాటికి ఆయన వయసు ముప్పై రెండు. అంతకు ముసుపే ఒకావిడతో పరిచయంవుంది. ఆవిడకి ఇద్దరు పిల్లలు రిజిస్టర్ మ్యారేజి చేసుకున్నాడను కుంటాను. అంతాకలిసే వుండమన్నాడు. నేను యిమడలేకపోయాను. వచ్చేశాను." క్లుప్తంగా చెప్పింది సుజాత.

వాసు ఏమీ మాట్లాడలేదు. తిరిగి సుజాతే మాట్లాడింది.

"అమ్మా, నాన్నా చాలా బాధపడు తున్నారు వాసూ! కొన్నాళ్ళు ఆగి నీకే యిచ్చివుంటే బాగుండేది అనుకుంటు న్నారు."

"మా అమ్మా అదే అంటోంది. ముందుగా మీరు అడిగినప్పుడే నిన్ను చేసుకునివుంటే బాగుండేదని," నిట్టూ ర్చాడు వాసు.

"అదేం? నీకేం తక్కువయింది? ఒక్కగానొక్క కూతురు. బోలెడంత ఆస్తి!" ఆశ్చర్యపడింది సుజాత.

సుజాతమాట మధ్యలోనే అడ్డుకుని, తన కథ వివరించాడు. అంతా విని నిట్టూర్చింది సుజాత.

"పోనీ వుద్యోగం వదిలేయ గూడదూ!"

"నీకు తెలీదు సుజా! ధన మదంతో కళ్ళు కప్పుకుపోయిన వాళ్ళమధ్య నేను మసలలేను. ఈ వుద్యోగం ముందే దొరికివుంటే నేను నిన్ను చేసుకునే వాడిని. ఇప్పుడు నా భార్య నా దగ్గరికి రాకపోవడానికి ఈ వుద్యోగమే అడ్డు వస్తోంది. ఎంత చిత్రమో చూశావా?" నవ్వాడు వాసు.

సుజాత మాట్లాడలేదు. తదేకంగా గుడిగోపురంవైపు చూస్తోంది. వాసూ అటే చూడసాగాడు.

ఇద్దరి మనసుల్లోనూ ఒకటే భావన!

ఇరువైపుల పెద్దలు పూనుకుని వుంటే తమ జీవితాలు చాలా బాగుండేవి. సాలెగూడులాంటి ఈ సామాజిక వ్యవస్థకి తాము బలైపోయారు.

తన భర్త ఎప్పటికైనా తనను ఆద రించకపోతాడా అని సుజాత ఆలోచి స్తోంది. అనంత ఎప్పటికైనా మారగలిగి తనదగ్గరికి వస్తుందా అనీ వాసు ఊహి స్తున్నాడు. ఇద్దరిలోనూ నమ్మకం వుంది. ఆ నమ్మకం వారిని భవిష్యత్‌లో నడి పిస్తుంది.

———



చీకట్లో చెట్టుక్రింద భార్యా బిడ్డలతో నిద్రపోతున్న సైదులు— మొహం మీద రెండు నీటిచుక్కలు పడటంతో కళ్ళు తెరిచాడు.

చీకటి గుయ్యారంగా వుంది. చెట్టు ఆకులమీద పడే వానచినుకుల మోత టపటపా వినబడుతోంది.

సైదులు లేచి కూర్చున్నాడు.

అప్పుడప్పుడూ తళుక్కున మెరిసే మెరుపుకాంతిలో పారుతున్న వాననీరు కనబడింది. చాలా సేపట్నుంచీ కురుస్తోందన్న మాట. దట్టంగా ఆకులతో వున్న కుంకుడుచెట్టు క్రింద పడుకోటం వల్ల ఇంతదాకా తనమీద ఒక్క నీటి చుక్క పడలేదు.

మెరుపు కాంతిలో భార్యాపిల్లల్ని చూసాడు సైదులు. వాళ్ళు అదమరచి నిద్రోతున్నారు.

తల గోక్కుని లేచి గోనెగుడ్డ తీసాడు.

చెట్టు ఆ కొమ్మనించి ఈ కొమ్మకి కట్టి భార్యాబిడ్డలమీద వాన చినుకులు పడకుండా జాగ్రత్తపడ్డాడు. బొడ్లోంచి

బీడీముక్క తీసి వెలిగించుకుని వాళ్ళ పక్కనే ముడుచుకు కూర్చున్నాడు.

"ఎదవ్వాన!" తిట్టుకున్నాడు. అలా అన్నాడో లేదో వానజల్లు ఎక్కువైనట్టు శబ్దం ఎక్కువైంది.

—తెల్లారేసరికి వూళ్ళో బావులన్నీ నిండిపోతాయి. బొక్కెనా తాడూ లేకుండానే అందరూ నీళ్ళందుకుంటారు. ఇంకా తనని పిల్చేవాళ్ళెవరూ? పూడికలు తీయించుకునేవాళ్ళెవరూ? చిరాగ్గా గుప్పుక్కున వూసి బీడీదమ్ము గట్టిగా లాగేడు సైదులు.

—"బావుల్లో పూడికలు తీస్తాన్! సావాన్లు తీస్తాన్!" అని తను అరవక ముందే "నేనున్నానోరే!" అని లేస్తుంది ఈ ఎదవ్వాన!

బావుల్లో పూడికలు తీస్తూ, పడిన సామాన్లు తీస్తూ వూరూరా కుటుంబంతో సహా తిరుగుతూ పొట్టపోసుకుంటాడు సైదులు. తాడిలోతు నీళ్ళున్న నూతుల్లో కూడా ఇట్టేదిగి అట్టడుగునున్న బిందెల్ని బొక్కెన్లని నిముషాల్లో తీసెయ్యగల ఘనత సైదులదే. అతనంటే చుట్టూ వున్న పదూళ్ళకీ తెలుసు. వూరు కొక మూడ్రోజులు చొప్పున పదూళ్ళూ నెలలో చుట్టివస్తాడు. బావుల్లో పూడికలు, సామాన్లే కాక మంచాలు నేస్తాడు. పందిళ్ళు ఒక్కడే వేస్తాడు. ఇళ్ళు కడతాడు. పెంకుటిళ్ళు నేస్తాడు.

తన వృత్తిలో తన కెవ్వరూ పోటీ లేరు సైదులుకి— కానీ ఈ 'మాయదారి వానే' అప్పుడప్పుడూ పోటీపడి వస్తుంది.

—నిన్న సాయంత్రం ఇక్కడికొచ్చాడు సైదులు. ఇంతకు ముందు ఈ వూరొచ్చి నెల రోజులు దాటింది. బావులన్నీ బాగా పూడిపోయాయని ఆ నోటా ఈనోటా విన్నాడు. తన కోసం వూరివాళ్ళందరూ ఎదురుచూస్తున్నట్టు కూడా తెలుసుకున్నాడు.

కానీ ఇప్పుడీ వాన—....

వానకి గాలి తోడైంది.

మెరుపుల వెంట వురుములు పేట్రేగేయి.

కుండపోత వాన లంకించుకుంది.

సైదులు మీద వానబొట్లు ఏకధాటిగా పడనారంభించేయి.

బొట్లు ధారలుగా మారేయి.

భార్యాపిల్లలూ కూడా లేచేరు తడుస్తూ.

"చెట్టు మొదట్లో కెల్లండే!" అని చింకి పక్కబట్టల్ని గబగబా చుట్టేడు సైదులు. ఒక పక్కకి ఒరిగిన చిన్న పర్వతంలాంటి కుంకుడుచెట్టుమొదలు వాళ్ళు తలలు దాచుకునేందుకు స్థానమిచ్చింది.

వానదేవుడి బారినుంచి తప్పించుకుంటే, 'గాలి' దేవుడు వూర్కోలేదు. చల్లగా ఛెళ్ ఛెళ్న వచ్చి వాళ్ళను కుమ్మటం ప్రారంభించేడు.

సైదులు, వంటిమీద ఒక్క పంచె

పాచ తప్ప మరేం లేకపోయినా తట్టు కుంటున్నాడు. అతని భార్య కూడా బాగా ముడుచుకు కూర్చుంది. పిల్ల, పిల్లాడు మాత్రం గజగజలాడుతున్నారు. పళ్ళు టకటకా కొట్టుకుంటున్నారు.

"ఆ గోనెగుడ్డిప్పి ఇటదెయ్యరో!" భార్య ఆ మాట అనకముందే చెట్టు కొమ్మలకి కట్టిన గోనెగుడ్డిప్పి వాళ్ళ ముగ్గురికీ కప్పేడు సైదులు.

తిట్టుకుంటూ తనూ చెట్టుమొదట్లో ఒక పక్కగా కూర్చున్నాడు.

వాన కురుస్తూనే వుంది.

గాలి వీస్తూనే వుంది.

మెరుపులు, వురుములు, పిడుగులు హంగామా చేస్తూనేవున్నాయి.

"సీ! సీ! మాయదారి దేవుడు. నా నోట మట్టికొడతన్నాడు!" అని తిట్టు కుంటూనే ఎప్పటికో నిద్రలోకి జారు కున్నాడు సైదులు.

సూర్యుడి చురుకైన చూపులకి తట్టు కోలేక లేచేడు. అప్పటికే భార్యా పిల్లలు లేచారు. పిల్లలు 'ఆకలి' వెంటబడి ఏడుస్తున్నారు. భార్య "వుండండలా! పొద్దునవలేదింకా సస్తన్నారు ఆకలో అని. మీ అయ్య నడగండి" అని వాళ్ళ ద్దర్నీ కసురుకుంటోంది.

సైదులు అవన్నీ చూస్తూ చూడనట్టే వూరుకున్నాడు. గబగబా లేచి చకచకా దూరాన కనబడే చెరువు వైపు నడిచేడు.

కాలకృత్యాలవ్వగానే వచ్చి మోకు, చిన్న కర్ర, చూరుకుట్టు బద్ద తీసుకుని వూరిలోకి నడక సాగించేడు సైదులు.

పిల్లల ఆకలి కేకలు అతని చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి.

* * *

నడినెత్తికి సమీపించేడు సూర్యుడు.

—అప్పటికి వూరి వీధులన్నీ ఒక సారి చుట్టేశాడు సైదులు.

ఎవ్వరూ పిలవలేదు.

పలకరించినవాళ్ళు తేలిగ్గా నవ్వేసి "నిన్నటిదాకా లేని వాన రాత్రొచ్చేసిం దిరా సైదులూ! ఏంటో ఈ అకాల వర్షాలూ, వ్యవహారం. కలియుగం! ఋతుచక్రం కూడా అస్తవ్యస్తంగా తయారైంది" అన్నారు.

"అస్తవ్యస్తమైంది ఋతు చక్రం కాదు. నా బతుకు చక్రం" అనుకున్నాడు సైదులు.

మళ్ళీ రెండో ఇడత వీధులెమ్మటి బైల్దేరేడు.

"బాయిల్లో సావాన్లు తీస్తాన్! పూడి కలు తీస్తాన్! ఇళ్ళు కుడతాన్! మంచాలు నేస్తాన్!....." గొంతెండు తున్నా కేకలు పెడుతున్నాడు సైదులు.

ఇళ్ళ తలుపులన్నీ వేసివున్నాయి.

"అందరూ అయిగా అన్నం తింటు న్నారు" అనుకున్నాడు సైదులు.

రాత్రి రొచ్చయిన వీధులన్నీ రాళ్ళలా బిగుసుకుంటున్నాయి సూర్యుణ్ణి చూసి.

"ఈ వూరి బాయిలన్నీ ఒక్కమా

లేండిపోతే ఎంత బావుంటుందీ!" తన ఆలోచనకి తనే నవ్వుకున్నాడు సైదులు.

"బాయిల్లో సావాఁన్లు...." మళ్ళీ అరిచేడు.

ఇప్పుడతని పిల్లల ఆకలి కేకలు అతన్ని వెంటాడడం లేదు. తన కడుపు నకనకలే చెండాడుతున్నాయి.

నిస్సత్తువతో నడుస్తున్న సైదులు హఠాత్తుగా ఆగిపోయాడు. ఎక్కణ్ణించో వినవస్తున్న కేకలు, కోలాహలం అతణ్ణి ఆపేసాయి.

ఇంతలో ఎవరో పరుగెత్తుకొచ్చి చెప్పేరు—

"ఏయ్ సైదులూ! నాయుడిగారి నూతిలో ఎవరో పిల్ల పడిపోయింది అందరూ నీ కోసం ఎదుకుతున్నారురా!"

వచ్చినంత వేగాన సైదుల్ని లాక్కెళ్ళాడు వచ్చిన మనిషి.

సైదులు ముఖం విప్పారింది.

కొత్త వుత్తేజం వచ్చింది.

'బాయిలో పిల్లడిపోయింది' మనసులోనే సంతోషంగా అనుకున్నాడు. ఇదే సమయం. ఇప్పుడే సంపాయించుకోవాలి పదిరోజుల తిండి డబ్బు. ఆ 'పేనాన్ని' రక్షించే ముందు తన 'పేనాని'కి కావాల్సిన పైసలు మాట్లాడుకోవాలి. ఇప్పుడా పిల్ల చావుబతుకులు తన చేతుల్లో వున్నాయి. తనెంతడిగితే అంతిస్తారు వాళ్ళు. పిల్ల 'పేనం' కోసం.... కన్న బిడ్డ 'పేనం' కోసం డబ్బివ్వటానికి వెనకాడేవాళ్ళెవరుంటారూ?

తనెంత అడిగి, బెట్టుగా గట్టిగా బేరం కుదుర్చుకోవాలోనని చ క చ కా....గబగబా.... ధనధనా వూహించేసుకుంటున్నాడు సైదులు.

బావి దగ్గిర పడింది.

నడకలో వేగం తగ్గించాడు. అంటే వాళ్ళ ముందు కాళ్ళకి బంధమన్నమాట.

నూతి చుట్టూ జనం. "అయ్యో! అయ్యో! పిల్ల బుడగలేస్తోంది. తొందరగా రారా సైదులూ!" అంటూ వచ్చి సైదులు చేతులు పట్టుకున్నారు.

వాళ్ళ గాభరా అరుపులు తనకు 'లక్ష్మీ'దేవి పిలుపుల్లా—తనలో ఏనుగంత బలంలా వూహించుకుంటున్నాడు సైదులు. వాళ్ళ బతిమాలింపులకీ, అభ్యర్థనలకీ, అర్థింపులకీ చాలాసేపు మాట్లాడలేదు. అడుగు ముందుకి వెయ్యలేదు.

ఇక లాభంలేదని "ఆగండి! డబ్బెంతిత్తారు సెప్పండి ముందు!" నిశ్చలంగా అడిగేడు సైదులు.

అందరూ అవాక్కయిపోయారు క్షణం.

నూతిచుట్టూవున్న ఆడవాళ్లు లబోదిబో నోళ్ళు కొట్టుకుంటూ కన్నీళ్లు తుడుచుకుంటున్నారు. ఆశక్తతతో అరుస్తున్నారు.

"నీయవ్వ కడుపు బంగారంగానూ! ముందు పిల్లని తియ్యరా! ఇంకో క్షణం

ఆలస్యం చేస్తే పిల్ల ప్రాణంపోతుంది!" ఒకాయన నోరు పెగల్చుకున్నాడు.

"ముందు పిల్లని తియ్యరా! నీ డబ్బుకే వొచ్చే!" ఇంకో పెద్దమనిషి సైదులు భుజాల్ని కుదిపేడు.

సైదులు గుండె కరగలేదు. నిశ్చయంలో మార్పులేదు_

"అలాగేం కుదర్దు. ముందేసెప్పండి. నాకు గిట్టుబాటైతేనే దిగుతా. ఆఁ!" అందర్నీ తోసుకుంటూ వెళ్ళి పక్కన రాతిమీద కూర్చున్నాడు సైదులు.

అందరూ ఒకరిమొహాలొకరు చూసుకున్నారు.

"ఇదుగో! పదిరూపాయలు. కానీ!" ఒకాయన పది రూపాయలు తీసాడు జేబులోంచి.

"కుదర్దు. ఇరవై ...." తలతిప్పుకుని ఎటోచూస్తూ చెప్పేడు సైదులు.

"సరే! ఈ పదికూడా కలిపి ఇద్దాం. రామ్మూర్తిగారూ!" అన్నారింకొకరు ఇంకో పది జోడిస్తూ.

అంతే!

కత్తిలా తలతిప్పి, బాకులా చెయ్యి చాచి ఆ ఇరవై అందుకుని, క్షణాల్లో నూతులోకి దూకేసాడు సైదులు.

నూతిచుట్టూ ప్రజల్లో ఆందోళన! హాహాకారాలు!

"పాపం! ఎవరిపిల్లో! భగవంతుడి దయవల్ల బతికితే బావుణ్ను."

"ఎలా పడిందండీ అసలూ?"

"ఏమో పాపం! నేలబారు నుయ్యి. అందులో వాకిట్లోనే వుంది. ఏ ముష్టిపిల్లో పాపం!"

"నాయుడుగారికి అందరూ చెప్పారు_ 'పైకి వరలు కట్టించండి బాబూ!' అని. ఏదీ! ఆయన వింటేనా!"

జనం నానా రభసాపడుతున్నారు.

బావిలో మునిగిన సైదులు మరుక్షణం పిల్లని వెదకి పట్టుకోగల్గేడు. క్షణాల్లో పైకి వచ్చేసాడు.

అతని భుజంమీది పిల్ల శవాకారంలా వుంది. అయినా అందరి ముఖాలూ విచ్చుకున్నాయి.

పిల్లని పక్క అరుగుమీద పడుకోబెట్టి, తలనీళ్లు చేతుల్తో పిండుకుంటూ చూసాడు సైదులు_

అంతే!

సైదులు నవనాడులూ స్తంభించేయి.

కళ్లు బైర్లుకమ్మేయి.

_ఎదురుగా తన కూతురు!!

"లచ్చిమీఁ" గొంతు పగిలేలా అరుస్తూ కూతురిమీద వాలిపోయాడు సైదులు.

క్షణాల్లో అతని నోరు ఎండి తడారిపోయింది_తను కోరుకునే బావుల్లా.





# హంస మంజీరాలు

(గత సంచిక తరువాయి)

"రేపు నిన్ను బలి యిస్తారూ. నీచ్చేత్తోటే తోరణాలు కడితే దేవుడికి యిష్టం- నీ బలి దేవుడికి సరాసరి ముడుతుంది-అన్నట్టుంది ఆవిడగారి కోరిక" అని వెటకారం ఆడాడు భీముడు దారిలో.

"వారిని ఏమీ అనకు మామయ్యా! యిదంతా నాయిష్టంమీదే జరుగుతోంది" రాధ బాధగా అంది.

భీముడు మాట్లాడలేదు.

ఇద్దరూ యిల్లు చేరుకున్నారు.

* * *

తెల్లవారింది.

ఊరు వూరంతా హడావిడిగా వుంది.

దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే అన్నట్టు- అందరికీ కృష్ణమరాయుని పెళ్ళి తమ యింట్లో పెళ్ళే అన్నంత

---

సి. యస్. రావు & శివదత్త్

హడావిడిగా వుంది. వూరందరికి ఆ రోజున భోజనాలు ఏర్పాటు చేసారు. ఎవరి యిళ్ళలోనూ వంటలు లేవు. అంతా దివాణానికి చేరిపోయారు.

పందిరినిండా జనం చేరుచున్నారు.

పక్కవూరు నుంచి జమిందారు వీరేంద్రరావు కూడా వచ్చాడు. మరో వూరునుంచి కూడా మరో జమిందారు చంద్రశేఖరంగారు కూడా వచ్చారు. ఆయన కృష్ణమరాయుడి తండ్రికి స్నేహితుడు.

ఓ పక్క సనాయి కచేరీ జరుగుతోంది.

మరో పక్క మేజువాణీ జరుగుతోంది. వీరేంద్రరావుగారి కళ్ళు మేజువాణీ మీదే వున్నాయి. మేజువాణీకంటే మేజువాణీ నాయకురాలు పుష్పావతి మీదే వున్నాయి. పుష్పావతీ వీరేంద్రరావు కళ్ళతోటే మాట్లాడుకున్నారు. పుష్పావతి నమస్కారం చేసింది వీరేంద్రరావుకు. రాధ మేజువాణీలో కనబడకపోవడం వీరేంద్రరావుకి చికాకుగా వుంది.

రాధ లోపల సామానుగదిలో నల్లపూసలు గుచ్చుతోంది. బయటి కోలాహలం ఆమె చెవిని పడుతోనేవుంది.

"అయిందా అమ్మా" అంటూ పార్వతమ్మ పురోహితుడ్ని వెంటబెట్టుకొని రాధవున్న గదిలోకి వచ్చింది.

"అయిపోయిందండి" అంటూ పసుపు తాడుకి గుచ్చిన నల్లపూసలదండ పురోహితుడికి అందించింది రాధ.

రాధకూడ వారివెంట బయటకి వంది ట్లోకి వెళ్ళి ఓ మూలగా ఓ పందిరి స్థంభానికి జారబడి నిలబడింది.

ఆ స్థంభం పెళ్ళిమండపం వెనక భాగాన వుండటంచేత కృష్ణమరాయుడి దృష్టికి రాధ కనిపించడంలేదు.

ఒక పురోహితుడు మంగళసూత్రం పెద్దలందరికీ తాకిస్తూ అక్షింతలు యిస్తున్నాడు. పెళ్ళిపందిరి అంతా హడావిడిగా వుంది.

మంగళసూత్రధారణ సమయం వచ్చింది.

"మాంగళ్యం తంతునానేనా" అంటూ మంత్రాలు చదువుతున్నారు పురోహితులు-

కృష్ణమరాయుడు లేచి లక్ష్మి మెడలో తాళికడుతున్నాడు.

ఆ సమయంలో రాధ పందిరిస్థంభానికి జారబడి నిలబడి బొమ్మలా వుండిపోయింది.

కళ్ళుమూసుకుంది.

తన మెడలో ఒకనాడు కృష్ణమరాయుడు వేణుగోపాలస్వామి సన్నిధిలో వేసిన పులిగోరు పతకాన్ని చేతపట్టుకొని ఏదో తన్మయత్వంలో వుండిపోయింది ఆమె.

కృష్ణమరాయుడు తన మెడలోనే తాళికడుతున్నట్లు ఆ పెళ్ళిమంత్రాలు తన కోసమే చదువుతున్నట్లు ఏదో తెలియని అనుభూతిని పొందుతోంది రాధ.

లక్ష్మి మెడలో మూడుముళ్ళూ వేసిన

తరువాత తిరిగి తనస్థలంలో కూర్చుంటూ కృష్ణమరాయుడు అచంచలంగా స్థానువులా స్థంభానికి అనుకొని నిలబడి వున్న రాధను చూసాడు.

అదే సమయానికి రాధా కళ్ళు తెర చింది. ఇద్దరి చూపులూ కలిసాయి.

రాధ పెదవులమీద విరిగిన అలలాంటి నవ్వు దొర్లింది.

ఇంక అక్కడ వుండలేకపోయింది. కృష్ణమరాయుని కళ్ళు పందిరంతా వెతి కాయి. రాధ యింక కనబడలేదు అక్కడ. పార్వతమ్మకూడా కనబడలేదు.

రాధ తప్ప ఊరువూరంతా పెళ్ళి పందిట్లో వున్నారు.

## 24

కృష్ణమరాయుని వివాహం ఎంతో వైభవంగా జరిగిపోయింది. 'దేవుని పెళ్ళికి అందరూ పెద్దలే' అన్నట్టు కృష్ణమరాయుని పెళ్ళికి ఊరందరూ వచ్చారు. ఎంతో ఆనందంతో పాల్గొన్నారు. పేదాసాదా అన్న భేదంలేకుండా అందరూ ఆ పెళ్ళి తమ యింట్లో పెళ్ళి అన్నంత యిదిగా సరదాగా గడిపేసారు. దూరపు బంధువులూ, స్నేహితులూ చాలా వరకూ వెళ్ళిపోయారు. మరీ దగ్గర బంధువులూ ముఖ్యులూ మాత్రం యింకా మిగిలివున్నారు.

రాధ ఎవరికీ చెప్పకుండానే తాను వచ్చినపని పూర్తిచేసుకొని మంగళ సూత్రధారణ కాగానే వెళ్ళిపోయింది.

ఆ తరువాత పార్వతమ్మ ఆమెకోసం వెతికింది. ఆ తరువాత హడావిడిలో రాధ గురించి పట్టించుకోలేదామె. అయినా రాధ అనుక్షణమూ పార్వతమ్మ మన సులో మెదులుతూనేవుంది.

ఒకనాడు మసిబొగ్గు అని భావించిన రాధను యీనాడు పార్వతమ్మ మాణిక్యంగా భావిస్తోంది.

ఒకనాడు రాధ అంటే అసూయతో నిండిపోయిన ఆమె మనసు యీనాడు కృతజ్ఞతతో వుక్కిరిబిక్కిరి అవుతోంది.

ఆ రోజు రాత్రి కార్యం.

లక్ష్మిని చక్కగా ముస్తాబుచేసారు పేరంటాళ్ళు. తెల్లచేమంతిపూల జడ వేసారు. నెత్తిన పాపిడిచేరు- దండకు దండవంకీలు-పచ్చలు పొదిగిన గాజులు -మెడలో చంద్రహారాలూ, ముత్యాల హారాలు, రవ్వల నెక్లెసు- నడుముకి వడ్డాణము, కాళ్ళకు హంసమంజీరాలూ పెట్టారు. పాదాలకు ఎంతో నాజూకుగా పారాణిదిద్దారు. లక్ష్మి అలంకరణలో అచ్చు యుక్తవయలోవున్న లక్ష్మీదేవిలా వుంది.

గదిలోకి పంపించారు.

ఇక తంతూ, సరదా ప్రారంభమైంది.

కృష్ణమరాయుడు తెల్లని పిల్లుపంచె, గోధుమరంగు సిల్కులాల్చీ ధరించి పందిరిమంచంమీద కూర్చున్నాడు. లక్ష్మి వెంటవచ్చిన పేరంటాళ్ళు కృష్ణమరాయుడు లక్ష్మిరాకకై నిరీక్షిస్తున్నాడని

భావించినా నిజానికి అతని మనసక్కడ లేదు. అతని మనసు రాధను ఎప్పుడు చేరాలా అని తహతహలాడుతోంది. ఆ తహతహలోనే యీ కార్యం అనే తంతు ఎంత త్వరగా జరిగిపోతుందా అని ఎదురుచూస్తున్నాడు అతను.

తతంగం ప్రారంభించారు మంచం దగ్గరకుచేరిన పేరంటాళ్ళు ...

తమలపాకు చిలకలు చుట్టి లక్ష్మిచేత కృష్ణమరాయునికి యిప్పించారు. అతను కొరికిన చిలకను తిరిగి లక్ష్మికి యిప్పించారు. ఒకే గ్లాసులోని పాలను యిద్దరిచేతా తాగించారు. ఒకావిడ లక్ష్మి చెవిలో ఏదో చెప్పింది ఎంతో రహస్యంగా.

ఎవరు ఏది చేయమన్నా కృష్ణమరాయుడు దేనికీ కాదనలేదు. యాంత్రికంగా చేయసాగాడు. పేరటాంళ్ళు గదిబయటకు వెళ్ళి తలుపులు మూసారు.

కృష్ణమరాయునితో ఎంతో చనువుగా 'బావా బావా' అంటూ తిరిగే లక్ష్మికి తొలిసారిగా ఎక్కడలేని సిగ్గూ ముంచుకొచ్చింది తలుపులు మూయడంతోటే. ఛంగున మంచంమీదనుంచి కిందకు దుమికి, పందిరిమంచంకోడును ఆనుకొని ఒదిగి నిలబడింది.

కృష్ణరాయుడు నవ్వుకున్నాడు. తానూ మంచందిగి లక్ష్మికి దగ్గరగా వెళ్ళాడు. ఆమె భుజంమీద చెయ్యివేసి, 'రా- నా దగ్గర నీకు సిగ్గు ఎందురూ' అంటూ లక్ష్మిని తీసుకొచ్చి మంచంమీద కూర్చోపెట్టాడు. తానూ ఆమెపక్కన కూర్చున్నాడు.

గది అంతా సుగంధ పరిమళాలతో నిండిపుంది. మంచానికి చేరువగా రకరకాల ఫలహారాలు, పళ్ళు అందంగా అమర్చిపున్నాయి. వెండిగ్లాసులతో పాలు పున్నాయి. మంచంచుట్టూ పూలతోరణాలూ, మంచంమీద పూలపానుపూ- కృష్ణమరాయుని కదిలించలేకపోయాయి.

లక్ష్మితో మాటలు మొదలెట్టాడు కృష్ణమరాయుడు.

ఎదురుగాపున్న ఫలహారాలను చూస్తూ "నీకు ఏదంటే యిష్టం" అన్నాడు లక్ష్మితో.

"కోవాబిళ్ళలు" అంది ముక్తసరిగా.

ఇదే రాధ అయితే- ఈ ప్రశ్నకు సమాధానంగా పెదవి విప్పకుండా కళ్ళతోటే 'మీరు' అని బదులుచెప్పి పుండేది అనుకున్నాడు కృష్ణమరాయుడు.

రాధరూపం మనసులో మనస్సై పదిలంగా నేపున్నా రాధతో లక్ష్మిని పోల్చుకోగానే కృష్ణమరాయుడు క్షణంపాటు అచేతనంగా పుండిపోయాడు. నిజానికి అది అచేతనంకూడాకాదు. ధ్యానం! ఆ ధ్యానంలోనే తాను రాధకు యిచ్చిన మాట నిలుపుకోవడానికే యింత తంతుకూ తతంగానికీ అంగీకరించింది తను. ఆ మాటకోసమే దాదాపు నెల రోజులపాటు రాధతో తనకి ఎడబాటు.

ఈ రోజున తానిచ్చినమాట నిలుపుకొనే అవకాశం వచ్చింది. తనసూ రాధనూ మధ్య ఎడబాటు నేటితో మాసిపోతుంది; ఎంత రాత్రయినా యీ రాత్రి రాధను కలిసితీరాలి. తనూ తనకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూనేవుంటుంది- అలా కృష్ణమరాయుడు రాధా ధ్యానంలో మునిగిపోయాడు.

"ఏమిటి బావా ఆలోచిస్తున్నావు" అంది లక్ష్మి. వెంటనే నాలిక కొరుక్కుని 'నిన్ను బావా అని పిలవకూడదట. యిక. ఏమండీ అనాలట. అమ్మ చెప్పింది. ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది లక్ష్మి.

కృష్ణమరాయుడు లక్ష్మి అమాయకత్వానికి నవ్వుకొని "నువ్వు బావా అనే పిలు. ఫరవాలేదు." అన్నాడు.

"మనిద్దరమే వుంటే బావా అనే అంటానులే. పెద్దవాళ్ళు వున్నప్పుడు మాత్రం 'మీరూ! ఏమండీ!' అని పిలుస్తాను."

"నీకెలా పిలవాలనివుంటే అలా పిలు. నే నేమీ అనుకోను" అన్నాడు కృష్ణమరాయుడు.

"నువ్వు బలే మంచివాడవు బావా. యిందాక ఆడవాళ్ళంతా నీ గురించి రకరకాలుగా చెప్పారు. వాళ్ళు చెప్పిందానికీ- నీకూ- ఏమీ సంబంధంలేదు."

"ఏమన్నారేమిటి?"

"బావ చిరాకుపడతాడు- కోప్పడతాడు. నువ్వు బదులుచెప్పకూడదు. నవ్వుతూ- అతను చెప్పినట్టు చెయ్యాలి. అని సలహాలు యిచ్చారు వాళ్ళు నాకు నీ గురించి."

"వాళ్ళమొహం వాళ్ళకి తెలీదులే."

"ఒక్కమాట చెప్పు బావా!"

"ఏమిటి?"

"నేను అందంగా లేనా?"

"లక్షణంగా వున్నావు. నీకేంలోటు? బిళ్ళగన్నేరు పువ్వులా వున్నావు."

"గులాబీపువ్వులా లేనా?"

"గులాబీపువ్వుకి ముళ్ళు వుంటాయి నీకు లేవుగా?"

"పోనీ మల్లెపువ్వులా లేనా?"

"మల్లె మరీ సున్నితంగా వుంటుంది. నీలా బొద్దుగా వుండదుగా?" అన్నాడు కృష్ణమరాయుడు నవ్వుతూ.

"మరి బిళ్ళగన్నేరు పువ్వుకు అసలు వాసనే వుండదుగా మరి" అంది లక్ష్మి గారాబంగా.

"అయినా దేవునిపూజకు పనికివస్తుందిగా. మన ఆలయప్రాంగణంలో బిళ్ళగన్నేరు చెట్లు ఎన్నివున్నాయో నువ్వు చూశావుగా?" అని సముదాయించాడు లక్ష్మిని.

"నిజమే" అని లక్ష్మి నవ్వుకుంది.

"నీకు చాలా నగలున్నాయే" అన్నాడు కృష్ణమరాయుడు ఆమె వంటిమీద వున్న ఆభరణాలను చూస్తూ-

"యింకా చాలా వున్నాయి. నేను పెట్టుకుంటానంటే వద్దని, యివి చాలని-

తెలుగు సినీ పత్రికారంగంలో సంచలనం!

ప్రతి నెలా 38 లక్షలమంది పాఠకులకు పసందైన కనువిందు

కవ్వించి నవ్వించే
సెట్సుపై కబుర్లతో
ముచ్చటగొలిపే
తారల ముచ్చట్లతో
తాజా వార్తలతో-
వర్ణ చిత్రాలతో
ఇంటిల్లిపాదీ
చదవదగిన
రీతిలో
వెలువడు
తున్న

అనన్య ప్రచారం
గలిగిన తెలుగు
సినీ వారపత్రిక

జ్యోతిచిత్ర

యివే పెట్టారు. మొత్తం అన్ని నగలూ పెట్టుకొని వస్తానుండు అమ్మనడిగి" అంటూ మంచందిగింది లక్ష్మి. కృష్ణమరాయుడు "వద్దులే. యివి చాలు ఈవేళటికి" అంటూ లక్ష్మిని ఆపి మంచం ఎక్కించాడు మళ్ళీ కృష్ణమరాయుడు.

మంచం మధ్యగా కూర్చుంది లక్ష్మి. ఎదురుగా కృష్ణమరాయుడు కూర్చున్నాడు.

"యీ పాపిడిచేరు ఎక్కడ చేయించుకున్నావు" అన్నాడు కృష్ణమరాయుడు, ఆమె పాపిడిలో వేలాడుతున్న పాపిడి చేరును చూస్తూ—

"మా నాన్న నా చిన్నప్పుడే నాకోసమని ప్రత్యేకంగా పురమాయించి చేయించారట బొబ్బిలిలో. అమ్మ చెప్పింది."

"అలాగా! అందుకే అంత బాగుంది. ఈ రవ్వలదుద్దులు ఎక్కడ చేయించారో?"

"మద్రాసులో నట!"

"యీ చంద్రహారాలు ఎక్కడ చేయించారు?"

"రాజమండ్రీలో ఓ పెద్ద పనివాడు వుండేవాడట. అతనిచేత చేయించారట."

"దండవంకీలు ఎక్కడ చేయించారు?"

"కాకినాడ దగ్గర పిఠాపురంలో రాజాగారి ఆస్థానంలో వుండే పనివానిచేత చేయించారట."

"అందుకే అంత బాగున్నాయి. మరి యీ వడ్డాణం?"

"దీనికి చాలా పెద్ద కథ వుంది. ఒక కంసాలిని మా యింటిదగ్గరే వుంచి చేయించారు. మా అమ్మ ఒకసారి పెట్టుకుంటానంటే మా నాన్నగారు వప్పుకోలేదట. ప్రత్యేకంగా లక్ష్మికే ఆ వడ్డాణం అన్నారట. మా అమ్మ చెప్పింది."

"నీకోసమే ప్రత్యేకంగా పురమాయించి చేయించారన్నమాట యీ నగలన్నీ!"

"మరేమనుకున్నావు?" అంది లక్ష్మి గొప్పగా.

"మరి కాళ్ళకు వున్న యీ హంస మంజీరాలు ఎక్కడ చేయించారు?"

"యివా! విజయనగరం ఆస్థానంలో ఓ పేరుమోసిన కంసాలి వుండేవాడట. అతనిచేత చేయించారు. ఆ రాణీగారి హంసమంజీరాలు కూడా అతనే చేసాడట."

"బలే బాగున్నాయి లక్ష్మి యివి. నాకిస్తావా?" అన్నాడు కృష్ణమరాయుడు.

"తీసుకో!" అంటూ లక్ష్మి తన పాదాన్ని అతనిముందుకు చాచింది.

కృష్ణమరాయుడు తీసుకోబోయాడు. లక్ష్మి తన పాదాన్ని చటుక్కున వెనక్కి లాక్కుంది.

"యేం యివ్వవా?" అన్నాడు కృష్ణమరాయుడు.

"అబ్బే, ఎందుకు యివ్వనూ? నువ్వడగితే ఏమైనా యిచ్చేస్తాను. కాని నీకు నా పాదాలు తగలకూడదని అమ్మ

చప్పింది. అందుకు వెనక్కి తిసుకు న్నాను" అంటూ లక్ష్మి కాళ్ళకు వున్న హంసమంజీరాలను తీసి కృష్ణమరాయుని చేతికి అందించింది.

"ఏంచేసుకుంటావు? నువ్వు పెట్టు కుంటావా?" అంది నవ్వుతూ లక్ష్మి.

"నే పెట్టుకోనులే. సరదాగా ఆడుకుం టాను. అన్నట్టు నీకు పాలకోవా అంటే యిష్టం అన్నావుకదూ. నీకు కావలసినవి తిని, పాలు తాగి హాయిగా పడుకో. నేను మళ్ళీ వచ్చి లేపుతాను." అని కృష్ణమ రాయుడు ఆమె సమాధానం, అంగీకారం కోసం ఎదురుచూడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

## 25

చీకటి చిక్కబడింది. సగంరాత్రి గడిచిపోయింది. రాధ యింటి సింహ ద్వారం ఓరువాకిలిగా తెరచేవుంది. ఆ యింట్లోంచి వెలుగు రోడ్డుమీదకు పడు తోంది. ఆ నిశ్శబ్దపు నిశరాత్రిలో ఆ యింట్లోంచి ఏదో విషాదభరిత ఆలాపన వినిపిస్తోంది. విన్నవాళ్ళ గుండెలను కరిగించేటంత ఆవేదన ఆ ఆలాపనలో యిమిడివుంది.

అది రాధ స్వరమే. ఆ ఆలాపన యిప్పుడు ఆరంభమైనది కాదు. ఆమె కృష్ణమరాయుని పెళ్ళినుంచి యింటికి వచ్చినప్పటినుంచీ అలా ఆలపిస్తూనే వుంది.

యింటికి రాగానే భోరునఏడుస్తూ తన పక్కమీద వాలిపోయింది. నీటినుంచి బయటపడిన చేపలా కాసేపు విలవిలలాడి చివరకు గుండె రాయిచేసుకొని ఆలాప నలోపడింది. వ్యాకుల చిత్తానికి సంగీతం కొంత వోదార్పుగా అనిపించిందామెకు. ఓదార్పుకోసం సంగీతాన్ని ఆశ్రయిం చినా ఆమె మనసుకు వూరట దొరక లేదు. మధ్యమధ్య ఏడుపులు వస్తున్నాయి. కళ్ళవెంట సన్నని కన్నీటిజాలు జారు తూనేవుంది.

ఓరువాకిలిగా వున్న తలుపులను కృష్ణమరాయుడు తెరచాడు. అంతవరకూ శూన్యంలోకి దూసుకుపోతున్న రాధ చూపులు ఆ అలికిడికి కృష్ణమరాయుని వైపు మళ్ళాయి. అతన్ని చూడగానే ఆమె దుఃఖం ఒక్కసారి పెల్లుబికింది. చేతిలోని తంబురాను పక్కనపెట్టి ఒక్క పరుగున రాధ వెళ్ళి కృష్ణమరాయుని గుండెలమీద వాలిపోయింది. అతను ఆమెను అక్కున చేర్చుకున్నాడు.

రాధ ఏడుపుతోకూడిన ఎగుపులకు వూగిపోతోంది.

"ఊరుకో వచ్చాశానుగా" అంటూ రాధ తలను నిమిరాడు కృష్ణమరాయుడు.

అతను అలా అంటున్నకొద్దీ ఆమెకు మరింతగా ఏడుపు కట్టలుతెంచుకున్న వరదలా పెల్లుబుకుతోంది.

"ఎన్నో ఏళ్ళ ఎడబాటు తరువాత కలిసినట్టుంది." అంది రాధ.

"నాకు జన్మల తర్వాత కలిసినట్టుంది"

అని తనగుండెలమీద వాలి తనను అంటి పెట్టుకుపోయిన రాధను బాలీసుమీద కూర్చోబెట్టాడు కృష్ణమరాయుడు.

తన పైపంచెతో కళ్ళు వత్తాడు. ఆమెను పరకాయించిచూశాడు. తెల్లని బట్టలు కట్టుకొంది. తల విరబోసుకుంది. నుదుటిమీద కుంకుమరేఖ రాధ కన్నీరు చూసి కరిగిపోయిందా అన్నట్టు కరిగి వంకరతిరిగింది.

ఆమె ముంగురులను సవరించి "ఎందుకంత విషాదరాగం ఆలపిస్తున్నావు? వీధిచివరికి వినపడుతోంది." అన్నాడు కృష్ణమరాయుడు.

"కాంతుడు చెంతలేనపుడు ఏకాంతైనా ఏకాంతంలో ఆలపించే రాగం అదేగా స్వామీ" అంది రాధ.

"పిచ్చిరాధ! చెంతలేనుగాని, చిత్తం వదలి పోలేదుగా?"

"తనువును వదిలి చిత్తాన్ని మీవెంటే తీసుకుపోయారుగా?"

"మనల్ని ఎవ్వరూ వేరుచేయలేరు. కావాలని నువ్వే నన్ను దూరంచేసుకున్నావు. ఇదిగో నువ్వు కావాలన్న మా ఆవిడ హంసమంజీరాలు తెచ్చాను. నీ పాదాలు యిటు యివ్వు," అంటూ రాధ పాదాన్ని అందుకోపోయాడు కృష్ణమరాయుడు.

రాధ ఉలిక్కిపడింది.

తన పాదాన్ని వెనక్కి తీసుకుంది.

లేచి నిలబడింది. "నా పాదాలు మీరు తాకడమేమిటి? మీ పాదాలదగ్గర యింత చోటు కోరుకున్నదాన్నేగాని నా పాదాలు మిమ్మల్ని తాకనివ్వను. లేవండి" అంది.

"ఫరవాలేదు. లయకే లయలను నేర్పే నీ పాదాలను తాకినా ఫరవాలేదు. యిటు యివ్వు" అంటూ ఆమె నిలబడివున్నా మళ్ళీ ఆమె పాదాలదగ్గర కూర్చున్నాడు కృష్ణమరాయుడు.

ఆమె ఒక్క వూపులో నాలుగడుగులు వెనక్కి వేసింది. "ఇంత త్వరగా ఆవిడ హంసమంజీరాలు మీ చేతికి ఎలా వచ్చాయి?" అంది రాధ.

"దొంగతనం చేయలేదులే. యీరోజు కార్యం అన్నారు. లక్ష్మిని ముస్తాబుచేసి గదిలోకి పంపించారు. బయటకు తలుపులు మూస్తారు. లక్ష్మిని అడిగే తీసుకున్నాను."

"నా కివ్వడానికని కూడా చెప్పారా?" అంది రాధ ఆతృతగా.

"ఆమె అడగలేదూ, నేను చెప్పలేదు. అదికాకపోయినా యిప్పుడా ఆరాలన్నీ ఎందుకు రాధ? నువ్వు మా ఆవిడ హంసమంజీరాలు కావాలన్నావు. యిస్తానని మాటిచ్చాను. మాట నిలబెట్టుకున్నాను. యిక ఆవొట్టు చెల్లదు. నీ పాదాలను ఈ మంజీరాలతో అలంకరించనీ" అన్నాడు కృష్ణమరాయుడు.

"మంచివారే! తొలిరాత్రే యింటిపట్టున వుండకుండా ఆమెగారిని వంటరిగా గదిలో వదిలి యిక్కడికి వచ్చేస్తారు. ఆమె మనసు ఎంత క్షోభిస్తుంది? ఊరంతా ఏమనుకుంటారు?"

"ఎవరేమనుకున్నా నా కనవసరం. యీ పెళ్ళి చేసుకున్నదే యీ ఘడియ కోసం."

"మీ కవసరం లేకపోయినా నా కవసరం వుంది. మీరు నిందలపాలు కాకూడదు. యీ మూడురాత్రులూ మీరు వారితోటే గడపాలి. ఆ తరువాతే. పదండి" అంటూ కృష్ణమరాయుని వీధివాకిలిదాకా నెట్టుకుంటూ వచ్చింది రాధ బతిమిలాడుతున్న ధోరణిలోనే.

"అలాగే వెళ్ళిపోతాను. యీ మంజీరాలను నీ కాళ్ళకు పెట్టనీ" అన్నాడు కృష్ణమరాయుడు.

"నా పాదాలను మీరు తాకడానికి వీల్లేదు. నా చేతికివ్వండి." అంటూ అతని చేతిలోని మంజీరాలను అందుకుంది రాధ.

కదిలే వుద్దేశ్యం లేనట్టు నవ్వుతూ నిలబడిపోయి రాధను గట్టిగా కౌగిలించుకున్నాడు కృష్ణమరాయుడు.

విదిలించుకుంటూ "వెళ్ళకపోతే నా మీద ఒట్టే!" అంది రాధ.

(సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Piinted at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవటం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా మింటే రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.**

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని**
**ఎదుర్కోండి!**




DC.G.74 TL

